# మిల్క్‌మెయిడ్ వాడుట మీ నిత్యవిధిగా చెయ్యండి

తీపి అయిన మిల్క్‌మెయిడ్ గడ్డ పాలు కలిపి తీపి వస్తువులను చేస్తే అవి ఎక్కువ రుచిగానూ, ఎక్కువ పోషక వంతముగానూ వుంటాయి. వీటిని వాడుట ఎంతో సులభము. పైగా, మీరు పంచదారను పొదుపు చేయ గలరు. ఎందుచేత నంటే మిల్క్‌మెయిడ్ గడ్డ పాలలో శుద్ధి చేయబడిన పంచదార చేర్చబడినది.

ఈ రోజే 2 డబ్బాలు కొనండి! వాటిని మీరు ఎన్నో విధములలో వాడవచ్చును. మిల్క్‌మెయిడ్ అంటే శుద్ధమయినవి, తాజా అయిన మరియు రుచి అయిన పాలు!



ఇవి పండ్లతోను, పుడ్డింగ్‌లతోను తినుటకు దివ్యంగా వుంటాయి




ఇవి కాఫీ, టీలకి మంచి రుచి నిస్తాయి



ఇవి మీ పాపకు సహజమయిన పోషకము నిస్తాయి

ఇప్పుడు విరివిగా లభిస్తున్నాయి



అత్మం సోమేశ్వరరావు సమర్పించు
సూర్య చిత్రా వారి
పెళ్ళి రోజు
దర్శకత్వం
మానాపురం
నిర్మాతలు
ఎం.కె.శ్రీరాము
K.నాగేశ్వరరావు
నార్త్ ఆంధ్ర: తూర్పుగోదావరి, విశాఖపట్టణం, శ్రీకాకుళం జిల్లా: అప్సర పిక్చర్స్, రాజమండ్రి
సౌత్ ఆంధ్ర: పశ్చిమగోదావరి, కృష్ణ, గుంటూరు, నెల్లూరు జిల్లా: శ్రీ నటరాజ్ పిక్చర్స్, విజయవాడ
సీడెడ్: గౌరి, గుంతకల్లు
త్వరలో!
Poophala

1968–69 లో మీ అదృష్టము
మీరు ఒక పోస్టు కార్డుమీద మీ ప్రశ్నను
పేరున్నైనా వ్రాసి. మీ అడ్రసు తెలుపండి
మేము మీకు రాబోవు పన్నెండు నెలలో జరుగ
ముఖ్య సంఘటనలు
ఆరోగ్య వ్యాపారంలో
లాభ నష్టాలు, నౌకరీ
లో ప్రమోషన్లు
ప్రయాణాలు, సం
తానము, వివాహ
ము మొదలగు వాటితో

మరియు పీడు నక్షత్రాలకు శాంతి చేసుకొను
విధానములు రు. 1-25 లకే పంపెదము.
పోస్టేజిలెటరుచే మీ ఖర్చు తెలుపగలరు.
PT. DEV DUTT SHASTRI
RAJ JYOTSHI (MAP)
P. B 86, JULLUNDUR CITY.



చక్కని తెలుగు పుస్తకం
జ్యోతిష సాముద్రికం
రచన : శార్వరి
ప్రాచ్యపాశ్చాత్య హస్తసాముద్రిక రహస్యా
లన్నీ పరిశీలించి పదేండ్లు పరిశోధించి ప్రసిద్ధ
కథకుడు నవలాకారుడు శ్రీ శార్వరి వ్రాసిన
చక్కని హస్తసాముద్రిక గ్రంథం. మూరు
చిత్రాలతో 500 పేజీలలో మూడుభాగాలుగా
వెలువడింది త్వరపడండి. కొద్ది కాపీలేఉన్నాయి
వెల్ల రు.6/-. పోస్టేజి రూ. 1 అదనం.
CRESCENT BOOKS
12-B, Subba Reddy St, Madras-33.


## రచయితలకు మనవి

మా కార్యాలయం చేరే ప్రతిరచనతోనూ దానిరచయితగాని, రచయిత్రిగాని అది తమ స్వంతరచ నేననీ, దేనికీ అనుకరణ కాదనీ హామీ వ్రాసి పంపాలి. ఇటువంటి హామీలేని రచనలను ప్రచురణకి స్వీకరించలేము.

సంపాదకుడు
ఆంధ్రసచిత్రవారపత్రిక

# ఉత్తరాలు

### కథలు

శ్రీమతి వనజా శరన్‌గారి ఉత్తరం చదివిన తరువాత నేను జవాబు వ్రాయడం అవసరం అని అనుకుంటున్నాను. ఈ కథ వ్రాయడంలో స్త్రీ జాతినే కించపరచాలనే భావం నాకు లేదు. మంచికి, చెడుకి జాతి భేదం ఉంటుందని అనుకోలేదు శ్యామల 'అసహ్యంగా' ప్రవర్తించిందని స్త్రీజాతి అంతా అలా ప్రవర్తిస్తున్నారని అనుకో నవసరంలేదు. వనజాశరన్ గారిని వ్యక్తిని కేవలం వ్యక్తిగానే మాత్రం అర్థం చేసుకోవాలని కోరు తున్నాను. పోతే రమణమూర్తి ప్రవర్తన సంస్కార యుతమా? నాగరికతా? అని ప్రశ్నించారు. అలా అని నేను కథలో ఎక్కడా వ్రాయలేదు. కథకి పేరు రమణమూర్తి సంస్కారమూర్తి అని భావించి పెట్టలేదు. యితర కారణాల వల్ల మీకే సూచన కనపడితే రచయితగా నేను బాధ్యుణ్ణికాను. బాహ్యంగా అందరూ కనపరిచే సంస్కారానికి లోపల నిగూఢంగా దాచుకున్న వ్యక్తిత్వపు తేడాలను తెలియజేయాలనే ఉద్దేశ్యంతోనూ, నటన, కృత్రిమపు చాయలు నిండిన యిటువంటి సంస్కారవంతులకి సంకెళ్ళు వేయాలనే భావం తెలియజేయాలని ఆపేరు పెట్టడం జరిగింది. అతివేగంతో మారిపోతున్న మన హైందవ సామాజిక ధర్మం, సంస్కారపు విలువలు మనల్ని ఎటువంటి గమ్యానికి తీసుకుని పోతున్నాయో సూచించాలని ఈ కథ వ్రాయడం జరిగింది. ఈ కథలో వంటి వ్యక్తులు మన మధ్య యిప్పటికే ఉన్నారని నా అభిప్రాయం. భవిష్యత్తులో వారిసంఖ్య యింకా ఎక్కువగా ఉండవచ్చేమో. అటువంటి వ్యక్తులు ఎవరూ లేరు! అసహజం. అసలు ఉండబోరు లని అనుకుంటే నేను జవాబు చెప్పలేను. యిది కేవలం నా వ్యక్తిగతమైన అభిప్రాయం. అందరూ ఏకీభవించి తీరాలని అను కోను.

అత్తిలి వెంకటరత్నం.
విశాఖపట్నం.

* * *

అత్తిలి వెంకటరత్నంగారి పెద్దకథ "సంస్కారానికి సంకెళ్లు" లో స్త్రీజాతిని చాలా అసహ్యంగా చిత్రించారనియు రమణ మూర్తిలాంటి పురుషులు, శ్యామల వంటి స్త్రీలు ఉండరు అని శ్రీమతి బి. వనజా శరణ్ (అనకాపల్లి) సోదరి వ్రాసిన ఉత్తరము చదివిన తరువాత నాకు ఈ విషయమై తెలిసినది — వ్రాయవలెనని తోచినది.

5 సంవత్సరముల క్రితందాకా నాకు ఇటువంటి కథలు చదివినప్పుడు అసహజముగను అటువంటి వారు లోకములో ఉందురా అను సందేహమును కలుగు చుండెను. కాని షికార్లకి సినిమాలకే త్రిప్పలేదని తన భర్తమీద నిందమోపి పరాయి మగాడి వెంటచేరిన స్త్రీని ఈ కండ్లార చూచిన దుర్భాగ్యవతిని నేను. మగవారి ఇష్టము లేకుండా ఆమెతో సంబంధాన్ని తెగతెంపులు చేసుకొందామన్నను వదలకుండ పట్టుకు వ్రేలాడే వనితామణి ఆమె.

అదే పెండ్లికాని స్త్రీ లేక విధవ అంతే లోకము ఆమెను నానా అల్లరి చేసునుకాని ఈమె వివాహితురాలై భర్త బిడ్డలుండుటచే ఏమి చెప్పక ఆమెను సంఘము గౌరవించి ఆమె నడతను హైసొసైటీలో జరుగు సాధారణ చర్యలుగా భావించుచున్నారు.

ఈమె తర్వాత ఈమె అంత దగ్గరగా కాకపోయినను ఇటువంటి వారు అనేకులను కలిసేదుర్భాగ్యము కలిగినది. అటుపిమ్మటనే నాకు కథలు ఇటువంటి వారిని చూచియె రచయితలు వ్రాయుంచుందురు అని అనుకోవలసివచ్చినది.

—శ్యామలాదేవి (మదరాసు).

* * *

ది 6—9—68 పత్రికలోని రెండు కథలు (అవి కథలా? వ్యాసములా?) చాలా బాగున్నవి. నేను సరిగా యీవిధమైన కథలే ప్రచురించిన బాగుండును అనుకుంటూ ఉండేవాణ్ణి కనీసం ప్రభుత్వ అయినా "సిరు పల్లమెరుగు" అను నీతి తెలుసుకుంటే దేశాన్కి యింత ఆర్థిక యిబ్బంది రాదు.

"సిగ్గు తెరలు" ఎంత చదువుకున్న వ్యక్తికైనా 'సిగ్గే సింగారం' అని అది ప్రకృతి నైజమని నిరూపిస్తుంది. ఏమైనా రెండుకథలు చాలా బాగున్నవి.

—వెంకటరత్నం (కాకినాడ).

* * *

6.9.68 సచిత్రవార పత్రికలో ప్రచురింపబడిన 'సిగ్గుతెరలు' కథ చాలా బాగుంది. కథలో పెళ్ళికొడుకు రామక్రిష్ణ తన పంచ కొంగుతో కంటినీరు తుడిచినట్లు ఉంది. కాని ఆర్టిస్టు రామారావ్ గారు పొరపాటుగా పెళ్ళికొడుకుకు ప్యాంటు తొడిగించారు. ఏమైనా ఇటువంటి రస భరితమైన కథ అందించినందుకు నా వందనములు.

—ఇబ్రహీమ్ ఖాన్ (రేపల్లె)

### ప్రత్యేక సంచిక

వినాయక చవితి పత్రిక ఎంతో ఆకర్షణీయంగా వున్నది. ప్రతి ఒక రచన మమ్మల్ని మరపింపచేసిందంటే నమ్మండి. "మొగలిపొదలు" సీరియల్ నిజంగా పేరుకు తగినట్లుగావుంది. ఒక్కొక్కవారం చదువుతుంటే పొదలోనుండి ఒక్కొక్క మిన్నాగు బయటకు వస్తుంది. "సుజాత" సీరియల్ సహజంగానే నడుస్తుంది. నేటి సమాజానికి దగ్గరలో వుంది. "ఇంటర్‌వ్యూ" కథ చదువుతున్న కొద్ది ఎంతో ఆసక్తిగా ముందుకు నడిచింది. చదివినంతసేపు నవ్వేన్ను బాగవుంది. చదివిన తరువాత నాకు అలాంటి ఇంటర్‌వ్యూ ఒకటి జరుగుతే బాగుండు ననిపించింది. కాని వెంటనే మా శ్రీమతి అడ్డు వచ్చింది. కాని అంత డబ్బున్న ధనికులలో అటువంటివి

# 'ఇప్పుడు నా చురుకుతనాన్ని చూచి

## అందరూ ఆశ్చర్యపడుతున్నారు!'



కాని, కొన్ని నెలల క్రితము నీరసంతో నేను ఆఫీసు పని సరిగ్గా చేయలేక పోయాను. చివరకి ఒక డాక్టర్ని సంప్రదించాను.

డాక్టరు ఇలా అన్నారు: "మీకు కావలసినంత పోషణ లభించలేదు. హార్లిక్స్ త్రాగండి."

హార్లిక్స్ త్వరలోనే నాకు శక్తి ఉత్సాహములను కలిగించింది. ఇప్పుడు నేను ఓపికతో చురుకుగా పని చేయడం చూచి అందరూ ఆశ్చర్యపడుతున్నారు!





**హార్లిక్స్ వాడడం వల్ల శక్తి ఉత్సాహాలతో వున్నాను!**

సరైన పోషణ లేక పోవడం వల్ల కలిగే నీరసము, అలసట కొన్ని సమయాల్లో ఉద్యోగమునకే హాని కలిగించవచ్చు. వీటికి ప్రతివిధిగా డాక్టర్లు హార్లిక్స్ సిఫార్సు చేస్తారు. హార్లిక్స్ అదనపు పోషణత్వాన్ని యిచ్చి శక్తి ఉత్సాహము, మంచి ఆరోగ్యము కలుగచేస్తుంది.




# హార్లిక్స్ అదనపు శక్తిని కలిగించును!

HL 7486 A

ఉన్నత ఆదర్శాలు గలవారు కనిపించటం అరుదు. భానుమతి గారి రచనను గురించి మేము వేరే వ్రాయ నవసరం లేదు. "ఆశ్రయం" నాటకం, ఇడియట్ కథ, కార్టూన్లు, హాస్యరచనలు మమ్మల్నెంతో అలరించాయి.

—కె. యస్ శీత, కె. నాగరాజు

—(హైదరాబాద్).

* * *

పండుగ పత్రిక అత్యధిక ఆనందమును కల్గించినది. కథలలో ముఖ్యంగా నన్ను ఆకర్షించినది 'కామాక్షి కథ'. ఆశ్చర్యం! యీసారి భానుమతి గారు, 'అత్తగారు' శీర్షిక మార్చినందుకు

'ఇడియట్' కథ చివరిలో ఏం బాగా లేదు. 'ఇంటర్వ్యూ' బాగుంది. రచయితకి నా అభినందనలు.

'రష్యన్ చలోక్తులు' బాగున్నాయి. ప్రతివారం ప్రచురిస్తారని ఆశిస్తాను.

—డి. ప్రమీల (హైదరాబాదు.)

* * *

అబ్బ! ఎన్నాళ్ళకు చూశామండీ మీ పత్రికలో ఆదివిష్ణు, హవిస్ ల రచనలు. వినాయకచవితి శుభ సందర్భాన మా అభిమాన రచయితల రచనలు ప్రచురించి నందుకు మిమ్మల్ని నిజంగా అభినందిస్తున్నాము. తరచు వారి రచనలు ప్రచురించినట్లయితే మేము చాలా సంతోషిస్తాము.

—ఎ. పార్వతి, ఎ ఎస్. రావు (న్యూపలోంఛా)

* * *

(30 8 68)వ తేదీ వారపత్రికలో మీరు ప్రచురించిన భారతీయ భాషల వార్తా పత్రికల అమ్మకాల పట్టికలో మన తెలుగుది పదవస్థానమనీ, కన్నడం ఆరవస్థానమని తెలిసి చాలా ఆశ్చర్య పడ్డాను. మనవాళ్ళ పుస్తక వ్యాపారం అంతంత మాత్రమే నన్న మాట!

ఈవారం ఇంటర్వ్యూ, యిడియట్ కథలు బాగున్నాయి. ఆదివిష్ణుగారి ఆశ్రయం నాటకం సరిగ్గా బోధపడలేదు. సీరియల్స్ సరేసరి!

కొన్ని కార్టూన్సు మరీ ఎబ్బెట్టుగా వుంటున్నాయి. ఇది మంచిదికాదు

—యుగంధరశ్రీ (హైదరాబాద్)

* * *

30 8.68 సచిత్ర వారపత్రిక ముఖచిత్రము చాల బాగుంది. రచన శ్రీ గెనిశెట్టిగార్కి మా కృతజ్ఞతలు. గానీ ఇదే తేదీ పత్రికలో మనహాస్య నటీ నటులు దానిలో హాస్య నాగభూషణగారు "రాము" చిత్రములో మంచి పేరు తెచ్చినవి అని కూడా వ్రాసినారు. ఇది పొరపాటు అని అంటున్నాను. పొరపాటుగా పాఠకులకు తెలియపర్చెదరని ఆశిస్తున్నాను.

—మదనమోహన మాలవ్యా (రాయవరం).

## ఉత్తరాలు

ఒద్దుసార్, లేఖావాణిలో విజయలలిత చేత జవాబులు . ఒద్దంటున్నాంగా! సినిమాతారలచేత జవాబులిప్పించి పాఠకులను బాధించకండిస్వామీ. మీకు పేజీలంత ఎక్కువగా కన్పిస్తే లేఖావాణికి గాను కేటాయించే పేజీని తెల్లకాగితంగానే ఉంచేయండి. మేం దాన్ని సంతోషంతో రఫ్ వర్క్ కోసరం వాడుకుంటాం, కాని ఆశీర్షికలో వచ్చే ప్రశ్నలు, జవాబులు భరించడం మాతరంగాదు. ఇలాచేస్తే మీరు మాకు ఎంతో మేలు చేసిన వారవు తారు.

లేదంటారూ, మీరు పత్రికని డివేల్యూచేసిన వారవుతారు. అనగా పత్రిక పాఠకుల్ని డివేల్యూ చేసిన వారవుతారు. (—దీనికి మీకు హక్కుందంటారా?)

—డి. సాయినాథ (హైదరాబాదు.)

### సి ని మా

13—9—68 ఆంధ్రపత్రిక సచిత్రవార పత్రికలో శ్రీ ఎం. సత్యంగారు నేను వ్రాసిన శ్రీ రామారావు వ్యాసంపై కొన్ని ఆక్షేపణలను వివరించారు.

ఏపత్రికయొక్క గౌరవ ప్రతిష్ఠలకుభంగం వాటిల్లే విధంగా నేను యేలాంటి అనుచితకార్యం చెయ్యలేదనుకుంటాను. నాకు శ్రీరామారావుపై యేర్పడ్డ నిశ్చితాభిప్రాయాన్ని ఒక పత్రికా ముఖంగా వెల్లడించాను.

నా వ్యాసంలోని నిజానిజాలను బాగోగులను పాఠకులకే వదిలేస్తున్నాను.

ఏమయినా నాపట్ల శ్రీ సత్యంగారు ప్రదర్శించిన గాఢాభిమానం శ్రద్ధాశక్తులకి ఆయనని మనసారా అభినందించక పోతే యెలా?

—శ్రీనివాస్ (మదరాసు). ●

## గమనిక

**ఉత్తరాలు రాసేవారు తమ పేరు, చిరునామా పూర్తిగా తెలుగు లిపిలోనే రాయాలి. ఇంగ్లీషు (లేక ఇతర) లిపి అక్షరాలు వాడిన వారి ఉత్తరాలు ప్రచురించటానికి వీలుకాదు.**

—సం.


# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం: 20—9—'68
కీలకనామ సం॥ భాద్రపద మాసం బ. త్రయోదశి

సంపుటము : 61 సంచిక : 4

స్థాపితము: 1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీథి, మద్రాసు-1

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 26.00 |
| 6 మాసముల చందా | 13.00 |
| 3 మాసముల చందా | 6.50 |


## విషయానుక్రమణిక

# మాపక్షం కానివారు మా పగవారు

చెకొస్లోవాకియా మీద ఇనప తెర దించారు. పత్రికల మీద నిర్బంధాలని తిరిగి అమలు పరిచారు. కాదని అధికారవర్గాలు అప్పటికే మేధావులని దేశం వదిలి పొమ్మని సలహా ఇచ్చారు. ఇక నిస్సహాయుడయిపోయిన ధైర్యశాలి డూబ్‌చెక్ తమ పార్టీవారికి ప్రస్తుతం సోవియట్ నాయకుల విశ్వాసాన్ని సాధించటమే ముఖ్య కార్యమని చెప్పారు.

ఒక వయిపునుంచి చూస్తే కనిపించేది ఇది. రెండవ వయిపునుంచి చూస్తే కొంత ఆశ పుట్టించే పరిస్థితి కనిపిస్తుంది. అదేమిటంటే—ఏభయి ఏళ్ళ తర్వాత కూడా కమ్యూనిజం బలం చేకూర్చుకోలేక పోయిన శిశువు వంటిది అని. ఈ బలహీనమయిన శిశువు రక్షణకి కత్తులు, తుపాకులు, టాంకులు కావాలి. ఆయుధబలాన్ని తీసేస్తే విప్లవం శత్రువులు, రివిషనిస్టులు పుట్టుకువస్తారని రష్యా సిద్ధాంతం. ప్రాగ్‌లో రష్యా రాయబారి, 'సోవియట్ యూనియన్‌కి ఏర్పడిన ప్రమాదం తప్పిపోయేవరకూ జెకొస్లోవాకియాలో రష్యా సేనలు ఉంటాయి,' అని. దాని అర్థం ఏమిటి? కమ్యూనిస్టులుగా పుట్టి పెరిగినవారు కూడా తమదేశంయొక్క ఆర్థిక పరిస్థితిని చక్కపెట్టుదామని ప్రయత్నిస్తే ప్రపంచంలో కెల్లా పెద్ద ఆయుధ బలాలలో ఒకటి కల ఒక-గొప్పదేశం—అణ్వస్త్రాలు కల ఒక దేశం, యూరప్‌ని నిముషాలలో ధ్వంసం చెయ్యగలదేశం—తన భద్రతకి ప్రమాదం ఏర్పడుతున్నదని వాదిస్తున్నదని అర్థం. తలుచుకుంటే ఈ పెద్ద దేశం తన బలంతో ఎటువంటి ప్రమాదాన్నయినా ఎదుర్కొనగలదు.

**మాట - చేత**

చెక్ సంఘటన వల్ల మనకి తెలిసినదేమిటంటే, కమ్యూనిస్టులు ప్రజాస్వామ్యాన్ని గురించి మాట్లాడుతారు కాని ప్రజాస్వామ్యంమీద వారికి నమ్మకం లేదు, అని; కొందరు అల్పసంఖ్య వర్గంవారు

వ్యక్తిగత స్వేచ్ఛని కాదని పరిపాలిస్తారు, అని.

ఈ సందర్భంలో మరొక విషయాన్ని గుర్తుకి తెచ్చుకోవాలి. అది చిన్నదేశాల నిస్సహాయత. మొదటి ప్రపంచ యుద్ధం ప్రజాస్వామ్యం కోసం జరిగింది. శ్రీ విల్సన్ 'పద్నాలుగు సూత్రాల'ని విశదీకరించారు. వీటిలో అన్నిదేశాలవారూ స్వయంగా తమ నిర్ణయాలని తామే తీసుకొనటం ఒకటి. దీనికోసం 'లీగ్ ఆఫ్ నేషన్స్' లేక అయిక్యరాజ్యమండలి ఒకదానిని నెలకొల్పారు. దీని ద్వారా వచ్చిన శాంతి ఏమిటి, ఎటువంటిది? హిట్లర్, స్టాలిన్, ముసోలినీలు అధికారంలోకి వచ్చిన శాంతి. ఇక రెండవ ప్రపంచ యుద్ధం ఎందుకు జరిగింది? అన్ని యుద్ధాలనీ బహిష్కరించేందుకు చేసిన యుద్ధం ఇది.

అయిక్యరాజ్య మండలి బదులు 'అయిక్యరాజ్యసమితి' అనే సంస్థ ఒకటి వెలిసింది. ఇది ఎందరికో ఉద్యోగాలని కల్పించినసంస్థ.



మద్రాసులో అమెరికా కొత్త కాన్సల్ జనరల్ థామస్ రెకెనగల్.

దీని అంశాలలో చిన్నదేశాల రక్షణని కోరేది ఒకటి ఉంది.

**పంచశీల మహాస్త్రం**

భారతదేశంలో శ్రీ జవహర్‌లాల్‌నెహ్రూ ఉదజని బాంబుని మించిన మహాస్త్రం ఒకటి కనిపెట్టాడు. దానిపేరు 'పంచశీల'.

వీటిలో ఏవయినా—ఇంత కర్చుకి కారణమయిన వాటిలో ఏవయినా—యుద్ధాలని బహిష్కరించ గలిగాయా? చిన్నరాజ్యాలని రక్షించగలిగాయా? ఇంకా అడవిలో చలామణీ అయ్యే ధర్మమే ప్రపంచంలోని రాజ్యాల మధ్య చలామణీ అవుతున్నది కదా! సింహబలమే ధర్మం అయి కూర్చుంది కదా? (శ్రీ విల్సన్ స్వయం—నిర్ణయంకూడా నిజమయింది—బలం ఉన్నవారి స్వయం నిర్ణయమే చెల్లటం జరుగుతున్నదనవచ్చు.)

**ఎందుకు నిస్సహాయులు?**

చెక్ సమస్యమీద ఒకరు లండన్ 'ఎకానమిస్టు' పత్రికకి ఉత్తరం రాశారు. అది ఇలా ఉంది—

'చెకొస్లోవాకియాని సోవియట్ పక్షం వారు ఆక్రమించినప్పుడు పాశ్చాత్య రాజ్యాలవారు చెయ్యగలిగిన దేమీ లేదు కాబట్టి నిస్సహాయులయిపోయారనే వాదం ఉంది. దీనిని ఆధారం చేసుకుని ఎందరో ఎన్నో విధాలుగా వాదించారు. ఈ మూలవాదం సరయినదేనా?'

'ఆక్రమణకి పూర్వం పాశ్చాత్య రాజ్యాలు చూపించిన ఉదాసీనతే సోవియట్ వర్గాలవారి నిర్ణయానికి కారణం అయిందని వాదించినా తప్పు లేదు. ముందు జరిగిన చరిత్ర దీనికి తార్కాణం. 'బెర్లిన్ గోడ' నాలుగు రాజ్యాల ఒప్పందానికి వ్యతిరేకం. గోడ కట్టటం మొదలయిన సమయంలోనే పాశ్చాత్య రాజ్యాలవారు తమ వ్యతిరేకతని చూపించి ఉండవచ్చు. వారు ఆ పని చెయ్యలేదు. అకాబా ఖాతం ముయ్యటం కూడా 'ముగ్గురి ఒప్పందా'నికి వ్యతిరేకమే. అప్పుడూ ఏ పాశ్చాత్య మహా

నావనీ పంపలేదు. ఇలా పంపినా వచ్చిన గొడవని ఎదుర్కొనే సైనిక బలం పాశ్చాత్య రాజ్యాలవారికి ఈ ప్రాంతంలోనే వుంది. ఒక్క క్యూబా, వియత్నాంల లోనే పాశ్చాత్యరాజ్యం ఒకటి—అమెరికా—చర్య తీసుకుంది.

**నాటో**

వార్సా సైన్యాలు కదలటం ప్రారంభించగానే 'నాటో' రాజ్యాలు అభ్యంతరం చెప్పిఉంటే రష్యా కొంత సందేహించి ఉండేదేమో. నాటో వర్గాలు సైనిక దళాలనే కదిపి ఉంటే రష్యా మరింత సందేహించి ఉండేదేమో. సోవియట్ అధికారాన్ని ఎదిరిస్తే అణుయుద్ధం మొదలవుతుందనే భయం పాశ్చాత్యరాజ్యాల విధానాన్ని బలహీనం చేస్తున్నది.

చెకోస్లొవాకియాలో సోవియట్ చర్యని పాశ్చాత్యరాజ్యాలు ఖండించవచ్చు. కాని, ఖండన బదులు తామే ప్రతిచర్యకి పూనుకొనకపోతే మాటలు దండగ అవుతాయి, అంతే.

**జార్-క్రెమ్లిన్**

పంతొమ్మిదవ శతాబ్దంలో ఒక రష్యన్ జార్ తన దేశం విధానాన్ని స్పష్టంగా, చెప్పాడు. 1881 లో మూడవ అలెగ్జాండర్ ఇలా అన్నాడు—

'మా అధికారాన్ని బలహీనం చేసే వీ ప్రయత్నాన్నయినా ఎదిరించి మారాజ్యాన్ని బలపరచటానికి మేము దృఢనిశ్చయానికి వచ్చాము.'

1968, ఆగస్టు 22 ప్రావ్దా పత్రిక ఇలా రాసింది: 'సోషలిజం రక్షణ మా అత్యంత అంతర్జాతీయ కర్తవ్యం, చెకోస్లొవాకియా దూబ్చెక్‌కింద మూలాధారాలయిన లెనిన్ సిద్ధాంతాలకి వ్యతిరేకంగా ప్రవర్తించటం ప్రారంభించింది. పార్టీ జీవితంలో కేంద్రప్రజాస్వామ్యం, పార్టీయొక్క ఆశయాల వ్యవస్థీకరణలో సమయిక్యత—ఇవే లెనిన్ సిద్ధాంతాలు.'

**కాంగ్రెసు పద్ధతి**

భారతదేశం ధోరణి ఎలా ఉంది?

మన పక్షం కానివారు మనకి పగవారు అని లెనిన్ సిద్ధాంతం. అయిక్యరాజ్యసమితిలో వోటు వెయ్యక భారతదేశం తను రష్యా పక్కా కాదని నిరూపించింది. అంటే చెకోస్లొవాకియా పక్షమూ కాదు. భారతదేశం చేసినదల్లా పాత కాంగ్రెసు విధానాన్ని అనుసరించటమే. ఇది 'స్వీకరించనూ వద్దు, తిరస్కరించనూ వద్దు' అనే సిద్ధాంతం.

ఈ సిద్ధాంతాన్ని కమ్యూనిస్టులు స్వీకరిస్తారా ? లెనిన్ సిద్ధాంతానికి ప్రతికూలంగా ఎలా స్వీకరిస్తారు ? ఇక చెక్ ప్రజలు భారతదేశం సామ్రాజ్య వాదాన్ని బలపరిచిందని బాధపడ్డారు.

పోయిన ఏడు అయిక్యరాజ్య సమితిలో భారత ప్రతినిధి శ్రీ జి. పార్థసారధి రష్యాతోబాటు ఇస్రాయిల్‌ని ఖండించారు.—ఈజిప్టుమీద దాడి చేసినందుకు. ఈసారి రష్యా సేనలు చెకోస్లొవాకియాలోనికి వెళ్ళినా 'ఖండన' అనే మాట ఉండటంచేత భద్రతామండలిలో వోటు వెయ్యలేదు.

**మరెవరయినా సరే**

అంటే, రష్యా కానంతసేపూ భారతదేశం ఎవరినయినా దురాక్రమణ చేసినందుకు ఖండించటానికి సిద్ధంగా ఉందన్న మాట.

భారతదేశంలో అమెరికన్ గూఢచారులని గురించి హడావుడి జరిగింది. చెకోస్లొవాకియా గొడవ తర్వాత భారతదేశంలో ఎవరు రష్యా సేవలో ఉన్నారో తెలిసిపోయింది. కమ్యూనిస్టులలో కూడా ఈ విషయమయి చీలిక వచ్చింది. కొందరు మాత్రమే రష్యాని ఖండించటానికి సిద్ధపడ్డారు.

భారతదేశంలో కమ్యూనిస్టుపార్టీ పత్రికలకోసం కొందరు అమెరికా, బ్రిటన్ విలేఖరులు పనిచేస్తున్నారు. అలాగే కమ్యూనిస్టులకి చెందని పత్రికలకోసం రష్యన్ విలేఖరులని పనిచెయ్యనిస్తారా ? !


శీఘ్రంగా అన్ని రకాల
బాధల ఉపశమనం





**వీపునొప్పి:**
అమృతాంజనాన్ని వీపు, మెడ, భుజాల మీద మర్దనా చెయ్యాలి.

**బెణుకులు:**
బెణికినచోట అమృతాంజనం మర్దనా చెయ్యాలి. వేడినీళ్ళతో కాపడంకూడా పెట్టవచ్చు.

75 ఏళ్ళ పైగా
ప్రఖ్యాతి చెందిన
అమృతాంజనము




AMR-4/Tel




విష్ణుదత్తుడు చెప్పిన కథతో శక్తిదేవునికి కొంచెం పూరట కలిగింది. తెల్లవారగానే, దాశరాజా సత్యవ్రతుని వద్దకు వెళ్లి కనకపురి సంగతి మరొక మారు ప్రస్తావించాడు. అతడు "బ్రాహ్మణశ్రేష్ఠుడా రత్నకూటమనే ద్వీపంలో విష్ణు దేవాలయం వుంది. సముద్రుడే ఆ విగ్రహం ప్రతిష్ఠించాడని ప్రతీతి. వచ్చే ద్వాదశినాడు అక్కడ ద్వాదశియాత్ర అనే ఉత్సవం జరుగుతుంది. ఆ ఉత్సవానికి చాలమంది భక్తులు వస్తారు. అన్ని ద్వీపాలనుంచి జనంవచ్చి సమ్మర్దం ఎక్కువగా ఉంటుంది. అప్పుడు అందరినీ కనుక్కుందాము, ఎవరికైనా తెలిసివుంటుందేమో నీవు చెప్పే పట్టణం!" అని అన్నాడు.

కొన్నాళ్లతర్వాత దాశరాజు కొందరు సెంబడివారు, శక్తిదేవుడు వెంటరాగా వోడలో రత్నకూట ద్వీపానికి ద్వాదశియాత్ర కోసం బయలు దేరాడు. ఒకచోట దాశరాజు శక్తి దేవునితో "బ్రాహ్మణోత్తమా, ఇక్కడ సముద్రతరంగాలు మహా వేగంతో లేచి పడడంవల్ల సుడిగుండాలు ఏర్పడ్డాయి. గాలిపెద్దగా వీచడంవల్ల పడవ ఆ గుండాల బడబాగ్నిలో పడిపోతున్నది. పడవను ఆపలేను. నేను ముసలివాడిని. అదుగో! ఏటిలో విస్తరించుకున్న మెరుపు ఆనిన్నూ... న్నది. దాని కొమ్మలు పట్టుకో. నేను పట్టుకోలేక పోతున్నాను." అంటూ సముద్రంలో మునిగి పోయాడు. పరులకోసం వ్యయమయ్యే పుణ్యవంతుల జీవితమే ధన్యం.

శక్తిదేవుడు ఆ రాత్రంతా ఆచెట్టు కొమ్మను పట్టుకొనే వున్నాడు. దుఃఖం పొంగి వచ్చింది. ఆ మహా వృక్షం మీద ఎటుచూచినా మహాకాయం గల పక్షులు వాలివున్నాయి. వాటిలో ఒక ముసలి పక్షి, జటాయువులాంటిది, పర్వతరాజు వంటిది తక్కిన పక్షులతో మనిషి మాటలతో తమ ప్రయాణం గురించి ఏమో మాట్లాడుతున్నది. శక్తిదేవుడు అది చూచి ఆశ్చర్యపడి, చెవి ఒగ్గి విన్నాడు.

ఆ ముసలిపక్షి ఇలా అన్నది:—"మీరంతా వయస్సులో వున్నారు. తెల్లవారగానే వడిగా పది దిక్కులకు పోగలరు. నేను ముసలి పక్షిను కాంచనపురికి వెళ్లాలి. అదికూడా నెమ్మదిగా వెళ్లవలసి వుంది"

ఆ మాటలు విని శక్తిదేవుడు, దాశరాజు మరణంతో చాలా దుఃఖపడుతున్న వాడైనా, సంతోషించాడు. మానవుల కర్మ విచిత్రమైనది. దుఃఖమనేది, సుఖమనేది నిరంతరం వుండవు. శక్తిదేవుడు నెమ్మదిగా ఆ పక్షులరాజుశాఖంతో వున్న పక్షి పక్షుకు వెళ్లి దాని రెక్కలకొనల సందులలో ఇరుక్కుని కూర్చున్నాడు. ఆపక్షి తెల్లవారగానే, వడిగా బయలుదేరి కనకపురి చేరింది. అతడూ క్షణంలో ఆ పట్టణం చేరాడు. పక్షి రెక్కలనుంచి కిందికి దూకాడు.

కనకపురి కాంచన స్తంభాలు, కాంచన తోరణాలు గల సౌధాలతో ధగధగా మెరిసి పోతున్నది. కుతూహలం కలిగించేవాటికంతా పుట్టినిల్లుగాను, సకల సంపదలకు ఆటపట్టుగాను కనిపించింది. మనోరథాలకుగాని, గాలికిగాని చొరరాని పట్టణంగా తోచింది. శక్తిదేవుడు సంతోషం నిండిపోయి, నగరాన్ని చూస్తూ నిలబడి పోయాడు.

ఇంతలో ఎవరో స్త్రీలు అక్కడికి వస్తూవుండడం చూచాడు. వారు విద్యాధర రాజకుమారి చెలికత్తెలు. శక్తిదేవుడు వారికి ఇష్టంగా, మృదువుగా మాట్లాడుతూ, వారిని "ఎవరుమీరు, ఎక్కడివారు?" అని అడిగాడు. వారు "మేము విద్యాధర రాజకుమార్తె చెలికత్తెలం" అని అన్నారు. "నేను పరదేశస్థుడిని.నాకు మీ దొరసాని దర్శనం చేయించండి" అని కోరాడు శక్తిదేవుడు, వారిని. వారు అతని తియ్యని మాటలకు చాల ముచ్చటపడి, అతన్ని వెంట

ప్రత్యేక సదుపాయం!

సరకు ఉన్నంత వరకే

60 పైసల ఖరీదైన
ఆకర్షణీయమైన
ప్లాస్టిక్ గ్లాసు 10 పైసలకు
మాత్రమే ఈ డబ్బాలో
లభిస్తుంది







ఈ లేబుల్‌ను చూడండి

బలము శక్తి మరియు
రుచికోసం—
క్యాడ్బరీస్
బోర్న్‌విటా!

వంతో అనంగ మంగళ మణిమందిరానికి పిలుచుకొని వెళ్లారు

శక్తిదేవుడు వారివెంట వెళ్లి అనంగునికే మంగళ కరురాలయిన ఆమెను చూచాడు ఆమె కన్నులు అక్కడ తిరుగాడే లీలామయూరం పురి కన్నులలాగ మెరిసి పోతున్నాయి ఆ కన్నుల కాంతులు చెవులవరకు ప్రసరించడంవల్ల ఆమె చెవిలో అందంకోసం నెమలి ఈకలు చెక్కుకున్నదా అన్నట్టు కనిపించింది శబరావతారం ధరించిన పరమేశ్వరుణ్ని అనుకరిస్తున్న పార్వతిలాగ వుంది ఆమె వేషం ఆమె యౌవ్వనమనే పీసుగుసు ఎక్కినట్టు, విలాస కమలవనమే అయినట్టు, మూడు లోకాలు జయించిన మన్మథుని విజయలక్ష్మి సాకారంగా వచ్చినట్లు అనిపించింది శక్తిదేవునికి పవడపు చెట్టు లావణ్యాన్ని దొంగిలించే ఆమె పెదవుల కంతి ఆమె దేహమంతటా వ్యాపిస్తున్నాయి అవి చూడగా, కాముని విలాసవనిపై లేయెండ ప్రసరించినట్టుంది ఆమె అనేక విలాసాలకు ఆటపట్టుగాను, చూపులతోనే అమృతతరంగాలు పుట్టించే లావణ్యనదిగాను కనిపించింది

శక్తిదేవుడు ఆమెను చూచి ఆశ్చర్యపడి ఇలా ఆలోచించాడు — 'ఆహా! లేడి కన్నుల వంటి కన్నుల ఈ సుందరి స్థితి విలాసాలకే అందం తెస్తుంది రూపం విభ్రమాలకు అలంకారప్రాయం దేహం లావణ్యానికి ఆభరణం ఇలా ఆలోచన తర్వాత శక్తిదేవుడు తన సంగతి ఆమెకు విన్నవించాడు ఆమె అతనిని ఆదరంతో సత్కరించింది ''తమ సంగతి వినగోరుతున్నాము'' అని అతడు తియగా ప్రశ్నించాడు

ఆమె తెల్లని నవ్వుతో ఇలా అన్నది — ''నా తండ్రి శశిఖండుడనే విద్యాధరపతి ఆయనకు నలుగురు కుమార్తెలు నేను అందరికన్నా పెద్ద కూతురును నా పేరు చంద్రప్రభ నా తర్వాతి చెల్లెలు చంద్రలేఖ శశిప్రభ మూడవది మంచి శరీర కాంతి గల చంద్రదేఖ నాలుగవది ఉగ్రతపసుడనే ముని ఏదో కారణంతో నా చెల్లెండ్లు ముగ్గురిని మానవ వనితలయిపోండని శపించాడు వారు తమ పూర్వ వృత్తాంతము స్మరించే శాపాంతాన్ని కూడా ముని అనుగ్రహించాడు అయినప్పటికీ, వారి దశకు మా తండ్రి శోకంతో, తన రాజ్యం వదలి తపోవనానికి వెళ్లిపోయాడు ఇక్కడ నేను ఒక్కతెనే, నా చెల్లెండ్రను కలుసుకుంటాననే ఆశతో వేచి ఉన్నాను

''పార్వతీదేవి నాకు ఇంతకు ముందు చెప్పనే చెప్పింది: 'నీకు మానవుడు భర్త అవుతాడు అతడు విద్యాధరపతి పదవి పొందుతాడు నీ చెల్లెండ్లను కూడ నిన్ను కలుసుకుంటాడు' అని నా యీ మనస్సుకు ప్రభువు నీవేనని అనిపిస్తున్నది నీవు నాకు ఇష్టమయినవాడివి నా యిష్టం మా తండ్రికి తెలియజేస్తాను ఎంతయినా కన్యలు స్వతంత్రులు కారుకదా! అందువల్ల నిన్ను వివాహ మాడడానికి మా తండ్రి అనుమతి పొందడం కోసం తపోవనానికి వెళ్ళుతాను నీవు ఇక్కడే మనస్సుకు సంతోషం కలిగించుకొంటూ గడుపు. నేను క్షణంలో వస్తాను నీవు ఈ భవనం పై అంతస్థులోకి మాత్రం వెళ్ళ [illegible]

# ...బృహత్కథామంజరి

చంద్రప్రభ ఇలా చెప్పి తన శరీరకాంతిలో ఆకాశానికి కొత్తగా రంగు వేస్తున్నట్లుగా ఆకాశ మార్గంలో తన తండ్రి ఉన్న తపోవన భూమికి వెళ్లింది

శక్తిదేవునికి కుతూహలం కలిగింది, పై అంతస్థులలో ఏముందో చూద్దామని, పై అంతస్థుకు వెళ్లాడు గదులన్నిటినీ చూడసాగాడు అక్కడ ఒక గదిలో ముగ్గురు పడుకున్నట్టు కనిపించారు వారికి ప్రాణం వున్నట్టు కనిపించలేదు వారు విడివిడిగా మంచాలపై పడుకున్నారు వారిపైన స్వచ్ఛమైన చీనాంబరం కప్పి వుంది వారిని చూస్తూ వుంటే స్త్రీలని తోచింది వారు సజీవలై మనస్సును హరిస్తున్నట్టు, చిత్రంలో వ్రాసినట్టు నిశ్చలంగాను వున్నారు

అతడు ఒక మంచం వద్దకు వెళ్లి పూర్వ (తల వద్ద) భాగంలోవున్న గుడ్డను తీసి చూచాడు ఒక సన్నని నడుముగల అందగత్తె మన్మథుడు జగాన్ని జయించి భద్రంగా దాచిన కుసుమ చాపలత లాగ వుంది కందర్పుడనే గురువే ప్రతిష్ఠామంత్రాలు జపించి ఒక పడకలో కాంతి దేవతను ఆ ఇంట్లో కుదువగా పెట్టాడా అన్నట్టు వుంది

ఆమెను తేరిపార జూచాడు ఎక్కడో చూచినట్టు తోచింది చప్పున స్ఫురించింది ఈమె పరోకారి మహారాజు కుమార్తె కనకరేఖ కదా అనుకున్నాడు ఆశ్చర్యంగా, రెప్పవేయకుండా కొంచెం సేపు చూచాడు 'విరహమనే బడబాగ్ని చుట్టుముట్టిన ప్రవాసమనే వ్యసన సముద్రంలో ఎవరి కోసమైతే వడ్డానో మన్మథ అవుషధివంటి ఆ సుందరి ఈమే ఇదేమిటి ఇంద్రజాలమా? మన్మథుని మోసమా?'' అని తలపోస్తూ, శక్తిదేవుడు మరొక వనిత ముసుగు ఎత్తి చూచాడు మరింత ఆశ్చర్యం కలిగింది తర్వాత పై అంతస్తునుంచి దిగివచ్చాడు

అక్కడ అతనికి ఒక మేలైన గుర్రం కనిపించింది సూర్యుడు ఏమరుపాటులో వుంటే దిగి వచ్చినదా అన్నట్టు, సూర్యుడు దానిని మరిచి పోయాడేమో అన్నట్టు వుంది ఆ గుర్రం ఆ గుర్రం అతనికి తన కాలిగిట్టతో ఒక తాపు ఇచ్చింది అతడు పక్కనే వున్న సరస్సులో నీటిలో పడ్డాడు

కనకపురిలోని సరోవరంలో పడ్డవాడు క్షణంలో వర్ధమాన పుర పరిసరాలలోని కొలనులో తేలాడు చుట్టూ చూచాడు ఆతురత ఎక్కువయింది తను ముందు చూచిన పరిసరాలు లేవు అంతా స్వప్నంలో చూచినట్టుగా అనిపించింది చాల దుఃఖపడ్డాడు నగర వీధులలో తిరుగుతూ రాజ ద్వారం చేరాడు

రాజద్వారం వద్ద తమ మునుపు విన్నదే ''ఎవరైతే కనకపురిని చూచి వచ్చాడో అతనికి మహారాజుగారు తమ కుమార్తె కనకరేఖనిచ్చి పెళ్లి చేస్తారోహో!'' అనే దండోరానే మళ్లీవిన్నాడు అదండోరా వానిని సమీపించి, అక్కడున్న రాజ భటులతో, ''నేను కాంచన పురిని చూచాను, [illegible] విన్నవించండి'' అని చెప్పాడు.

ప్రతిహారుడు ఈ మాటను అంతఃపురంలోని రాజుగారికి ఈసంగతి నివేదించాడు రాజు అతనిని మళ్లీ కనకరేఖ వద్దకు పిలుచుకొని వెళ్లాడు కనకరేఖతో శక్తిదేవుడు ''నేను కనకపురిని చూచాను నిజంగా చూచాను'' అని ప్రతిభాపురస్సరంగా గట్టిగా చెప్పాడు

కనకరేఖ తండ్రి వైపు తిరిగి ''నాయనా, ఈ ధూర్తుడు అబద్ధాలు చెబుతున్నాడు ఇదివరకూ ఒకసారి అబద్ధాలు చెప్పడం వల్ల మనం ఇతనిని వెళ్లగొట్టాము'' అని నవ్వుమొలకైనా ముఖం మీద లేక అన్నది

శక్తిదేవుడు ఆమాట విన్నాడు ''అందమైన కనుబొమ్మలు గల ఓ సుందరీ, నేను కనకపురికి వెళ్లాను అక్కడ చంద్రప్రభ చెల్లెంద్రడు ముగ్గురినీ చూచాను నిన్ను వారి మధ్యన పడుకొన్నట్టూ చూచాను'' అన్నాడు

శక్తిదేవుని మాటలు వినగానే కనకరేఖకు పూర్వ జన్మ స్మరణ కలిగింది అతని మాటలపై ఆదరం కలిగింది శక్తిదేవుడు ఆసమయంలో తన కనకపురియాత్రను గురించి, కనకపురి విశేషాలను గురించి విశదంగా చెప్పాడు

ఆ మాటలన్నీ విన్నతర్వాత కనకరేఖ ఆడనాగు కుబుసం వదలి పెట్టినట్టు మానవదేహం వదలి పెట్టి విద్యాధరి అయి, గగనమార్గంలో కనకపురికి బయలు దేరింది శక్తిదేవుడు ఆమెను అనుసరించలేక పోయాడు దుఃఖం ముంచుకు వచ్చింది రాజమందిరం దుఃఖసముద్రం అయి పోయింది

శక్తిదేవుడు రాజుగారితో సెలవు పుచ్చుకుని వెలుపలికి వచ్చాడు అతనిలో పట్టుదల, హెచ్చింది ఎలాగయినా కనక పురికివెళ్లి కనకరేఖను చూడాలని నిశ్చయించుకున్నాడు పట్టుదలే సహాయంగా, ఆపట్టణం నుంచి బయలు దేరాడు గ్రామాలు అరణ్యాలు నదులు కొండలు దాటుతూ పయనం సాగించాడు నెమ్మదిగా సముద్ర తీరం లోని విటంక పురం చేరాడు

ఆ విటంకపురంలో తిరుగుతుండగా, తను మునుపు ఆనగరంలో కలుసుకొన్న సముద్ర మత్స్యుడనే వ్యాపారే కనిపించాడు సముద్రంలో తామెక్కి పయనించిన ఓడ పగిలి అందరూ మునిగిపోయారుగదా, ఈబేహారి ఎలా బతికాడా అని ఆశ్చర్యం కలిగింది అతనికీ, శక్తి దేవుని చూచి ఆశ్చర్యం కలిగింది

''మిత్రుడా, నేను పగిలిన ఓడపలక పట్టుకొని ప్రాణాలు దక్కించుకొనడానికి గట్టుకు ఈదుతున్నాను కాకతాళీయంగా మానాయనగారు మరొక ద్వీపానికి వ్యాపారార్థం ఓడలో వెళ్ళుతున్నారు నేను పలక పట్టుకొని నీటిలో తేలుతూండడం చూచారు నన్నురక్షించారు'' అని సముద్ర మత్స్యుడు తన సంగతి చెప్పాడు శక్తిదేవుడు తన సంగతి అతనికి పూసగుచ్చినట్టు చెప్పాడు సముద్రమత్స్యుడు శక్తిదేవుని కోసం ఒక ఓడను నిర్మించి యిచ్చాడు శక్తిదేవుడు దానిలో ఉత్పల ద్వీపానికి మళ్లీ బయలుదేరాడు.

(ఇంకా ఉంది)

# రాబిన్ బ్లూ ప్రపంచమంతటా చాలా హెచ్చుగా అమ్మబడుతూన్న నీలి

ప్రపంచమంతటా స్వచ్ఛమైన అల్ట్రా మెరైన్ నీలి. వస్త్రాలకు తెలుపుదనాన్ని చేకూర్చడంలో సాటిలేనిదిగాను రాబిన్ బ్లూ బహుళ ప్రఖ్యాతి పొందివున్నది.

ప్రకృతిసిద్ధమైన కంటికింపుగావుండే తెలుపుదనాన్ని చేకూర్చగల విశ్వాస్యమైన నీలి రాబిన్ బ్లూ. ఒక పొట్లంతో ఎన్నోసార్లు వస్త్రాల ఉతుకవచ్చు. రాబిన్ బ్లూ వస్త్రాలకు చెరుపు చేయదని జ్ఞాపకం ఉంచుకోండి.

నకిలీ వాటిని గమనించండి. అచ్చమైన రాబిన్ బ్లూ కోరి తీసుకోండి.






మీ వస్త్రాలకు ప్రకృతిసిద్ధమైన, కంటికింపుగావుండే తెల్లదనాన్ని రాబిన్ బ్లూ చేకూర్చగలదు



# ఒక వారం విపరీతం




పాలాక్షుడు

## కోర్టులో మత్తుపానీయాల మాయం

విదేశాలకి చెందిన మత్తు పానీయాలు వో పదహారుసీసాలు పట్టుకుని పీరవల్ కోర్టులో హాజరు పెడితే అందులో ఒక ఆరు సీసాలు మాయమయ్యాయట. పోలీసువారు వెతక్కా, అవతల ఒక యింటి ప్రాంతంలో ఖాళీ సీసాలు దొరికాయట. ఆశ్చర్యం—జెం!—అంత దాబుణమైన సాహస జిహ్వాచాపలత్వం వున్నవాళ్లెవరో!




## ప్రేమికుల ఆత్మహత్య

బొంబాయికి చెందిన నాగపురి ప్రాంతంలో 25 ఏళ్ళ విజయకుమార్ అనే అతను 19 ఏళ్ళ ఉమారిసేన్ అనే ఆమెను గాఢంగా ప్రేమించి, ఆమెను వివాహం చేసుకుంటానని తలిదండ్రులతో చెప్పాడట. వాళ్ళు 'చచ్చినా ఒప్పుకోం' అనేసరికి మనస్సు విరిగి, ఆ రాత్రి గుప్పెడు నిద్రమాత్రలు మింగేశాడట. తెల్లారి ఆసుపత్రిలో అతను చనిపోయిన విషయం తెలిసిన ఉమారిసేన్ ఆసుపత్రికి వచ్చి గుండె అవిసేలాగ ఏడ్చి, అవల లేచి, యాంత్రికంగా బయటకు వచ్చి బొంబాయి—కలకత్తా బండి క్రిందపడి, ఆత్మహత్య చేసుకుందట. ఆ వూరి వారంతా యీమె దేహ భాగాలను ఏరి, ఒకటిగా చేసి, ఆమె ప్రియుని దేహంతోపాటు వూరేగించి, ఒకే చితిమీద దహనం చేశారట. ఒకే ఒక్కమాటతో రెండు నిండు ప్రాణాలు పోయాయని తెలిసి, వూరంతా ఆ అమర ప్రేమికులను తలుచుకుని కన్నీరు కార్చారట. మరి వారి తలిదండ్రుల శోకానికి హద్దుంటుందని చెప్పగలమా! పాపం!

* * *

డబ్లిన్‌లో 22 ఏళ్ళ రోనాల్డ్ డఫ్ ఒక క్లబ్ బాల్ రూమ్ డ్యాన్సుకి తన ఎలక్ట్రికల్ గిటార్ వాయిస్తుండగా లోపల కరంటుతీగలు కలిసి (షార్ట్‌సర్క్యూట్) షాకిచ్చాయట. అతను కెవ్వున కేకవేసి పడిపోయి, ఆసుపత్రిలో మరణించాడట.

## ఒకే రకంగా 25 హత్యలు

నేపాళ మాంత్రికుడేం వాడు....






మనదేశం కూడా పురోగమిస్తుంది. శరీరం గగుర్పొడిచే సంఘటనలు మనదేశంలో కూడాపుంటా కుంటున్నాయి. బొంబాయికి ఉత్తర శివార్లలో ఒళ్ళు జలదరించే హత్యలు జరిగాయి. సుమారుపాతిక జరిగినా అంతుచిక్కలేదు. త్రికోణంవంటి దానితో కణతమీద పొడిచి, చంపుతున్నట్లు తేలింది. ఆడా, మగా, చిన్నా పెద్దా అన్న భేదంలేకుండా జరిగాయి యీ హత్యలు. ఈ పాతిక హత్యలూ చేసినవ్యక్తిని మొన్న పట్టుకున్నారు. అతనొక సన్యాసట. తమిళ నాడుకు చెందిన వ్యక్తట. మొదట అతను ఏ పాపం ఎరుగనని బుకాయించి, ఆనక "నేనే చేశాను" అని ప్రకటించాడట. ఇంత భయంకరమైన యిన్ని హత్యలు ఎలా చేశాడో తెలిసినా, ఎందుకు చేశాడో మాత్రం యింకా [illegible].

# అల్లుడ్ని హత్యచేసిన అత్తమామలు

సొంత అత్తగారూ, మామగారూ కలిసి కొంత మంది నౌకర్ల సహాయంతో తమ అల్లుడు ముద్దుకూరి అప్పారావును హత్యచేశారట. మార్చి 22వ తేదీ రాత్రి ఆయనను తమ యింటికి కబురుపెట్టి మరీ చంపారట. " నా ఆస్తినంతా రాసిస్తాను. నన్ను మాత్రం చంపకండి''అన్న అప్పారావు అరుపు తనకు వినబడిందని, తను ఆ సమయానికి అక్కడకు వెళ్లానని, ఆయన ట్రాక్టరు డ్రయివరు శ్రీ గంగ్రెడ్డి రాములు కోర్టులో సాక్ష్యం చెప్పారు. పోలీసులు వచ్చి చూసేసరికి శ్రీ అప్పారావు రెండు సిమెంటు బెంచీల మధ్య పడివున్నారని, గుండెలమీద ఒక కరెంటు తీగ వుందనీ, ముక్కు రంధ్రాలలో కూడా రెండు తీగలు వున్నాయనీ, ముక్కులోంచి నెత్తురు కారివుందనీ నిటారుగా వెల్లకిలాపడి ఆయన శవంవుందనీ అన్నారు. షాకు వల్ల చనిపోతే అలాపడివుండడం అసంభవమనీ, చేతులూ, కాళ్లూ కొట్టుకోడం జరగాలనీ అన్నారు.

శ్రీ అప్పారావు అత్తగారైన కొంగర మంగాయమ్మగారు చాలాకాలంగా ఆయన్ని చంపాలని




ప్రయత్నిస్తున్నట్టుగా ఆధారాలు దొరికాయి. శ్రీ మాతంగివందనం అనే స్కూలు టీచరు తన భార్యకు వుద్యోగం కావాలని శ్రీ అప్పారావు వద్దకు వెళ్లినారనీ ఆయనను పిలిపించి, ''మా అల్లుణ్ణి హత్యచేయాలి. ఆనక అతని తల్లిని కూడా చంపాలి''అని మంగాయమ్మగారు అన్నారనీ, శ్రీ మాతంగి వందనం కోర్టులో చెపుతూ, తను ఎలాగో తప్పించుకుని బయటపడి ఆనక వుళ్ళా ఆచాయలకే పోలేదన్నారు.

ఈ భయంకర అమానుష హత్యకేసు యింకా కోర్టులో నడుస్తూనేవుంది. ఇటు నాగేష్ బావ మరిది సెల్వరాజు హత్యకేసునడుస్తుంది. ఈ రెంటికీ డబ్బే కారణం అని తేలింది.

# గుడ్డివారికి మానసికానందం

గుడ్డివారికోసం పార్కులలోనూ, మరికొన్ని ప్రత్యేక స్థలాలలోనూ సెంటువంటి సుగంధములను చల్లి వారికి మానసిక ఆనందాన్ని కలుగజెయ్యాలని ఒక సంఘం అభిప్రాయపడితే, గుడ్డివారి సంఘం దానికి తమ అసమ్మతి తెలియజేసిందట. గుడ్డివారికి అని స్థలాలు ఆవిధంగా ప్రత్యేకిస్తే ఆ స్థలాల్లో వున్నవాళ్ళను గుడ్డివాళ్ళుగా లోకం పోల్చి జాలిపడుతుందనీ, ఆరకం జాలి తమకు అక్కరలేదని, కళ్లున్న వాళ్ళతో కలిసి తిరగటమే తమ ధ్యేయమనీ జార్జి మిల్లర్ అనే పత్రికావిలేఖరి (యీయనా అంధుడే) బి. బి. సి.లో మాట్లాడుతూ అన్నారట. విన్నారా! ఇది లండన్‌లో జరిగింది.



# ఒకవారం విపరీతం

ఆరణి సమీపంలో వున్న వల్లప్పందల్ అనే గ్రామంలో ఒక స్కూలులో తమిళ వుపాధ్యాయుడుగా వుంటున్న రామన్ తన క్లాసులో వున్న ఒకామెను ప్రేమించి, ఆమెతో తన సొంతఊరైన తిరుచందూర్ వెళ్ళిపోయాడట. కూతురు కనిపించలేదని, అనుమానంతో ఆమె తండ్రి పోలీసులకు రిపోర్టు యిస్తే, పోలీసు లతన్ని అరెస్టుచేసి, ఆమెను ఆమె తలిదండ్రులకు వప్పగించారట. జామీను మీద విడుదలైన రామన్ తన ప్రియురాలిని ఎలాగైనా కలుసుకోవాలని వాళ్ళింటికి ధైర్యం చేసి వెళ్ళాడట కానీ ఆమె తండ్రి అతని కోర్కె మన్నించ లేదట. దాంతో హృదయావేదనకు తట్టుకోలేక 'ఛీ— యీ జీవితం వ్యర్థం' అనుకుని వో బస్సు క్రిందపడి చనిపోయాడట.

## ఆగ్రహావేశాలు!

పాంచాలి అమ్మాళ్ అనే ఆమె కణ్ణన్ అనే అతనిని ప్రేమించిందట. ఆమె తండ్రి ఠర్ వీల్లేదని ఆమెను కణ్ణప్పన్ అనే అతని కిచ్చి వివాహం చేశారుట. పాంచాలి అమ్మాల్ భర్తతో పోట్లాడి, పుట్టింటికి వచ్చి మళ్ళా పాత ప్రియుడితో సంబంధం పెట్టుకుని, అదేమంటే అతనితో లేచిపోయిందట. ఆమె చుట్టాలు ఆగ్రహావేశాలతో ఆమెను వెతికి, వేలూర్ బస్‌స్టాండ్‌లో పట్టుకుని, పీకనొక్కి చంపేరట. ఇది అరిదారి మంగళానికి చెందిన కేసు.

## చరిత్ర ప్రసిద్ధమైన చింతచెట్టు విడిచే రక్తాశ్రువులా?

అళ్వార్ తిరునగిరిలోని చరిత్ర ప్రసిద్ధమైన చింత చెట్టు నుంచి ఎర్రని, రక్తం వంటి ద్రవం చుక్కలు కారడం ప్రారంభించాయట శాస్త్రోక్తమైన పూజలను జరుపుతూ. ఆ కారేచోట గంధం పెడితే ఆగుతోందట. కానీ మరొకచోటునుంచి కారుతోందట ఒహు పురాతనమైన యీ చింతచెట్టు సిగతా చింతచెట్లలాగ కాయలు కాయదట. కేవలం పువ్వే పూసి వూరు కుంటుందట. ఇటువంటి చెట్టు యిలా ఆగ్రహించడానికి కారణం ఏమిటో తెలియలేదు. నమ్మాళ్వార్ యీ చెట్టు క్రింద కూర్చొని 'తిరువాయి మొళి' రాశారట.

* * *

హాంకాంగ్ పత్రిక ఒకటి స్మశానం గిరాకిని విపరీతంగా రాసింది. రానురానూ స్మశానంలో చోటు కరువై పోతోందనీ, 1932 లో ఒక శవానికి సరిపడ్డ స్థలం ఒక డాలర్యుండేదని, ఇప్పుడు 27 డాలర్లు అయ్యిందనీ, ఒక్కొక్క సీజనులో ఖరీదు యింకా పెరుగుతోందనీ, "మీ పెద్దల మీద బ్రతికి బాగుపడు" అనే చైనా సామెత ప్రకారం కొందరు తాతముత్తాతలను పాతిపెట్టిన స్థలాలను లాభాలకు అమ్ముకుంటున్నారనీ ఆ పత్రిక రాసింది—ఈ జిండియా బెటరిన్ దిస్!

## గుడ్డ సంచులతో బంగారం రవాణా!

68 లక్షల రూపాయల ఖరీదుచేసే 34 వేల తులాల బంగారం బొంబాయి ప్రాంతంలో కస్టమ్స్ శాఖ పట్టుకుందట. అతి నేర్పుగా గుడ్డలతో కుట్టిన సంచీలలో యీ బంగారం రవాణా చేస్తున్న 17 మందినీ ముట్టడించబోయేసరికి 15 మంది తప్పించుకుపోయారుట (హే) 1966 నవంబర్ నుంచి యీనాటికి 7.41 కోట్లు కిమ్మత్తు చేసే బంగారం, తదితర వస్తువులు పట్టుకున్నారట ఆ శాఖవారు.

## ఆకలి చావులు

బయాఫ్రా (జెనీవా)లో కరువు చాలా దారుణంగా వున్నదట. తిండికిలేక రోజుకు కనీసం ఆరు వేలమంది చనిపోతున్నారని లెక్కలు తేలింది.

* * *

తమిళనాడు హాస్యనటుడు నాగేష్ బావమరిది సెల్వరాజు హత్య చాలా భయంకరమైనది. కన్న తండ్రి, తోబుట్టిన సోదరి రజినా (నాగేష్ భార్య) కలిసి, కొంతమంది పనివాళ్ళ సహాయంతో అతన్ని చిత్రవధచేసి చంపారు. మృత్యువుతో భయంకరంగా పోట్లాడి, సెల్వరాజు కట్లు విప్పుకుని, రోడ్డుమీదకు పారిపోయివస్తే, కూడాపడి మళ్ళా లాక్కుపోయి స్థంభానికి కట్టి, గునపంతో నెత్తిమీద కొట్టారట. అతనుచనిపోయాక, శవాన్నిఅతనియింట్లోనేదూలానికి వ్రేలాడదీశారట. ఆసమయంలో సెల్వరాజు భార్యతో నటి మనోరమయింట్లోవున్నరజినా సెల్వరాజుయింటి తాళాలు అతని భార్యనడిగితీసుకుని, 'శవాన్ని దూలానికి వ్రేలాడ దీయండి"అని పురమాయించిందట.ఇలాటి సంఘటనలు వింటే శరీరం కుంచించుకుపోతుంది. దీనికి ఏమాత్రం తక్కువకాని హత్య బెండపూడిలో జరిగింది.

డార్లం కబుర్లు

## సబ్బు - అందం

మన చర్మంలో ఒక రకం నూనె ఉంటుంది. ఈ నూనె వల్లనే మన చర్మం నున్నగా ఉంటుంది. అంతేకాక, ఈనూనెలో ఒక ఆమ్ల పదార్థం ఉంటుంది. ఈ ఆమ్ల పదార్థం చర్మంమీది సూక్ష్మ క్రిములని నాశనం చేస్తుంది.

సబ్బులో క్షార పదార్థాలు ఈ ఆమ్ల పదార్థాలకి విరుగుడు. ఈ ఆమ్ల పదార్థాల బలం తగ్గిపోతే చర్మానికి రక్షణ తగ్గుతుంది. అందువల్లనే, అతిగా సబ్బు వాడరాదు.

కొందరి దేహాలు వాసన వేస్తాయి. ఇది ఎప్పుడూ చెడు ఆరోగ్యంవల్ల మాత్రమేకాదు.

హెచ్. ఎల్. హెర్షెన్‌సోన్
(కాపీరయిటు)

ధర్మపథం



# ప్రాదేశిక ద్వేషం

బులుసు వేంకటరమణయ్య

భారత ఖండంలోని దేశాల్లో కళింగం ఒకటి! 'అంగ, వంగ, కళింగ, కాశ్మీరాది' ఛప్పన్నదేశాల్లో కళింగదేశం, మూడోది. అయితేనేమి? ఏ దురదృష్ట కారణానో అది చాలా హీనంగా చూడబడేది. కళింగ దేశంలో నివసించడమే కాకుండా, అక్కడికి వెళ్ళడంకూడా పాతకంగా పరిగణించే వారు, పూర్వం 'నాహం కళింగా న వాత్సీః' నాహం కళింగాన్ జగామ' అనే వాక్యాలు గ్రంథాల్లో కనబడతాయి. 'నేను కళింగ దేశస్థుణ్ణి కానోయ్, నేనక్కడికి వెళ్ళ లేదోయ్' అనే ఒకరి మొర వీటివల్ల తెలుస్తున్నది.

తెనాలి రామకృష్ణుడు పాండురంగ మాహాత్మ్యంలో నిగమశర్మను గురించి చెపుతూ

'అతడు కళింగోద్భవుడగు

కతమున నో(వేలజూవ కనుగందక'

అని ఆ దేశస్థులు మానాభిమానాలు లేని వారనే అభిప్రాయాన్ని వెలిబుచ్చాడు.

అయితే, ఇందులో ఎంతవరకూ సత్యం వుంది? మంచిచెడ్డలు మనుషులనుబట్టి వుంటాయిగాని స్థలాలనూ, దేశాలనూ బట్టి వుంటాయా?

అలా వుంటాయని భావించడం న్యాయమేనా?

ఈ నిరసన భావానికి కారణం మతమే అని స్పష్టంగా తెలుస్తున్నది.

వైదికమతం తర్వాత దేశంలో బహుళ వ్యాప్తిని చెందిన మతం బౌద్ధమతం.

అశోకుని కళింగ విజయానంతరం— మనస్సు మారిన ఆ బౌద్ధ చక్రవర్తి తన మతాన్ని కళింగదేశంలో మిక్కిలి వ్యాప్తిలోకి తెచ్చాడు. బౌద్ధులకు కళింగదేశం పరమ పవిత్రస్థానమయింది. అనేకంగా సంఘారామాలూ, స్తూపాలూ అవీ కళింగంలో— కళింగభాగమైన ఆంధ్రప్రాంతంలోని కొంతభాగంలో వెలిశాయి.

కళింగదేశంలోకి ఆర్యమతావలంబులు వెళ్ళితే— ఆ మతాన్ని అవలంబిస్తారేమో అనే భీతాహం కొందరు పెద్దలకి కలిగింది.

అందువల్లనే కళింగదేశంలో నివసించకూడదనీ, అక్కడికి పోకూడదనీ నిషేధం ఏర్పడింది.

ఆదేశంలో వుండేవాళ్ళు ఎప్పుడూ జగడాలాడుతూ వుంటారనే అపవాదు కల్పించబడింది— 'కలిం కలహం గచ్ఛంతీతి కళింగాః' అని కళింగ పదానికి వ్యుత్పత్తి చెప్పబడింది—మరే దేశంలోనూ కలహాలు లేనట్లు!

బౌద్ధమతంమీది కోపంకొద్దీ ఇలాంటి అర్థాలు సృష్టించబడుతూ వుండేవి.

మరో ముఖ్య విషయం గమనించవచ్చు.

అశోక చక్రవర్తికి 'దేవానాం ప్రియ' అనే అనన్య సామాన్యమైన బిరుదువుంది. అత్యున్నత స్థితిలో వున్నవారికి గాని అది లభించదు. అలాంటి బిరుదానికి ఇతర మతానికి చెందిన విద్వాంసులు 'మూర్ఖుడు' అనే అర్థం చెప్పారు. అది దేవతలకు ప్రియుడనే అర్థం తెలిపేటప్పుడు దేవప్రియుడని అవుతుందని, అలుక్సమాసంగా 'దేవానాం ప్రియ' అనే రీతిని ఉంటే మూర్ఖుడనే అర్థమనీ వైయాకరణులు నియమించారు.

ఈ విధమైన మతద్వేషమే కళింగదేశ దూషణానికి కూడా ముఖ్యకారణం!

ఇతర ద్వేషాలను మనస్సులో పెట్టుకుని దేశాలను దూషించడం న్యాయంకాదు ●



**బి. ఆర్. వి, ముప్పుకాల**

మనస్సులో ఉద్వేగాలు వ్రాతలో వెల్లడించాలంటే సాధ్యం కావడం లేదు. ఏం చేయాలి?

ఒకటికి పదిసార్లు రాస్తూండడమే.

**ఎల్. ఎల్. ఆర్, రాజమండ్రి**

అన్నిటా మధ్యే మార్గం మంచిదంటాను? మీరేమంటారు?

ఎందుకూ రెండు పక్కలనుంచి వచ్చే కార్ల దెబ్బలు తినడానికా!!

**వి. ఎస్. ఆర్. నరసారావుపేట**

కవి కావాలంటే పుట్టుకతో స్వభావసిద్ధమైనదా? నేర్చుకుంటే వచ్చేదా?

నేర్చుకుంటే వస్తుంది. కాని స్వభావసిద్ధంగా కొంత నేర్పు కూడా అవసరం.

కవి అంటే కనిపించకుండా వినిపించేవాడు అవునా?

కాదు. మాటల గారడీవాడని.

**సిహెచ్. ఆర్. ఆర్, వైజాగ్**

అభిరుచి అంటే?

మీకు నచ్చిన పోకడలవైపు మొగ్గడం బ్రదర్!

**ఎం. ఆర్. ఎం. మద్రాసు.**

చలనచిత్రాలకు సంబంధించిన ప్రశ్న అడిగితే ఒకసారైనా సమాధానం ఇస్తారా?

ఇవ్వచ్చు. కాని వాటిని గురించి నాకు తెలిసినది చాలా తక్కువ.

ఈనాటి ప్రేమికులు ఏకవచనంలోనే మాట్లాడుకుంటున్నారెందుకని ?

వారిమధ్య ఆత్మీయత ఎక్కువ ఉండడంచేత.

చీకటి వెనుక వెలుగుంటే ఆ వెలుగు వెనుక?

అర్డరు ప్రకారం చూస్తే వెలుగే ఉండాలి మరి!

**బి. వి. ఎన్. ఆర్, బరంపురం**

మా దగ్గిర బంధువులకు మాకు మనస్పర్థలు వచ్చాయి. వచ్చి రెండు సంవత్సరము లయింది. కాని ఇప్పుడు మనుష్యులు కలుద్దామంటే మనస్సులు కలుస్తాయంటారా ?

అదంతా చాదస్తం రావుగారూ, దీర్ఘ వైరం కూడదన్నారు. మాట కలపండి. స్నేహం అదే తిరిగి ఏర్పడుతుంది.

**కె. వి. ఎస్, విశాఖపట్నం**

పొరుగువాడంటే అర్థం ఏమిటి రామలక్ష్మిగారూ?

రావడానికో నిముషం పట్టి వెళ్లడానికో రెండు గంటలు తీసుకునేవాడే పొరుగువాడు సుబ్బారావు [illegible].




**టి. ఎమ్. ఆర్, హైదరాబాదు**

ఆవిడ బి. ఏ. చదువుతూంది. నేను బి కాం. చదువుతున్నాను. మేం రెండు సంవత్సరాల అనంతరం పెళ్లి చేసుకోవాలని నిశ్చయించుకున్నాం. కాని ఇప్పుడు కలుసుకున్నప్పుడల్లా ఒకరిపై ఒకరికి కోపం, బాధపడడం జరుగుతూంది. భేదాభిప్రాయాలు లేవు.

వివాహపు తేదీ దగ్గిరగా వచ్చే దారి చూడండి. అప్పుడీ కోపాలు తాపాలు ఉండవు. ఏదో ఉద్యోగం ఉంది కదా సర్దుకుని ఇద్దరూ కలిసి బ్రతుకుతూ చదువు ముగించవచ్చు. నిరాశ నిస్పృహలు కోపానికి, బాధకి దారితీస్తాయి. దరిచేరా లనుకున్న ప్రాణులు దూరంగా ఉండవలసి రావడమే అందుకు కారణం తమ్ముడూ.

**ఎస్. వి. ఆర్. బిహెచ్, ఉరవకొండ**

బురఖాపద్ధతి మన స్త్రీలకు విధించే నిర్బంధాన్ని ఈ నవభారతదేశంలో ఇంకా ఎందుకు నిర్మూలం చేయకూడదు?

మీరనుకుంటున్నట్టు బురఖా ఇప్పుడు నిర్బంధం కాదు. ఎవరిష్టం మీద వారు దాన్ని ధరించనూ వచ్చు, మాననూ వచ్చు.

**డి. వి. వి. ఎస్, శివమొగ్గ**

అధికస్య అధికం లాభం అని పెద్దల ఉవాచ. అలాగే అధికస్య ప్రజ అధిక లాభం అని ఎందుకనకూడదు?

మహరాజులా అనవచ్చు. ఆ అధిక్య అధిక ప్రజకి అన్నం బట్టా పంచివ్వకల స్తోమతు దేశానికి ఉంటే.

**ఎమ్. ఐ. జె, బరంపురం**

ప్రతి పురుషుడు స్త్రీని సోదరి ప్రేమతో చూడాలంటారు కదా? మరి నేటి పురుషులు సోదరి ప్రేమతో చూడకపోగా ఎక్కడైనా సందుదొరికితే అల్లరిచేద్దామా అని చూస్తారు. ముఖ్యంగా విశాఖపట్నం టౌను బస్సులందు...

బస్సుల్లో అల్లరి చేయడానికి విశాఖపట్నమే కానక్కరలేదు తమ్ముడూ. అంతమంది యువకులూ అంతమంది యువతులని సోదరీ ప్రేమతో చూడ్డం మొదలు పెడితే—బోర్. వేళాకోళాలు వేళాకోళంగానే తీసుకుంటే గొడవే లేదు.. అసభ్యంగా ప్రవర్తించనంతవరకు కుర్రాళ్ల అల్లరి అపార్థం చేసుకోకూడదు.

**ఎస్. ఆర్. ఎస్, మద్రాసు**

ఆడవాళ్ళ వయస్సూ, మగవాళ్ళ జీతాలూ అడగకూడదంటారు కొందరు. దానికి కారణం ఏమైనా ఉందా?

పెద్దకారణం ఏముంటుంది? అనవసరంగా ఎదుటివాళ్ల చేత అబద్ధం చెప్పించడం ఎందుకని.. అడగవద్దు అన్నారు.

ఎటువంటి బాధలూ నిరాశలూ సమస్యలూ లేనివాళ్ళు ఈ ప్రపంచంలో ఉండవచ్చా?

ఉండరు.

**పి. యల్. యస్. హెచ్, పూరి**

ఆడపిల్లలకు చదువు ముఖ్యమా? లేక పని పాటలు నేర్చుకోవడం ముఖ్యమా?

రెండూ ముఖ్యమే. సంసారం దిద్దుకుందుకు పనిపాటలు రావాలి. సంసార సాగరం సంతోషంగా బహునేర్పుగా ఈదడానికి కొంతైనా చదువు రావాలి.

**కె. డి, కర్నూలు**

లేనిపోని గొప్పలు చెప్పుకుంటూ పొద్దుపుగా నేర్పుగా బ్రతికేవాళ్లను ఎగతాళి చేసేవారితో ఎలా ప్రవర్తించాలి ? చిరునవ్వుతో మౌనంగా ఉండాలా ? బుద్ధి వచ్చేలా ఘాటుగా సమాధానాలు చెప్పాలా ?

సమాధానం చెప్పడం ప్రారంభిస్తే.. ఎంత మందికని చెప్తావు సోదరీ, .. పట్టించుకోకుండా ఊరుకోడమే అటువంటి వారికి గుణపాఠం.

**యస్. పి, జోధ్‌పూరు**

ఎయిర్ ఫోర్సులో ఉండే మా బంధువుల అబ్బాయి నన్నుతప్ప మరెవ్వరిని వివాహం చేసుకోనంటున్నాడు. మా తల్లితండ్రులు భయపడుతున్నారు...

భయం ఎందుకు? గర్వపడాలి కాని!

**జె. ఏ. కె, చిక్కవోలు**

ఈ రోజులలో సెక్సు పత్రికలు ఎక్కువగా బజారులో వచ్చుటకు కారణం ఏమిటి?

అమ్ము అవుట.

# మీ చర్మాన్ని పుష్పదళం లాగ మెత్తగా, మృదువుగా యౌవనంగా వుంచుకోండి...

ఇందుకు మీ చర్మమందలి స్వాభావిక తేమను మీరు నిలబెట్టుకోవాలి. పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్‌లోగల ఒక ప్రత్యేకమైన పదార్థము 'హ్యూమెక్టెంట్' చర్మపు తేమను నిలబెట్టి మీ చర్మాన్ని దుమ్ము, వాతావరణమునుండి రక్షిస్తుంది. తేలికైన, మంచువంటి పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్ మిమ్మలిని సొగసుగా కనబడేటట్టు వుంచి మీ చర్మాన్ని ఎల్లప్పుడు అందంగా, మృదువుగా, యౌవనంగా వుంచుతుంది. పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్ మాత్రమే రాసుకొంటే మీ ముఖము సహజ మనోహరత్వముతో వుంటుంది. లేకపోతే అది రాసుకొన్న తరువాత పౌడర్ అద్దుకోవచ్చును. అప్పుడు పౌడర్ గంటల కొలది ఏక రీతిగా అంటుకొని వుంటుంది. పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్: ప్రపంచమంతటా అందరు మెచ్చి వాడే క్రీమ్!




**పాండ్స్** వ్యానిషింగ్ క్రీమ్ పౌడర్ అద్దుకొనుటకు ఉత్తమమైనది

చీసబ్రొ-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్ (పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఎ.లో స్థాపించబడినది)



# కలకాని కథ

నందం రామారావు

బావ వెళ్ళిపోయాడు!

ఆ రోజల్లా అనుకుంటూనే వుంది రాధ.

బావ వున్న పదిరోజుల్లోనూ ఆనేన్నో సంగతులు చెప్పాలనుకుంది. కవ్వించి, లాలించి, విసిగించాలని చాలా చాలా కలలుగంది.

బావ వొస్తాడన్న రోజున తనెంత సంబరపడిందని?

మనసులో వున్న మాటను బయటకు రానీకుండా ఆనందంగా బావ కోసం ఎదురు చూసింది. బావతో మాట్లాడే తీరును తలచుకుని ముచ్చట పడిపోయింది.

బావ వొచ్చాడు. వెళ్ళిపోయాడు!

ఈ రెండు వాక్యాలే మిగిలిపోయాయి.

ఈ రెండు వాక్యాల మధ్య వున్న దూరాన్ని మధురంగా గడపాలని ఆశించింది.

బావ వెళ్ళిపోయాడు!

రాధ నిట్టూర్చి దొడ్లో వున్న పందిరి గుంజకు ఆనుకుంది.

నిద్ర రావడంలేదు. అవును నిద్రరాదు. బావ జ్ఞాపకాలతో నిద్రరాదు.

చల్లని గాలి వీస్తోంది కొబ్బరి చెట్ల మధ్యలోంచి వెన్నెల కురుస్తోంది. మల్లెపూల వాసన మత్తెక్కిస్తోంది.

రాధ బరువుగా కళ్ళు మూసుకుంది.

బావ కనుపిస్తున్నాడు.

* * *

బావ వొచ్చిన రెండో రోజుది వెళ్ళింది. హాల్లో మామయ్య పేపరు చదువుకుంటున్నాడు. రాధ కేసి గంభీరంగా చూశాడు. మామయ్య కంటే ఆయన పిసినిగొట్టనే భయం!

ఆయన కెప్పుడూ శంకరం శ్రద్ధగా చదవడం, పైకి రావడం కావాలే గానీ, 'పోనీలే రాధ వాడికి కాబోయే పెళ్ళాం కాసేపు హాయిగా మాట్లాడుకోనియ్' అని అనుకోడు.

శంకరం చదువూ, అతను డాక్టరు కావడం— మామయ్య మనసిది!

వయసులో మామయ్య కూడా ఇలాగే వున్నాడేమో?

మామయ్య పేపరు చదువుతూ తీవిగా కూర్చున్నాడు. ఎక్కడో ఏదో దేశంలో శాంతి సంప్రదింపులు జరిగి వుంటాయి. లేదా, రైలు ప్రమాదాలు ఎక్కడా జరక్కుండా వుండి వుంటాయి.

హఠాత్తుగా తలెత్తి—

"రాధమ్మా" అని పిలవడు గదా!

రాధ బిక్కుబిక్కుమంటూ శంకరం గదిలో కెళ్ళింది.

శంకరం పడక్కుర్చీలో పడుకుని పుస్తకం చదువుకుంటున్నాడు. రాధ గుమ్మంలో అడుగు పెట్టి నుంచుంది. ఎదురుగా అందమైన యువతి, అందునా కాబోయే భార్య నుంచునుంటే బావ చూడడేం ఖర్మ! గాజులు శబ్దం చేస్తూ చేతులు వూపింది.

ఊహూ. ఇటు చూస్తేనా?

"బావా?" అంది పట్టుదలని దూరం చేసి.

శంకరం తలెత్తి—"నువ్వా రాధా" అన్నాడు

'కనీసం కుర్చీలోంచి లేవనైనా లేదు. ఏం బావ ఏమిటో? ఎప్పుడూ చదువే'—సణుక్కుంది.

"చదువుకోడానికి పుస్తకాలుంటే ఇవ్వు బావా."

"ఇదుగో రాధ. తీసుకో."

రాధ వయ్యారంగా వెళ్ళి పుస్తకం అందుకుంటుంటే అతని వ్రేళ్ళు రాధ వేళ్ళని సున్నితంగా తాకాయి. తనువంతా పులకరించింది. శంకరం కేసి సిగ్గుపడుతూ చూసింది.

గబగబా వెనక్కి తిరిగి పుస్తకం తెరచి చూసింది. బావ క్లాసు పుస్తకం. రాధ కోపంతో తల తిప్పి శంకరం కేసి చూసింది. అతను నవ్వుతున్నాడు. అబ్బ! ఎంత అందంగా నవ్వుతాడనీ!

"నేనంటే వేళాకోళంగా వుందా?" అంది చిరుకోపంతో.

"లేకపోతే ఏమిటే రాధా! వొచ్చినదానివి వెంటనే వెళ్ళిపోవడమేనా? కాసేపు కబుర్లు చెప్పాలని తెలీదూ?"

"హాల్లో మావయ్య వున్నాడు."

"అవుతే అల్మరాలో నీక్కావల్సిన పుస్తకాలున్నాయ్ తీసుకెళ్ళు."

"చిత్తం." అని రాధ అల్మార దగ్గర కెళ్ళి పుస్తకాలు చూస్తోంది.

శంకరం గుబుక్కున లేచి రాధ చెయ్యి పట్టుకున్నాడు. దగ్గరకు తీసుకోబోయాడు.

అప్పుడే హాల్లో నుంచి—

"ఒరేయ్." అన్న మామయ్య కేక విన్పించింది.

రాధ ఖంగారుగా—"మామయ్యా." అంది.

శంకరం తొట్రుపాటుపడుతూ చెయ్యి వొదిలేశాడు.

"ఒరేయ్ అప్పన్నా—ఈ వెధ వెక్కడ చచ్చేడో ఏమో! సమయానికి ఒక్కడూ కనిపించడు."

రాధ ఫకాల్న నవ్వేసింది!

శంకరం తలొంచుకున్నాడు.

రాధ పుస్తకం తీసుకొని వెడ్తూ—

"బావా! నువ్వు " గలగలా నవ్వుకుంటూ వెళ్ళిపోయింది.

మరో రోజు ఏం చేశాడనీ?

రాధ హాల్లో కూర్చుని మల్లెపూల చెండు కడుతోంది. నెమ్మదిగా, హాయిగా, తియ్యగా పాట పాడుతోంది బయట వర్షం కురుస్తోంది ఈదురు గాలి వీస్తోంది.

రాజేశ్వరమ్మ వంటింట్లో వంట చేస్తోంది. తల్లికి సహాయం చెయ్యాలంటే ఇంతందమైన సాయంత్రాన్ని వంట చెయ్యడం అనే ప్రక్రియంతో వృధా చెయ్యడం ఇష్టంలేదు.

బావ వొడిలో తలవాల్చి, ముఖంలో ముఖం పెట్టి తన్మయత్వంతో ఈ లోకాన్ని మరచిపోవాలి అవును బావా! నువ్వు నాక్కావాలి. నీ నవ్వులూ, నీ మాటలూ నీకష్టాలూ, నీ సుఖాలూ అన్నీ నాక్కావాలి. నిజం బావా ఇది!

కిటికీ దగ్గర అలికిడైతే అటు చూసింది.

ఆమె కేసే శంకరం చూస్తున్నాడు.

"అదేం బావా! లోపలకు రాకుండానే అక్కడే వున్నావ్?"

"చాలా బాగా పాడావ్ రాధా! ఇంకా పాడు. నీ పాటల్లో నేను కరిగిపోయి, ఇద్దరం ఒకటై పోదాం. పాడు రాధా! పాడు "

"కవిత్వం చెబుతున్నావ్" అని రాధ నవ్వుతూనే వుంది.

శంకరం లోపల కొచ్చి రాధ భుజం మీద చెయ్యి వేశాడు.

కిటికీలోంచి రాజేశ్వరమ్మ కనిపిస్తోంది.

శంకరం సాహసం ఆమెకెంతో ఆనందం కలిగించింది!

"మా అమ్మ కనిపిస్తోంది" అంటూ బావను విడిపించుకుని లోపల కెళ్ళబోయింది. ఇంతలో రాజేశ్వరమ్మ— "రాధా" అంటూ పిలిచింది.

శంకరం పరుగెడుతున్న రాధ జడ పట్టుకుని, ఖతలకు లాక్కొని ముద్దు పెట్టుకోబోయేడు.

"అమ్మాయ్ రాధా! ఏం చేస్తున్నావే అక్కడ?"

శంకరం నీళ్లు కారిపోయాడు.

"వుసేవ్ రాధా! పలకవేమే? ఎవరక్కడ?"

అప్పుడు శంకరం రాధను వొదిలేసి—

"దాహంగా వుంది రాధా! మంచి నీళ్ళు." అన్నాడు ఖంగారుగా.

రాధ వెన్నెల కురిసినట్టు—మెత్తగా, మత్తుగా నవ్వి—

"ఇంత పెద్ద వర్షంలో దాహం ఏమిటి బావా?" అంటూ లోపల కెళ్ళింది.

* * *

రాధ దొడ్లో నుంచి లేచి గదిలో కొచ్చింది.

కిటికీ దగ్గరున్న మంచం మీద పడుకుంది. బయటకు చూసింది.

కొబ్బరి చెట్ల పైకి చందమామ ఎగబాకింది వెన్నెల పసిపాపలా నవ్వుతోంది. హాయిగా గాలి వీస్తోంది.

శంకరం గుర్తొస్తున్నాడు.

అవును బావా! నువ్వు నాక్కావాలి. నీకంటికి రెప్పనీ; నీ ప్రాణానికి ప్రాణంగా నేను కావాలి. నీ అడుగులో అడుగై దూరంగా, చాలా దూరంగా ఒకరికొకరం తోడుగా సాగిపోవాలి.

బావా! నాకు ఎక్కువ ఆశలు లేవు. నా సర్వస్వం నువ్వు కాగలిగిననాడు నాకింకేం కావాలి? నీతో ఎన్నెన్నో చెప్పాలి. మనిద్దరం ఒకరికొకరం చూసుకుంటూ వెర్రిగా నవ్వుకోవాలి. మన భవిష్యత్తు మన జీవితం, మన కలలూ— వీటి గురించి సంతోషంగా ముచ్చటించుకోవాలి. చాలు బావా! చాలు. నాకింకేం వొద్దు నీనుంచి

బావకేం తక్కువ. అందగాడు. చొరవగా మాట్లాడుతాడు. డాక్టరు చదువుతున్నాడు. వీటన్నిటి కంటే అందమైన మనసుంది

ఒకవేళ బావ .. రాధ ఆందోళనతో గుండె దిటవు చేసుకుంది.

బావ చదువుకునే క్లాసులో చాలా చాలా అందమైన అమ్మాయి లుంటారు. వాళ్ళంతా బాగా చదువుకున్నవారు. ఆ రంగురంగుల వలయంలో, వాస్తవంకాని కలలో బావ చిక్కుకుంటే? బావ అటువంటి వాడుకాడు. నమ్ముకున్న నన్ను అన్యాయం చెయ్యడు. ఏమో? నాకంటే అందమైన ఆడుకూతుర్లు, బావతో పాటు చొరవగా సినిమాలకూ, షికార్లకూనూ తిరగొచ్చు. అప్పుడు బావకి మైకం కలగొచ్చు. ఆ మైకంలో పడి బావ తనని మరిచిపోడం ఎంతసేపు?—రాధ నిలువునా కంపించిపోయింది. వళ్ళంతా చెమటల్లు పోశాయి.

ఆ వెంటనే చిన్ననాటి స్నేహితురాలు జానకి గుర్తొచ్చింది. జానకీ అందమైనది. పైగా కలుపుగోలు మనిషి. ఇద్దరూ కలిసి హైస్కూల్లో చదువుకున్నారు అప్పైన వాళ్ళ నాన్నకు ట్రాన్స్ ఫర్ అవ్వడం, జానకి కాలేజీలో చేరడం ఒకేసారి జరిగింది. ఇప్పుడు జానకీ కూడా విశాఖపట్నం లోనే చదువుతోంది. అది ఉత్తరం రాసి చాలారోజులైంది. బదులు రాయలేదు.

బావ వివరాలూ, తను బావను పెళ్లి చేసుకోవాలనుకోవడం.. ఇవన్నీ జానకికి రాసి... బావెక్కడ ఏం చేస్తూ వున్నాడో ఎలా వుంటున్నాడో — ఎప్పటి కప్పుడు తెల్సుకుంటూ ఉత్తరం రాయమంటే ... జానకి ఆప్తస్నేహితురాలు. కాదనదు.

రాధ మంచం మీద నుంచి లేచింది. లైటు వేసింది. జానకికి ఉత్తరం రాయసాగింది...

* * *

మాధవరావుగారు ఆరోజొచ్చిన పోస్ట్ చూసుకు టున్నారు. ఆయన్ని అమితంగా ఆకర్షించింది వో నీలం కవరు! ఆసక్తిగా చించి చదివారు. భార్య శాంతమ్మ గుమ్మాని కానుకుని నుంచుంది. ఆయన మరోసారి ఆ ఉత్తరాన్ని చదివి నిట్టూర్చారు. నుదుటి మీద పట్టిన చెమటను తుడుచుకున్నారు.

ఇంతలో రాధ కూనిరాగాలు తీస్తూ ఆ ఇంట్లో అడుగుపెట్టింది. మామయ్యను చూసి ఆగింది. ఆయన గంభీరంగా వున్నారు. చేతిలో ఉత్తరం రెపరెపలాడుతోంది.

రాధ అత్తయ్య దగ్గర కెళ్ళబోయింది.

"రాధా" అన్నారు మాధవరావుగారు.

"ఏం మామయ్యా?"

"వెళ్ళిం తర్వాత శంకరం నీకు ఉత్తరం రాశాడా?"

"నిన్ననే వొచ్చింది మామయ్యా."

"అవుతే సర్లే '

మాధవరావుగారు ఆ ఉత్తరాన్ని జేబులో పెట్టుకుని నవ్వుకున్నారు. పదహారో రోజున అదే రంగు కవరు మళ్ళీ వొచ్చింది ఈసారి మాధవరావుగారు అంత ఆసక్తిగా ఆ కవర్ని చించ లేకపోయారు. రాత్రి భోజనం చేసి పడుకోబోయే ముందు ఆ కవర్ని చించి చదివారు. కోపంతో చిందులు తొక్కారు. శంకరం మీద ఎన్నడూ రానంత కోపం వొచ్చింది.

రాస్కెల్ని! వెంటనే పిలిపించేసి పెళ్లి చేసేస్తాను. ఈ డాక్టరూ వొద్దు పిండాకూడూ వొద్దు. ఇంటి దగ్గర హాయిగా వుండమని చెప్పేస్తాను. వీడేదో ఉద్ధరిస్తాడనుకుంటే ఇదా ఉద్ధరింపు! ప్రేమట. ప్రేమించాట్ట!— షూట్ చేసి పారేస్తాను వీడి ప్రేమనీ వీడ్నీనూ

మాధవరావుగారు మళ్ళీ ఆ ఉత్తరం చదివారు.

వైజాగ్,

శ్రీ మాధవరావుగారికి,

క్రితంసారి మీకో ఉత్తరం రాశాం. చదివి మీరు ఉపేక్షించి వూరుకున్నారు. మీ శంకరం ప్రేమనే రంగురంగుల ఊయలలో గిరగిరా తిరుగుతున్నాడు. చదువూ, కాలేజీ లేదు. అంతా ప్రేమ.

మీరిలా వూరుకుంటే అతను మీకు దక్కడు. ప్రేమను తప్పకుండా పెళ్ళి చేసుకుంటాడు.

ఇది చూస్తూ వూరుకోలేం. మా కర్తవ్యాన్ని గుర్తుంచుకుని మీకు రాస్తున్నాం.

ఇప్పటికయినా మీరు మీ అబ్బాయిని అదుపులో పెట్టగలరు.

మీ

శ్రేయోభిలాషులు.

అవును! వాడు చెడిపోయే వుంటాడు. కాకుంటే ఆ మిత్రులు రాయవల్సిన అవుసరం వుండదు. వెంటనే టెలిగ్రాం ఇచ్చేస్తాను.

*    *    *

ఆ ఇల్లు చాలా నిశ్శబ్దంగా వుంది. మాధవరావుగారు గంభీరంగా కుర్చీలో కూర్చున్నారు. ఆయన కెదురుగా శంకరం కూర్చున్నాడు. శాంతమ్మ గుమ్మాని కానుకుని కళ్లప్పగించి చూస్తోంది. రాధ కిటికీలో కూర్చుని హాల్లోకి చూస్తోంది.

"అవున్రా! నువ్వు పెద్దవాడివై పోయావ్. ఎవతో ప్రేమట దాని వలలో పడి ఇష్టం వొచ్చినట్టు తిరుగుతున్నావట. అవునా?"

శంకరం ఈ మాట విని అదిరిపోయాడు.

"ఏమిటి నాన్నా! మీరనేది?" అన్నాడు.

"అవున్రా! తిరిగేటప్పుడివన్నీ తెలీవ్. తీరా వ్యవహారం కాస్త బయట పడేప్పటికి ఇదీ వరస. ఇదిగో ఈ ఉత్తరం చదువు."

శంకరం అదందుకుని చదివాడు. ప్రాన్పడిపోయాడు. తనకేమీ తెలీదు! అసలీ ప్రేమ ఎవరు? తనకు ఆడవాళ్లతో అసలు పరిచయమే లేదే? మరిదంతా ఏమిటి? ఎవ్రాశారు?

"ఒరేయ్! వళ్ళు దగ్గర పెట్టుకుని మసలుకో. మరోసారి ఇటువంటి కంప్లయింట్ వొచ్చిందా వెంటనే రాధకూ నీకూ ముడి పెట్టేస్తాను. దాని కన్యాయం చేద్దామనుకున్నావురా?"

"ఆస లిదంతా ఏమిటో నాకు తెలీదు నాన్నా."

"తిరిగినా తిరిగినట్టు వొప్పుకుంటాగ్రా ధిసభైనా. మరింక ఆట్టే వాక్కు. డొక్క చీరేస్తాను. బుద్ధిగా చదువుకో, కబడ్దార్."

తల్లి ఘొల్లున యేడ్చేసింది. మాధవరావు హాల్లో పచార్లు చేస్తూ వుండిపోయారు. అక్కడ నుంచి శంకరం విసురుగా గదిలోకి వెళ్ళిపోయాడు.

గుమ్మంలో అతని కెదురుగా రాధ నుంచుంది.

*    *    *

పదిరోజులు గడిచినా మాధవరావుగారు ప్రశాంతంగా వుండలేకపోయారు. నో రెండు సంఘటనలు ఆయన్లో వున్న సహనాన్నీ, కోపాన్నీ పరీక్షించాయి. శంకరం అన్యాయం చేస్తాడేమోనని కూడా ఖంగారు పడ్డారు.

అవూరి ప్రెసిడెంట్ మాధవరావుగారి దగ్గర కొచ్చి—

"మాధవరావ్! మీ శంకరం దేన్నో వెంటేసుకుని వైజాగ్‌లో ఇంత పబ్లిగ్గా తిరుగు తాడనుకోలేదోయ్" అన్నాడు.

"నిజమేనా!"

"నా కళ్లతో చూశాను. పైగా, దాన్ని కూడా వెంటేసుకొచ్చి మరీ పలుకరించాడు నన్ను."

మాధవరావుగారు అదోలా ఐపోయారు.

"ఇదంతా ఏమిట్రా శంకరం అంటే?"

నవ్వి వూరుకున్నాడు.

"ఏమో మాధవరావ్! వాడ్ని కాస్త అదుపులో పెట్టు. రాధ ఇది వింటే చచ్చి వూరుకుంటుంది."

ఆ రాత్రికి రాత్రే మాధవరావుగారు విశాఖపట్నం ప్రయాణమయ్యారు.

తండ్రిని చూసి శంకరం తెల్లబోయాడు!

"ఏమిటి నాన్నా...."

"అవున్రా! నువ్వు చేసే పన్లు అలా వున్నాయ్. నలుగుర్లో తలెత్తుకు తిరగాలనేనా నీ వుద్దేశం."

"మీ రనేది?.."

"అవున్రా! అనే దేముంది? లక్షణంగా ఈ చదువు మానేసి ఇంటికి ప్రయాణంకా. అంతా అక్కడ మాట్లాడుకుందాం."

ఆయన దిగిన హోటల్‌కి వెళ్ళిపోయారు.

ఆ సాయంత్రం మాధవరావుగారు బీచ్‌లో తనక్కాస్త దూరంలో కూర్చున్న జంటను చూసి మండిపడ్డారు. వాళ్ళిద్దరూ కులాసాగా, సంతోషంగానూ మాట్లాడుకుంటున్నారు.

శంకరం ఆమెకి దూరంగా వున్న కొండల్నీ, అక్కడున్న మేఘాల్నీ చూపిస్తున్నాడు.

*    *    *

"అవున్రా! నువ్వెదిగిపోయావ్. మంచిచెడ్డలు ఆలోచించే సమయం లేదు నీకు. దాన్నెవతెనో కట్టుకుని ప్రేమంటూ తిరుగుతూ నాశనం అవుదామనుకున్నావ్. అవునా?"

"నేను..."

"రేయ్! నువ్వేం చెప్పక్కర్లా. అసలు నువ్వేది చెప్పినా నమ్మను. నీ వ్యవహారం స్పష్టంగా చూశాను. కాదనగలవా? శంకరం! రంగు రంగుల చీరలు కట్టుకున్న పై పై అందానికి మోసపోకురా. అదంతా వొట్టి కల. ఇంద్రజాలం. అందులో చిక్కుకోకు. జరిగిందేదో జరిగింది. దాన్ని వొదిలి పెట్టేయ్. రాధ ముఖం చూడరా. నిన్ను నమ్ముకున్న దాన్ని అన్యాయం చెయ్యొద్దు. వొద్దు శంకరం. వొద్దు దాన్ని వట్టేటముంచకు."

"........................."

"రాధ కేం తక్కువరా. స్కూల్ ఫైనల్ వరకూ చదువుకుంది. అందమైంది. గుణం వుంది. నిన్ను సుఖపెట్టగలది నిన్నే చేసుకోవాలనుకుంది."

నో మూల రాధ గోడకు ఆనుకుని ఇదంతా వింటోంది. ముఖమంతా దీనంగా మారిపోయింది. కళ్లు చెమర్చాయి. శాంతమ్మ వచ్చి రాధ భుజం మీద ఆప్యాయంగా చెయ్యి వేసింది.

"అత్తయ్యా" అంటూ రాధ ఒక్కసారిగా యేడ్చేసింది.

"అలా మైలురాయిలా వున్నావేరా?"

"నేనింకేమీ చెప్పవల్సింది లేదు."

"నువ్వు రాధను కాదన్నావా? ఈ ఆస్తంతా దాని పేర్న రాసేస్తాను. జాగ్రత్తగా ఆలోచించు. నాలుగురోజులు టైమిస్తున్నాను. ఈ వారంలో పెళ్లి జరిపించేస్తాను. కాదూ కూడదన్నావా! కాళ్లూచేతులూ కట్టేసి పీటల మీద కూర్చోబెడతాను." మాధవరావుగారు అక్కడనుంచి వెళ్ళిపోయారు.

రాధ కళ్లు తెరచి చూసింది. గదిలో జీరోల్ట్ బల్బు వెలుగుతోంది.

తలంతా బరువుగా వుంది. చలిజ్వరం వొచ్చినట్లుగా వణకసాగింది. పిచ్చిగీతల్లా ఆలోచనలన్నీ గజిబిజిగా, గంద్రగోళంగా వున్నాయి. ఒక్కటీ సరైన రూపం కన్పించడం లేదు.

'బావ తన కన్యాయం చేస్తాడని కలలో కూడా అనుకోలేదు. ఇదెలా జరిగింది? అవును తనకంటే బాగా చదువుకున్నదీ, అందమైన దానిసీమా బావ ప్రేమించి పెళ్లి చేసుకుంటున్నాడు. తను బావకు పనికిరాదు. బావ తనతో ఇదివరకు ప్రవర్తించిన తీరూ, ఆడిన హాస్యం అన్నీ నటనేనా? బావనే ఈ విషయం అడిగితే...'

రాధ మంచం మీద నుంచి లేచింది. తలుపులు తీసింది. బయటంతా చీకటిగా వుంది. నెమ్మదిగా ముందుకు అడుగులు వేసింది.

శంకరం ఉలిక్కిపడ్డాడు.

కాళ్ళ దగ్గర రాధ యేడుస్తోంది.



శంకరం తగ్గిన శృతి—

"ఇంతర్ధరాత్రిలోనా రాధా." అన్నాడు.

"బావా! మామయ్య మాట్లాడిన దంతా నిజమేనా? చెప్పు బావా! చెప్పు. ఇదంతా వొట్టి దని.'

శంకరం మౌనంగా వూరుకున్నాడు.

చాలాసేపు నిశ్శబ్దంగా గడచింది.

రాధ శంకరం కాళ్ళ దగ్గర అలాగే కూర్చుంది.

చివరకు రాధ అంది—

"బావా! ఒకటడగాలనుంది. అడగనా?"

"అడుగు."

"ఆ అమ్మాయి నా కంటే అందంగా వుంటుందా?"

శంకరం మాట్లాడలేకపోయాడు.

రాధ, అతని సమాధానం కోసం కొన్ని నిముషాలు చూసి గుండెలు పగిలేలా యేడుస్తూ అక్కడ నుంచి గలగబా వెళ్ళిపోయింది!

* * *

ఆరాత్రి—

"నన్ను క్షమించు బావా! నీకు తెలీయకుండానే నాటకం ఆడాను." అంటూ రాధ శంకరం వొడిలో వాలిపోయింది.

ఆమె అందంగా వుంది. ఖరీదైన చీరలో మెరిసిపోతోంది.

"నాకు అంతా తెల్సు రాధా!"

"నీకు తెలీదు బావా! అందర్నీ కష్టపెట్టాను."

శంకరం నవ్వి రాధను దగ్గరకు తీసుకుని గట్టిగా ముద్దు పెట్టుకున్నాడు.

ఆ తర్వాత తను జేబులోంచి ఉత్తరం తీసి చదవసాగాడు—

ప్రియమైన జానకీ

....నా బావనే పెళ్లి చేసుకోవాలి చాలా తొందర్లో. నా బావతో ఆనందంగా గడపాలి. మనసులు విప్పి మధురంగా మైమరచిపోవాలి. సెలవుల్లో బావ ఇంటి కొచ్చినా కులాసాగా మాట్లాడుకో నివ్వడు మామయ్య.

అంచేత మామయ్యకు నేనే స్వయంగా రాసిన ఉత్తరం ప్రతి పదిహేను రోజులకూ పంపుతాను

ఇక్కడ మీ శంకరం ఎవతో అమ్మాయిని వెంటేసుకుని తిరుగుతూ పెళ్లి చేసుకుంటానంటున్నాడు..."

ఇలా రాసే ప్రతి ఉత్తరాన్ని మామయ్య పేర 'పోస్టు చెయ్. చదివి, ఇదంతా నిజం అనుకుని నాకూ శంకరం బావకూ తొందర్లో వివాహం చేస్తాడు....

రాధ గబాల్న ఆ ఉత్తరాన్ని శంకరం చేతుల్లోంచి లాక్కుని—

"ఇది నేనే రాశాను బావా. ఇది నా స్వార్థం కోసం చేశాను.

అవునూ! ఈ ఉత్తరం నీకెలా వొచ్చింది?" అంది.

"నో రోజు నన్ను వెదుక్కుంటూ జానకి వచ్చి పరిచయం చేసుకుని అంతా చెప్పి, నువ్వు రాసిన ఉత్తరాల్నిచ్చింది."

"మరీ సంగతి నాకు చెప్పలేదే."

"నువ్వు నాకు చెప్పావు గనుకనా?"

"బావా! నువ్వు నన్ను పెళ్లి చేసుకోకపోతే చచ్చిపోయేదాన్ని"

"పిచ్చిరాధా! నా మీద నీకు నమ్మకం కలగలేదా?"

"అవుతే ఇదంతా ఏమిటి?"

"నేనూ నో చిన్న నాటకం ఆడాను మన పెళ్లి త్వరగా జరగడానికి. నే నెవర్నీ ప్రేమించలేదు.

పెళ్లి చేసుకుంటానన్నదీ లేదు. ప్రేమ వివాహం కాదు జానకి. జానకితోనే నేను తిరిగింది. మన పెళ్లి వెంటనే జరగాలనే. జానకి నేను ఆలోచించి ఇలా చేశాం."

"నేను అదృష్టవంతురాల్ని బావా" అంటూ రాధ శంకరం వొడిలో పరవశంతో ఒదిగిపోయింది. ●


# మీ పళ్లు నాశనముకాకుండా బలపరచు గొప్ప సాధనము బినాకా ఫ్లోరైడ్

## పళ్లు ఎందుకు చెడిపోతాయి ?

ముందు, పళ్ళలో ఇరుక్కొన్న ఆహారపుటణువులు అమ్లములుగా (యాసిడిగా) విడిపోతాయి.

తరువాత, ఆమ్లములు పళ్ళకు రక్షణ ఇచ్చే దంతికను (ఎనామిలును) బలహీనం చేస్తాయి. ఫలితం-పళ్ళయొక్క ధాతువులు నాశకారక క్రిముల చర్యకులోనై, చెడిపోతాయి. దీనివలన నొప్పి పుట్టే పంటిపుప్పి తయారై, బహుశా పళ్లుకూడా ఊడిపోవచ్చు.

## ఏం చేయాలి

పంటి దంతికను ఫ్లోరైడుతో బలపర్చండి. ఫ్లోరైడ్ దంతికతోచేరి, నాశమును ఎదుర్చుటకు పళ్ళకు అదనపు దృఢత్వమును ఇస్తుంది.

## ఎలా చేయాలి

బినాకా ఫ్లోరైడుతో క్రమంగా పళ్లుతోమండి. ఈ ఒక్క టూత్ పేస్టులో మాత్రమే చురుకైన ఫ్లోరైడ్ మిశ్రణము-సోడియమ్ మోనోఫ్లోరో ఫాస్ఫేటు-కలిసి ఉంది. ఇంకా, అప్పుడప్పుడు పళ్ళను మీ దంతవైద్యునికి చూపించుకోండి.

బినాకా ఫ్లోరైడుతో మీ పళ్ళలోనికి అదనపు దృఢత్వాన్ని ప్రవేశ పేయండి. *ఈ టూత్ పేస్టు ముఖ్యంగా పిల్లలకు ఎంతో శ్రేష్ఠం!*

CIBA Cosmetics



# మీరు పుట్టిన ఇంగ్లీషు తేదిని అనుసరించి మీ స్వభావం? మీ మిత్రులు?

## కుంభం:

ఇది రాసులలో పదకొండవది. ప్రతి సంవత్సరం జనవరి 21వ తేదీ మొదలు ఫిబ్రవరి 19వ తేదీ వరకు సాయన సూర్యుడు కుంభరాశి యందు ఉంటాడు. కాబట్టి యీ తేదీల మధ్యను పుట్టిన వారు కుంభరాశి యందు జన్మించిన వారుగా పరిగణింపబడుతున్నారు. ఏ సంవత్సరంలోనైనా సరే, యీ తేదీల మధ్యను పుట్టినవారికి కుంభరాశి ఫలితాలే వర్తిస్తాయి. దీనికి జననకాలంతో గాని, జన్మనక్షత్రంతో గాని నిమిత్తంలేదు

రాశి ప్రారంభంలో అనగా జనవరి 21—24 తేదీల మధ్యను జన్మించినవారి మీద అంతకు ముందు ఉన్న మకరరాశి ప్రభావం కూడా ఉంటుంది. అలాగే, రాశి ఆఖరున అనగా ఫిబ్రవరి 16—19 తేదీల మధ్యను జన్మించినవారి మీద రాబోయే మీనరాశి ప్రభావం కూడా ఉంటుంది.

కుంభమును ధరించిన పురుషుడు కుంభరాశిగా పరిగణింపబడుతున్నాడు ఇది స్థిరరాశి వాయువుకు సంబంధించిన రాసులలో యిది మూడవది. సకల దురదృష్టాలకు యితడే కారకుడనే అపవాదు కలిగిన శని యీరాశికి అధిపతి

ఈరాశి యందు జన్మించినవారు యెప్పుడూ యేదో ఒకదానిని గురించి ఆలోచిస్తూ ఉంటారు. ఇతరులకు ఉపకారం చేయడంలో వీరికి చాలా ఆసక్తి ఉంటుంది. వీరు అన్నివిషయాల్లోను ఉదారంగా వ్యవహరిస్తుంటారు కాబట్టి వీరికి సమాజంలో గౌరవం బాగా ఉంటుంది.

వీరు అన్నివ్యవహారాల్లోను ప్రజాస్వామ్య సూత్రాలను అమలు పరచాలని కోరుతుంటారు. మానవు లందరూ సమానులే నని వీరి ధృడమయిన అభిప్రాయం. వీరికి మానసిక విషయాలమీద మోజు అధికంగా ఉంటుంది. వీరు తరుచుగా తమ ఊహాలోకంలోనే ఉండిపోవడం వలన కార్యాచరణ సన్నగిల్లే ప్రమాదం ఉంది.

వీరు సహజంగా హాస్య ప్రియులు అందుచేత యెటువంటి సమాజంలోనైనా వీరు సులభంగా గుర్తింపబడతారు. వీరు తమ హాస్యం ద్వారా, యెదుటి వారిని తమకు అనుకూలంగా చేసికొనడానికి ప్రయత్నిస్తారు. తమ వలన యితరులకు అపకారం జరగడానికి యెంతమాత్రం అంగీకరించరు.

వీరు ప్రతివ్యక్తినీ, ప్రతి వస్తువును విమర్శనాత్మక దృష్టితో చూస్తుంటారు. అందుచేత వీరికి వ్యవహార జ్ఞానం అధికంగా ఉంటుంది. వీరికి తమ ఆలోచనలకు తగిన అవకాశాలు తరుచుగా లభిస్తాయి.

జరగబోయే విషయాలను వీరు ముందుగానే వూహించగలరు. చాలా విషయాల్లో వీరికి స్వతంత్రాలోచనలు ఉంటాయి. కొత్త సంగతులను తెల్సుకోవాలని వీరు యెప్పుడూ కోరుతుంటారు. ఏ పని చేసినా, దాని వలన తమకుగాని యితరులకు గాని యేదో ఒక ప్రయోజనం ఉండాలని వీరు కోరుతుంటారు.

వీరు యితరులతో యెంత కలసిమెలసి ఉన్నా, తాము ప్రత్యేకమైన వ్యక్తులమనే అభిప్రాయం వీరికి బలంగా ఉంటుంది వీరి ఆలోచనలు వీరి స్వంత వ్యవహారాల్లో కంటే యితరులకు సలహా రూపంలో బాగా ఉపకరిస్తుంటాయి అందుచేత వీరికి సమాజంలో నాయకస్థానం సులువుగా లభిస్తుంది. ఆలోచనల్లో కంటే వీరు ఆచరణలో శ్రద్ధ చూపించడం అవసరం.

### ద్రేక్కాణ ఫలం

కుంభరాశిలో మొదటి ద్రేక్కాణానికి (జనవరి 21 మొదలు 30) శుక్రుడు అధిపతి. ఈ సమయంలో పుట్టినవారు యెప్పుడూ ఉత్సాహంగా ఉంటారు. వీరికి అనేకమంది మిత్రులు ఉంటారు. వీరు అందరియెడలా దయతో ప్రవర్తిస్తారు. దూర ప్రయాణాలుచేసి కార్యసాధన చేయగలరు. మంచితనంతోనే వీరు తమ పనుల్ని నెరవేర్చుకోడానికి ప్రయత్నిస్తారు వీరు సహజంగా శాంత స్వభావులు కళలు, రచన, సంఘసేవ వీనిలో అభిరుచి ఉంటుంది.

రెండవ ద్రేక్కాణానికి (జనవరి 31 మొదలు ఫిబ్రవరి 9) బుధుడు అధిపతి. ఈ సమయంలో పుట్టినవారు ప్రతి విషయాన్నీ తీవ్రంగా ఆలోచిస్తుంటారు. సహేతుకమైన ఆలోచన, పట్టుదలా వీరికి చిన్నప్పుడే అలవడగలవు. వీరికి స్వతంత్రాలోచనలు చాలా ఉంటాయి. ఎదుటి వారిని సులభంగా అర్థం చేసికొనగలరు. వీరు సాధారణంగా యేకాంతంగా ఉండడానికి యిష్టపడతారు. జీవితంలో వీరు తప్పకుండా విజయాన్ని సాధిస్తారు. పరిశోధన, గణితం, హాస్యం, జ్యోతిషం వీనిలో ఆసక్తి ఉంటుంది.

మూడవ ద్రేక్కాణానికి( ఫిబ్రవరి 10 మొదలు 19) చంద్రుడు అధిపతి. ఈ సమయంలో పుట్టిన వారికి విచిత్రమైన ఆలోచనలు ఉంటాయి. అప్పుడప్పుడు వీరు నిరాశాభావానికి లొంగిపోగలరు. కాని ముఖ్యమైన సమయాల్లో పట్టుదలతో వ్యవహరించి తమ లక్ష్యాన్ని చేరుకొనగలరు. చాలా శ్రమమీద విజయాన్ని సాధిస్తారు. తరుచుగా దూర ప్రయాణాలు చేస్తారు. వీరి ఆలోచనలవల్ల యితరులకు ఉపకారం జరుగుతుంది.

సూచన—మొదట చెప్పబడిన రాశి ఫలితాలకు తరువాత చెప్పబడిన ద్రేక్కాణ ఫలితానికి తేడా, ఉన్నప్పుడు ద్రేక్కాణ ఫలితాన్నే గమనించాలి. ద్రేక్కాణ ఫలితం సరిగ్గా సరిపోతున్నట్లు చాలా మంది అభిప్రాయం.

### కుంభ రాశిలో జన్మించిన భర్తతో వ్యవహరించడం యెలా?

సాధారణంగా వీరు తమ ఆలోచనల్లో మునిగి ఉంటారు కాబట్టి అనవసరమైన విషయాలను చెప్పి వీరి ఆలోచనలకు భంగం కలిగించకూడదు. భార్య వీరితో ఒక స్నేహితురాలివలె వ్యవహరించడం వీరికి సంతృప్తిని కలిగిస్తుంది వీరు సాధారణంగా, యితరులను పొగడరు. కాబట్టి వీరినుంచి పొగడ్తలను ఆశించకూడదు వీరు ఉదార స్వభావులు కాబట్టి ఎదుటివారి తప్పులను చాలవరకు సహించగలరు గాని దానిని వీరి బలహీనతగా భావించకూడదు. అవసరమైనప్పుడు వీరు ధృఢ నిశ్చయంతో వ్యవహరించగలరు

### కుంభ రాశిలో జన్మించిన భార్యతో వ్యవహరించడం యెలా?

ఇతరులకంటే తాను తెలివైన దాననే అభిప్రాయం యీమెకు ధృడంగా ఉంటుంది కాబట్టి ఎవరి సలహాలను యీమె అంగీకరించదు. తన పనిని తాను బాధ్యతతో చేస్తుంది. అందుచేత యీమె పనులలో జోక్యం చేసికోకూడదు. ఈమెకు వూహాశక్తి అధికంగా ఉంటుంది కాబట్టి ఈమెను మోసం చేయడానికి ప్రయత్నించడం వ్యర్థం కాగలదు. భర్త ఒక స్నేహితునివలె వ్యవహరించాలని యీమె కోరుతుంది. ఈమెమీద అధికారాన్ని చలాయించడానికి ప్రయత్నించడం వలన దుష్ఫలితాలు కలగవచ్చును. సహేతుకమైన వాదం ద్వారానే యీ అభిప్రాయాల్ని మార్చవచ్చును.

### కుంభరాశియందు జన్మించినవారికి మిత్రులు ఎవరు?

కుంభరాశియందు జన్మించిన మిత్రులను వీరును ఒకే అభిప్రాయాలను కలిగిఉంటారు. కాబట్టి వీరి మైత్రి చాలా కాలం ఉంటుంది. వీరి మధ్యను భేదాభిప్రాయాలు ఉండక పోవచ్చును కాని ఒకరు చెప్పిన దానిని యింకొకరు వెంటనే అంగీకరించడం వలన వీరి మైత్రి ఉత్సాహకరంగా ఉండదు

కుంభరాశియందు జన్మించిన వారికి, మీనరాశి (ఫిబ్రవరి 20—మార్చి 21) యందు జన్మించిన

వారికి స్నేహం చిత్రంగా ఉంటుంది. వీరు యిద్దరూ యే విషయంలోను యేకాభిప్రాయానికి రాలేరు. కాని అవసరం వచ్చినప్పుడు వీరు యేకం కాగలరు. కుంభరాశివారి ఉదారస్వభావాన్ని మీన రాశివారు దుర్వినియోగం చేయకూడదు. మీన రాశివారు తరుచుగా తమ అభిప్రాయాలను మార్చుకొంటారు. అది కుంభరాశివారికి నచ్చదు. మీన రాశివారు చిత్తశుద్ధితో ప్రవర్తిస్తే వీరిమైత్రి బాగా ఉంటుంది. వీరి మధ్యను మూడవ వారి జోక్యాన్ని సహించకూడదు.

కుంభరాశియందు జన్మించిన వారికి, మేష రాశి (మార్చి 22—ఏప్రిల్ 20) యందు జన్మించినవారికి కొన్ని పరిస్థితుల్లో స్నేహం బాగా ఉంటుంది. కుంభరాశివారు ఉదారస్వభావులు కాబట్టి మేషరాశివారి దుడుకుతనాన్ని చాలవరకు సహిస్తారు. కుంభరాశివారి ఉదారత్వాన్ని, వారిబలహీనతగా పరిగణించడం మంచిదికాదు. మేషరాశి వారివద్ద సాధారణంగా లోపించే దూరాలోచన కుంభ రాశివారివద్ద ఉంటుంది. కాబట్టి మేష రాశివారు కుంబరాశివారి సలహాను తీసికోవడం మంచిది. మేషరాశివారు కుంభరాశివారిని యెప్పుడూ గౌరవంగా చూడడం అవసరం.

కుంభరాశియందు జన్మించిన వారికి వృషభ రాశి ( ఏప్రిల్ 21—మే 21 ) యందు జన్మించిన వారికి సాధారణమైన మైత్రి ఉంటుంది. వీరి స్వభావాల్లో చాలా భేదం ఉంటుంది కాని ఆ భేదమే వీరిమధ్యను ఆకర్షణను కలిగిస్తుంది. కుంభరాశి వారివద్ద వూహాశక్తి పరోపకార చింతనా అధికంగా ఉంటాయి. వృషభరాశి వారి వద్ద కార్య దీక్ష అధికంగా ఉంటుంది. అందుచేత వీరిమైత్రి ఉభయ ప్రయోజనకరంగా ఉంటుంది. వీరి మధ్య వచ్చే సంఘర్షణలో కుంభ రాశి వారిదే తరుచుగా పై చేయి కాగలదు.

కుంభరాశియందు జన్మించిన వారికి మిధున రా (మే 22—జూన్21 ) యందు జన్మించిన వారికి సహజమైన మైత్రి ఉంటుంది. వీరి ఆలోచనలు సమానంగా ఉన్నా, ఆచరణలో చాలా తేడా ఉంటుంది. కుంభరాశివారు ఉదారస్వభావులు కాబట్టి మిధున రాశివారి చంచల స్వభావాన్ని చాలవరకు సహిస్తారు. వీరు ఒకరినొకరు హృదయ పూర్వకంగా గౌరవిస్తారు. అందుచేత వీరు కారణాంతాలవలన విడిపోయినా వీరి మధ్యను ఉండే గౌరవానికి భంగం కలుగదు. తమమధ్యను మూడవవారి ప్రమేయాన్ని వీరు సహించ కూడదు.

కుంభరాశియందు జన్మించిన వారికి, కర్కాటక రాశి ( జూన్ 22—జూలై 22 )యందు జన్మించిన వారికి స్వభావంలో చాలా బేదం ఉంటుంది. కుంభరాశి వారి ఉదార భావం కర్కాటకరాశి వారికి నచ్చదు. అయినా కుంభరాశివారు కర్కాటకరాశి వారిని గౌరవిస్తూనే ఉంటారు. బలవత్తరమైన కారణాల వలన వీరు సన్నిహితులు అయినా, వీరి మైత్రి హృదయ పూర్వకమైనది కాక పోవచ్చును. కర్కాటక రాశివారు యెక్కువగా తమ వ్యవహారాల్లోనే ఉండి పోతారు. అది కుంభ రాశివారికి నచ్చదు. అందుచేత వీరి మైత్రి యెప్పుడూ అంతంతమాత్రం గానే ఉండిపోతుంది.

కుంభరాశియందు జన్మించిన వారికి, సింహ రాశి ( జూలై 23—ఆగష్టు 22 ) యందు జన్మించిన వారికి మైత్రి బాగా ఉంటుంది. సింహ రాశివారు నాయకత్వాన్ని కోరుతుంటారు. 'అందర సమానులే' నని కుంభ రాశి వారి అభిప్రాయం. అందుచేత వీరి మధ్యను భేదాభిప్రాయాలు రావచ్చును కాని వాటివలన వీరి మైత్రి పెరుగుతుందే కాని తరగదు. సింహరాశివారి చురుకుతనాన్ని కుంభరాశివారి ఆలోచనను జోడించినట్లయితే యెటువంటి పనినైనా సాధించగలరు. వీరి మైత్రి వలన యిరువురకూ ప్రయోజనం ఉంటుంది.

కుంభరాశియందు జన్మించిన వారికి, కన్యారాశి ( ఆగష్టు23—సెప్టెంబరు 22 ) యందు జన్మించిన వారికి స్నేహం అరుదుగా ఉంటుంది. కుంభరాశివారికి మానసిక విషయాలమీద మోజు ఉంటుంది. అది కన్యారాశివారికి నచ్చదు. వీరి మధ్యను భేదాభిప్రాయాలు తరుచుగా వస్తాయి. కాని కుంభరాశివారి ఉదార స్వభావం వలన వీరి మైత్రికి భంగం కలగదు. కుంభరాశివారి ఆలోచనలు కన్యారాశివారిని తరుచుగా ఆకర్షిస్తాయి. అందుచేత కన్యారాశివారికి కుంభరాశివారి మీద గౌరవం ఉంటుంది. మొత్తం మీద వీరిమధ్యను యెక్కువ సన్నిహితమైన మైత్రి ఉండక పోవచ్చును

కుంభరాశియందు జన్మించినవారికి తులారాశి (సెప్టెంబరు23—అక్టోబరు 22) యందుజన్మించిన వారికి మైత్రి బాగా ఉంటుంది. వీరు యిరువురి స్వభావాల్లోను పోలికలు చాలా ఉంటాయి. ఇద్దరూ ఆలోచనా పరులే. ఇతరులకు ఉపకారం చేయడంలో యిద్దరకూ ఆసక్తి ఉంటుంది. కాని ఆచరణలో భేదం ఉంటుంది. తులారాశివారికి న్యాయంమీద పట్టుదల అధికంగా ఉంటుంది. కుంభరాశివారికి యితరులమీద దయ అధికంగా ఉంటుంది. అందుచేత వీరు ఒకరి నొకరు గౌరవించుకొంటారు. కారణాంతరాల వలన వీరు విడిపోయినా, ఒకరిమీద ఒకరికి ఉండే గౌరవానికి లోపం ఉండదు.

కుంభరాశియందు జన్మించిన వారికి,వృశ్చిక రాశి (అక్టోబరు23—నవంబరు 21) యందు జన్మించినవారికి మైత్రి సాధారణంగా ఉంటుంది. కుంభరాశివారి ఆశయాలను వృశ్చిక రాశివారు గౌరవిస్తుంటారు. వృశ్చిక రాశివారి ఉదార స్వభావాన్ని కుంభరాశివారు మెచ్చుకొంటారు. అయినా వీరు కలసి ఉండడంలో యేవో భేదాభిప్రాయాలు వస్తుంటాయి. కాని వాటివలన వీరి మైత్రికి భంగం కలగదు. కారణాంతరాల వలన వీరు విడిపోయినా, ఒకరి నొకరు గౌరవిస్తూనే ఉంటారు. వృశ్చికరాశివారికి వ్యవహారజ్ఞానం అధికంగా ఉంటుంది. కాబట్టి కుంభరాశివారు వృశ్చికరాశి వారిని అనుసరించడం మంచిది.

కుంభరాశియందు జన్మించిన వారికి, ధనూరాశి (నవంబరు 22—డిశంబరు 21) యందు జన్మించిన వారికి మైత్రి బాగా ఉంటుంది. కుంభ రాశివారు సాధారణంగా ఉదార స్వభావులు. ధనూరాశివారు సాహస ప్రియులు అందుచేత ఒకరినొకరు తరుచుగా మెచ్చుకొంటుంటారు. వీరు యిరువురూ హాస్య ప్రియులే. సమాజంలో వీరు యిరువురూ కూడా గౌరవాన్ని సంపాదించ గలరు. అందుచేత వీరి మైత్రి చాలా కాలం ఉంటుంది, ధనూ రాశి వారివద్దకంటె

**(64 వ పేజీ చూడండి)**






**జరిగిన కథ**

రెండోపెళ్ళివాడయిన గోపాలంతో సుభద్ర పెళ్ళి జరిగింది అతనికి ఆమెతో వయసుకున్న కొడుకు శ్రీనివాస్ ఉన్నాడు. గోపాలం మరణం, శ్రీనివాస్ చదువు సుభద్రని కష్టాలపాలు చేశాయి, జగదీశ్ ఆమెని మోసం చేశాడు. తత్ఫలితంగా ఆడపిల్లని కంటుంది. ఫకీరు పంచలో ఆమెకి ఆశ్రయం లభిస్తుంది. రాజేశ్వరి శ్రీనివాస్‌ని వెతుక్కుంటూ వస్తుంది. ఇద్దరూ పెళ్లి చేసుకోవాలనుకుంటారు. రాజేశ్వరికూడా ఉద్యోగంలో చేరింది. అక్కడి పరిస్థితులు నచ్చక మళ్లీ విరమించుకున్నది. ఫకీరు మరణిస్తాడు రాజేశ్వరి శ్రీనివాస్‌తో పంతంకట్టి అమ్మగారింటికి వెళ్లిపోతుంది. అక్కడ దేవదాసు ఆమెతో పరిచయం పెంచుకున్నాడు. శ్రీనివాస్‌తో తెగతెంపులు చేసుకుంటుంది రాజేశ్వరి.

**15**

వాకిట్లో చుట్టపక్కాల మధ్య అవధానిగారి శవం నిండుగా దర్జాగా పడుకుని వుంది. అన్నపూర్ణ ముఖాన కాంతిరేఖలు కడుక్కు పోయాయి. శ్రీనివాస్‌ని చూస్తూనే భోరున యేడ్చింది. అయిన వాళ్ళు యెవరూ లేని అవధానిగారి దహన సంస్కారాల విషయం యింకా తర్కంలోనే వుండిపోయింది.

లాయరు నెమ్మదిగా అన్నాడు: 'మీరేనా శ్రీనివాస్' అని.

శ్రీనివాస్ బుర్ర వూపాడు.

'మీకు యీ కాగితాలు హేండోవర్ చేయాల్సిన బాధ్యత నామీద వుంది. అవధానిగారి లాయర్ని నేను.'

'ఆ కాగితాలు యేమిటి సార్', శ్రీనివాస్ అడిగాడు

'అందులో మీకో ఉత్తరం వుంది!'

శ్రీనివాస్ కళ్ళు అక్షరాల మీద పరుగులు పెట్టాయి.

'బాబూ'

అవధానిగారి పిలుపు అది. పలకరింపుగా కాగితం మీద పరుచుకుంది.

'నా' అనే వాళ్ళు నాకూ మీ పిన్నికీ కూడా లేరు. ముప్ఫై యెకరాలు చూసి యిప్పుడు కొత్తగా చుట్టాలు రావచ్చును. రాబందుల్లాంటి యీ చుట్టాలంటే నాకు అసహ్యం. మనం చూసుకున్న ముహూర్తబలం యెటువంటిదో? నాకు యీ ఆస్తి నీకే రాయాలని వుంది. నువ్వు యెటువంటి వాడివో నాకు తెలుసు. నీ మీద పెద్ద బాధ్యతలుంచుతున్నాను. మీ పిన్నిని కనిపెట్టుకుని వుండు. ఆవిడ పేర ఐదు ఎకరాలు విడిగా రాశాను. దాని తదనంతరం ఆ ఆస్తిని శ్రీ వెంకటేశ్వరస్వామికి డబ్బుచేసి పంపేయి. దాన్ని జీవితాంతం నీ యింటోనే వుంచుకో. నా తలకి కొరివి పెట్టి నాకు కొడుకువి కమ్మని, నాకు ఆ నరకం తప్పించమనీ ముప్ఫై యెకరాల భూమి అమ్మి కోరుకుంటున్నానని అనుకోకు. యేడాదిలో ఓసారి విన్నే కన్న కొడుకు అనుకున్న నాకు పిండ ప్రదానం చేయి.

ప్రేమతో
బాబాయ్.

'బాబాయ్,' శ్రీనివాస్ యేడ్చాడు. మామూలుగా కాదు గుండెలు పగిలేట్టు అన్నపూర్ణ వాళ్లో తల దాచుకుని యేడ్చాడు. అతని కేవీ యెబ్బెట్టుగా అనిపించలేదు. జన్మజన్మలకీ ఋణ పడాల్సిన బాధ్యతతను ఎప్పటికీ మరచి పోలేదు అవధానిగారిని శాస్త్రోక్తంగా నలుగురి పెద్దల సమక్షంలో మంత్రోచ్చారణతో స్మశానానికి సాగనంపి తలవెంట్రుకలు తీయించుకుని గోదావరిలో స్నానం చేసి యింటిదారి పట్టాడు శ్రీనివాస్.

అన్నపూర్ణ కడుపు చెరువై పోయింది. మాటకు కట్టుబడ్డ శ్రీనివాస్‌ని ఆ రూపులో చూసి గుండెలు అవిసి పోయేలా దుఃఖపడింది. యింక యెక్కువ రోజులు వుంచలేదు శ్రీనివాస్ తనతోబాటే ఆవిడనీ హైద్రాబాదు తీసుకు వెళ్ళాడు. అన్నపూర్ణ సంరక్షణ భారం అంతా శ్రీనివాసే చూసుకుంటున్నాడు. అయాచితంగా వచ్చిన ఆస్తిని చూసి మురిసిపోలేదు అతను. అతని అంతరంగంలో రాజేశ్వరి జ్ఞాపకాలు కదులుతూనే వున్నాయి.

తను తొందరపడ్డాడేమో, రాజేశ్వరిని సంతోషపెట్టి వుండవలసింది.

'ఛ! మీకెప్పుడూ ముక్కుమీదే కోపం. యిలా బ్రతుకంతా కోపగించుకుంటూ, నన్ను మాటలంటూ వుంటే నేను భరించ

లేదు. ఏదో వొక రోజున మాయం అయి పోతాను' శ్రీనివాస్ నవ్వేసి 'యెక్కడికీ మాయం కావు ఈ గుప్పిట్లో వున్నావు. ఆ గుప్పిళ్ల తాళాలు గుండెల్లో వున్నాయి' అంటాడు 'లేదు వూరికే అన్నాను. మిమ్మల్ని విడిచి యెక్కడికీ వెళ్లను. నేను లేకపోతే మీరు పిచ్చివార్లై పోతారు. అప్పుడు ఎర్రగడ్డలో చోటులేక పోతే సికింద్రాబాద్, హైద్రాబాద్‌ల మధ్య మజ్నూలా తిరుగుతూంటే......బాబోయ్ నేను చూడలేను.'

'చాల్లే, నేనేం నీకోసం అంత కలవ రించడం లేదు.'

'అయితే నన్ను పొమ్మంటారా.'

'ఓ. యస్'

రాజేశ్వరికి క్షణంలో రోషం వచ్చేస్తుంది. అతనన్న మాటల్లో యదార్థం గ్రహించదు...ఆ రోజంతా యేడుస్తూనే వుంటుంది...శ్రీనివాస్ కళ్ల ముందు గతం దొర్లి మాయమైంది. అన్నట్లు గానే రాజేశ్వరి తనని వదలి నిర్దయగా వెళ్లిపోయింది. రాజేశ్వరి తను లాయరు చేత పంపిన నోటీసు అందుకొన్నైనా అందు కోకుండా తప్పు అడ్రసుతో తిప్పి పంపింది. దేవదాసుని పెళ్లి చేసుకున్నట్లు ఆ మధ్య ముకుందం రాస్తూ తనని యింక ఆ వెర్రి వ్యామోహం వదిలి మరో మనిషిని చేసుకోమని సలహా యిచ్చాడు. ఈ కౌగిట్లో కరిగి పోయిన రాజేశ్వరి, తను అందించిన ముద్దుల్లో ముడుచుకుపోయి, తన సమక్షంలో స్వర్గం అనుభవిస్తున్నానన్న రాజేశ్వరి బ్రతుకులో మరో అవతారం ప్రారంభం అయింది కాబోలు. ఆ దేవదాసు చేతుల్లో, అతని పెదవుల్లో...ఛ! తలుచుకుందుకి తనకే యింత బాధగా వుందే, అనుభవించే రాజేశ్వరికి యే బాధా లేదా?

'పిచ్చి శ్రీనివాస్! కొందరు ఆడవాళ్లు అంతేనోయ్: స్త్రీకి హక్కులు వచ్చాయని విడాకుల తరువాత మళ్లి ఫ్రెష్ కాండిడేట్‌గా చలామణీ అవుతుందని అప్పుడు తను పెళ్లి చేసుకున్నా మగవాడు రెండుసార్లు చేసుకుంటే యెంతో తనూ అంతే అనుకుని తృప్తి పడుతుందనే విషయం నీకు తెలీదూ?' శ్రీనివాస్‌తో యెవరో మనిషి అంటూంటే అతని మనసు [illegible] తన్నుకుంది.



'ఇది యిప్పుడు కాదు—కొన్ని యుగాల నుంచీ వాడుకలో వస్తున్న ఆచారం. మగవాడు పవిత్రుడు. అతడేం చేసినా భారత దేశంలో పుట్టిన ఆడది అలా భర్త బ్రతికివుండగా చేసేందుకు వీలులేదు. పతితలు అలా చేస్తారు.'

'నాన్సెన్స్. ఆ రూల్స్, రెగ్యులేషన్సు పోయి చాలాకాలం అయిపోయింది. నీసిద్ధాంతాలని ఆచరణలో పెట్టేందుకు యిది కలికాలంరా నాన్నా' మనసు అతన్ని అవహేళన చేస్తూ అదిమేస్తోంది.

'కాబోసు.' నిస్పృహగా అనుకున్నాడు శ్రీనివాస్. కాళ్ళుద్దుకుంటూ యింట్లోకి రాగానే అన్నపూర్ణ అంది: 'నీ కోసం అమ్మాయి వచ్చిందిరా శ్రీనివాస్!' అని. ఆవిడ వొళ్లో బాబు ఆడుకుంటున్నాడు.

'ఎంత సేపైంది పిన్నీ ?'

'అరగంట దాటింది.'

'ఏమని చెప్పింది ?'

'ఏవో అర్థం కాని పాఠాలు మిగిలిపోయాయిట.'

'మళ్ళీ వస్తానందా ?'

'ఆఁ'

అన్నపూర్ణ భోజనం వడ్డించి కొంచెం దూరంగా కూర్చొని అంది: 'పసిపిల్లడు ఆ పిల్లను చూడగానే యెగిరి గంతులు వేస్తాడు. ఎన్నాళ్ళు యిలా వుంటావు నువ్వు. దాని దారి అది చూసుకుంది. అలాంటివాళ్ళకి నీతా, జాతా ?

# మొగలి పొదలు

వాళ్ళకి పాపం పుణ్యం వుండదు. ఆ పిల్లకి 'నా' అనేవాళ్ళు యెవరూ లేరుట. మనకి మాత్రం యెవరున్నారు? నువ్వు ఆ పిల్లని చేసుకుంటే- యేం ?'

ముద్దని నోటికి అందించబోయే వాడల్లా ఆగిపోయాడు. 'అదేమిటి పిన్నీ. మనకి యిష్టం అయితే ఆ పిల్లకి యిష్టం కావద్దూ.'

'నీకేం తక్కువని యిష్టం కాదురా ? తనకి రెక్కాడితేగాని డొక్కాడదు. దయతలచి పెడితే తింటుంది. లేకపోతే అలా వుండి పోవలసిందేకద. పరీక్షలు యెప్పుడు కావాలి ? ప్యాసైతేకదా వుద్యోగం ?'

(....................)

'పోనీ నీ అభిప్రాయం చెప్పరా.'

'నాకు యిష్టమే పిన్నీ', రాజేశ్వరి వెళ్ళిపోయాక అతను ద్వైధీభావనలో కొట్టుకుపోయాడు. ఆవిడ కోసం పరితపించిన మాట వాస్తవమే కానీ అతనేమీ ఆజన్మాంతం బ్రహ్మచర్యవ్రతం అవలంబించాలని గానీ భీష్ముడిలా వుండిపోవాలని గానీ పంతం పట్టలేదు.

'నేను కనుక్కుంటాను.'

ఖంగారుగా అన్నాడు శ్రీనివాస్: 'తొందర పడవద్దు పిన్నీ. పరీక్షలు కానివ్వు. ఆ పిల్ల మనల్ని అపార్థం చేసుకుంటే పరీక్షలు రాయనుకూడా రాయదు. ట్యూషన్‌కికూడా రాదు. బాబు బెంగటిల్లి పోతాడు.'

'అలాగేలేరా,' అన్నపూర్ణ మనసులో క్రిష్ణప్రియని కోడలుగానే చేసుకోవాలని వుంది. ఎలాగైనా భగవంతుడు ఈ విషయంలో మేలుచేస్తే బాగుండిపోను' అనుకుంది ఒకటికి రెండుసార్లు.

* * *

'రాజేశ్వరీ నువ్వే వెళ్ళిపోయావు నన్ను కాదని. నీ కొడుకు కోసం వస్తే నన్ను వదులుకోవు అనే భ్రమలో యిన్నాళ్ళు యెదురుచూశాను. నువ్వు రాలేదు. బాబు మస్తిష్కంలో అసలు నువ్వు పూర్తిగా తుడుచుకుపోయావు. వాడు 'అమ్మా' అని పెదాలు కలిపినపుడు ఆ ఆనందం కృష్ణప్రియ అనుభవించింది. నువ్వు అనవసరంగా అనుమానపడి నారాయణబాబుతో చెప్పావు. బాబు అందుకు బుజావుచేస్తూ 'అమ్మా' అని కృష్ణని పిలుస్తూంటే భయపడిపోయాను. నీకు నేనేమీ అన్యాయం చేయలేదోయ్. కృష్ణ లేకపోతే పసివాడు బ్రతకడు. వాడు లేనిదే నేనూ వుండను.'

'నేనేమీ ప్రవరాఖ్యుడిని కాను. జీవితంలో కొన్ని రుచులు చూసిన నేను యిలా బ్రతుకుని యిలాగే గడిపేయలేను. నాకూ జీవితం కావాలి. నా భార్య. నాతోడు నన్నంటుకుని బ్రతుకంతా వెన్నాడాలి. ఆ మనిషి నాకు కావాలి. క్రిష్ణప్రియే సరిపోతుంది. నువ్వు యేమనుకుంటావు? మనం సుఖంగా వున్నప్పుడే అనుమానించావు. నీ అనుమానం నిజం అయిందనీ ఆ కృష్ణ కోసమే నేను యిలా చేశాననీ...సరే నీ యిష్టం యేమైనా అనుకో. భగవంతుడిని మాత్రం నేను మోసగించలేను. అంతవరకూ నిజం. పిన్ని కూడా యిప్పుడు నాకు పెద్ద దిక్కై అదే చెబుతోంది. యిదివరకు ఎవరి మాటా విన లేదు పెద్దవాళ్ళు లేకపోవడంవల్ల. ఈసారి నా జీవితం అశుభంతో సమాప్తి కాదు. అదేదో నమ్మకం పిన్ని మాటల్లో. నేను నీపట్ల ద్రోహంచేస్తే క్షమించు,' శ్రీనివాస్ స్వగతంలో మూసీ వంతెన దాటి హైకోర్టు వైపు పాదాలు త్రిప్పాడు. అతనికేమీ తోచడంలేదు. కాళ్ళు పీక్కుపోతూంటే వెడుతున్నాడు అర్థం పర్థం లేకుండా. పరధ్యానంగా నడుస్తున్న అతని మెడమీద బలంగా యెవరో యినుపగుండు



## సబ్బులన్నియు శుభ్రపరచును కాని..

. నిష్కళంకమైన చర్మసౌందర్యం నిమిత్తం
# జి-11తో గూడియున్న సింథాల్
మీకు కావలెను.

(సింథాల్ యందు గల జి.11 (హెక్సాక్లోరొఫిన్) చర్మ వ్యాధులను
కలిగించే హానికరమైన క్రిములను చంపుతుంది. ఆహ్లాదకరంగా
పరిమళ మొనర్చబడినటువంటి జి.11 తోగూడియున్న సింథాల్ మీ
చర్మమును మృదువుగాను, ప్రకాశమానంగాను వుంచుతుంది.)




INTERPUB GCS 9A-TEL

ఆరోగ్య అనారోగ్య పరిస్థితులలో మహిళలు

ఆరోగ్య సౌభాగ్యములకు ఆధారపడునది లోధ్ర

60 సంవత్సరముల పైగా ప్రసిద్ధినొందినది






కేసరి కుటీరం (ప్రైవేట్) లిమిటెడ్
రాయపేట, మద్రాసు-14

ఏజెంట్లు:
సీతారామ జనరల్ స్టోర్సు (ఏజన్సీస్)
విజయవాడ-సికిందరాబాదు మధుర.
బరహంపురం. బెంగుళూరు



**ఫోల్డింగ్ 50 షాట్ పిస్టల్**

లైసెన్సు అక్కరలేదు. అమెరికన్ మోడల్. దొంగలు క్రూరమృగముల నుండి రక్షించుకోండి. ఉల్లాస ప్రయాణాలు, యాత్రలు, నాటకాలకు వశమైనది.

ఆటోమేటిక్ 50 షాట్లు పేల్చును. తేలికైనది. ఇందు నుండి వెలువడు పెద్ద శబ్దము మిమ్ము కాపాడును. ధర: 50




షాట్లు నెం.33 రు.13/50. జర్మన్ మోడల్ నెం. 99 రు. 15/50. వి.పి.పి. ఖర్చులు రు. 2/50. లెదర్ కేస్ రు.7/- అదనపుషాట్లు 100కి రు. 5/-

GEM ARTS (WAPM-15)
P. Box 1325, Delhi-6



**రు. 20/-లకు ట్రాన్సిస్టర్**

మా కో అవరే టివ్ పద్ధతిపైన రు. 20/— లకే రు. 330/—విలువ



గల ఆల్ వరల్డ్ 3 బ్యాండ్ పోర్టబుల్ ట్రాన్సిస్టర్ పొందండి. మీ ఆర్డరు నేడే వ్రాయండి.

CEYLON TRADERS
(WAP-11)
Post Box 1257, DELHI-6.


# మొగలి పొదలు

విసిరినట్లయింది. ఎదురుగావున్న బట్టల షాపులోంచి మంచి సూటులోవున్న అతని ప్రక్కన సుభద్ర...

శ్రీనివాస్ పరుగున వెళ్ళాలనే మనసుని అదిమిపట్టాడు. యిద్దరూ రిక్షాలో బయలుదేరారు. సందులుగొందులు దాటింది రిక్షా. సాయంత్రం ఆరుగంటలు, ఏడు, ఎనిమిది దాటిపోయింది. యింటిలోపలికి వెళ్ళిన సూటువాలా బయటికి వచ్చాడు. అతను వెళ్ళిపోయిన పదినిమిషాలకి సుభద్ర తలుపు తెరుచుకుని వీధిలోకి వెళ్ళిపోయి చీకట్లో కలిసిపోయింది. శ్రీనివాస్ కళ్ళకి నీడ కనిపిస్తూనేవుంది. కొంచెం లైటు కాంతిమీద పడుతూంటే యెదుటి వ్యక్తిని చూసి పోల్చుకోగలిగింది కానీ అదీ అస్పష్టంగానే.

'కొత్తవారా?'

శ్రీనివాస్ ఆ ప్రశ్నకి ఆశ్చర్యపోలేదు. నెమ్మదిగా 'పిన్నీ నేను శ్రీనివాస్‌ని' అన్నాడు.

నిశ్చేష్టురాలైంది సుభద్ర. అతను గమనిస్తూనే వున్నాడు.

'నేను వచ్చాను పిన్నీ'

'యిక్కడికి యెందుకు వచ్చావు?' సుభద్ర కంఠం కంచులా మ్రోగుతోంది. శ్రీనివాస్ యిలాంటి యిళ్ళవైపు వస్తున్నాడా? యీ అనుమానం కనిపిస్తోంది ఆ స్వరంలో.

'దేనికివచ్చావు?' మళ్ళీ అడిగింది.

'మీకోసం'

'నాకోసమా?' సుభద్ర కనుబొమ్మలు ముడిపడిపోయాయి.

క్రీనీడలో స్పష్టంగా కనిపిస్తోంది శ్రీనివాస్‌కి.

'అవునుపిన్నీ మీకోసమే రండి మనింటికి' ఆప్యాయంగా అన్నాడు శ్రీనివాస్. చివికిపోయిన అతని బ్రతుకులో జీవితం పొడుగునా ఎదురుచూసిన మనిషి కనిపించగానే అతనికి దుఃఖం ఆగిందికాదు.

'మనం అలా వెళ్ళి మాట్లాడుకుందాం రా' శ్రీనివాస్ చేయిపుచ్చుకుని కొద్దిగా దూరంలో మున్సిపల్ పార్కువైపు తీసుకువెళ్ళింది. అతనికి ఆవిడమీద యెటువంటి చెడుభావమూ కనిపించలేదు. పైపైచ్చు తనతల్లి చిటికెనవేలు అదుముకుని నడుస్తున్నట్లు అనిపించింది. పచ్చిక మీద చతికిలబడ్డాడు. అతని కళ్ళలో తిరిగే బిందువులు వెండిలా మెరుస్తున్నాయి పార్కులో దీపంకాంతి పడి.

సుభద్ర ఒకొటొకటిగా జరిగిన విషయాలు యేవీ దాచకుండా చెప్పేసి యేడుస్తూండిపోయింది చాలాసేపు. జగదీశ్‌తో బ్రతకాలని బ్రతుకుని నడిబజారు చేసుకుని అందరూ త్రొక్కుతూంటే ఓర్చిపట్టి చావలేక బ్రతుకుతూ ఏడుపు పంచుకునే వాళ్ళు లేక నవ్వుతూ గడుపుతోంది జీవితాన్ని. పూర్తిగా చెప్పేసి! 'నువ్వింక వెళ్ళిపో శ్రీనివాస్. నాకోసం యింటిదగ్గర లేనని తలుపులు పగలగొట్టి నానా రభసా చేస్తారు స్నేహితులు,' అని నవ్వింది బలవంతంగా.

శ్రీనివాస్ లేవలేదు.

'వెళ్ళిపో శ్రీనివాస్ యిలాంటి యిళ్ళ ఛాయలకి రాకు. నా మీద ఒట్టేసి చెప్పు' సుభద్ర యేడుస్తూ అంది.

'ఒట్టు పిన్నీ! నాకు యిటువంటి కోరికలు లేవు. మీకోసమే వచ్చాను' శ్రీనివాస్ జీవితంలో మొదటినుంచీ జరిగిన అనుభవాలు చెప్పుకు వచ్చాడు. వొకరికి యిద్దరు అప్తులై ఆ క్షణాలో తల్లీ కొడుకులై వోదార్చుకున్నారు. దుఃఖాన్ని పంచుకున్నారు.

'మీరూ రండి పిన్నీ, మన యింట్లో పిన్నితప్ప మరెవరూ లేరు' శ్రీనివాస్ సుభద్ర కాళ్ళమీద చేయివేశాడు.

'లేదు. నేను రాలేను. నావల్ల నీ భవిష్యత్ పాడైపోతుంది. ఈ జీవితానికి అలవాటు పడిపోయాను. నన్ను తిట్టుకో! నేను రాలేదనే కోపంలో. ఈ మొహాన్ని నలుగురికీ చూపించలేను. నేను చచ్చిపోయానని అనుకుంటే ప్రపంచం, అదృష్టవంతురాలిని. నీతో వచ్చి నీకున్న పరువు—ప్రతిష్టలు...'

'అవేవీ నన్ను రక్షించవు. నాతోరండి. మీకు నేనువున్నాను. నాకూ యెవరూలేరు అన్నపూర్ణ పిన్నితప్ప.'

'యెంత వెర్రివాడివి నువ్వు. ఈ ప్రేమ నీలోనే వుంచుకో. పాపిష్ఠి పిన్ని చరిత్రహీనురాలైపోయినా, నీమాట కాదన్నదని నన్ను తిట్టుకోకు. నాకు మళ్ళీ సంఘంలో ఘరానాగా బ్రతకాలని లేదు...'

'ఈ జీవితాన్ని తప్పించుకోలేరా పిన్నీ,' అమాయకంగా అన్నాడు శ్రీనివాస్.

'ఈ వ్యామోహంలోపడి శలభంలా మాడి పోతున్నా తప్పించుకోలేరు. నన్ను బాధ పెట్టకు. నీ పవిత్ర ప్రాంగణంలో అడుగు పెట్టాలన్నా నా మనసు ఒప్పుకోవడం లేదు'

'పిన్ని'

'నువ్వు మళ్ళీ పెళ్ళిచేసుకో పసివాడు కూడా వున్నాడంటున్నావు.'

శ్రీనివాస్ నెమ్మదిగా అన్నాడు: 'నా దగ్గరికి కృష్ణప్రియ అనే పిల్ల వస్తుంది పిన్నీ. ఆపిల్లకు యెవరూ లేరు. హాస్టల్లో వుండేది యిన్నాళ్ళూ పరీక్షలయ్యాక ట్యూషన్లు చెప్పుకుంటూ మనింటికి దూరంగా వుంటోంది. ఆపిల్లని కనుక్కోవాలనివుంది.

సుభద్రకళ్ళు మెరిశాయి: 'పిల్ల యెలావుంటుంది?'

'చాలా అందంగా'

'ఆ అమ్మాయికి యిష్టమేనా?'

'నేనింకా కనుక్కోలేదు'

'వాళ్ళు యెవరూ?'

'బ్రాహ్మణులు'

'ఒప్పుకుంటుందా?'

'అదే తెలుసుకోవాలి'

'పోన్లే ఓపనిచెయ్యి ఆడది బ్రతుకులో ఒంటరిగా వుండలేదని నాసంగతి దాచకుండా చెప్పెయ్యి. నువ్వూ గొప్పవాడివి అయ్యావు నీసంగతి తెలిసే నిన్ను కాలదన్నుకుంటే అవివేకి అనుకోవాలి'

'కులభావం చాలావుంది ఆపిల్లకి'

'చెప్పిచూడు. సిగ్గుపడకు నావిషయం చెప్పేందుకు. ఆలోచిస్తే తనకి కష్టం, సుఖం అర్థం అవుతాయి.'

'మీరూరండి పిన్నీ,' శ్రీనివాస్‌కి సుభద్రని అలా వదిలిపెట్టేయాలని లేదు

'కన్నవాళ్ళే ఛీ, పొమ్మంటే యింకా నాకోసం దేనికి ప్రాకులాడుతున్నావు...

'మీయింటికి వెళ్ళారా?' ఆశ్చర్యంగా అడిగాడు శ్రీనివాస్.

'మాయిల్లు,' విరక్తిగా నవ్వింది సుభద్ర. 'నేను వెళ్ళాను దేవదాసు దగ్గర నుంచి సింహాచలం తీసుకువెళ్ళక ముందు. వదినలు వీధిలోంచే తిట్లూ, శాపనార్థాలూ ప్రారంభించారు. అమ్మవంట యింట్లోంచి బయటికి రాలేదు'

'అప్పుడు అమ్మమ్మ రమ్మన్నది కదా'

'యెంత పిచ్చివాడివి? ఆరోజుల్లో నేను మీనాన్నకి భార్యని. పైగా వితంతువుని. నాకు యిక్కడ చాకిరి చేసేందుకు పని ఖాళీగావుంది. అన్నయ్యలు అందుకే మరీ మరీ చెప్పిపంపారు. యేటా కాన్పులతో నీరసించిన శరీరాల్తో వదినలు యింటి పనేం చేయగలరు? భార్యలమధ్య నా విలువ గుర్తించారు. చాకిరికోసం పిలిపించారు.'

'పోనీ ఆచాకిరీ యిప్పుడే చేస్తానని చెప్పలేకపోయారా?'

'అన్నయ్యలకి యెదిగిన ఆడపిల్లలు వున్నారు. వాళ్ళకి నేను అక్కడేవుంటే పెళ్ళిళ్ళు కావు. పైపెచ్చు అది వేశ్యా గృహం క్రింద చలామణి అయే అవకాశం వుందిట. పెద్దన్నయ్య యించుమించు కొట్టేందుకు సిద్ధం అయేడు. చిన్నన్నయ్యది మొదటినుంచీ శాంత స్వభావమే...

రెండుచేతులూ జోడించి నమస్కారం చేసి: 'పిల్లలున్న పేదవాళ్ళం. మమ్మల్ని మామానాన బ్రతకనివ్వు. వున్నదాంట్లో పిల్లలకేదో దారి చూపిస్తాం. నువ్వు యిక్కడేవుంటే వాళ్ళూ నీలా తయారవుతారు. నీకు కొంత డబ్బు యిస్తాను వెళ్ళిపో', అన్నాడు.

'మీరు వచ్చేశారు'

సుభద్ర నవ్వింది: 'మెడ పట్టుకుని గెంటించుకోలేదు. అదృష్టవంతురాలిని అంతవరకూ. అమ్మ యేడవడం మాత్రం వినిపించింది. ఆ రాత్రి మాత్రం వున్నాను దేవదాసు యింట్లో'

'మొత్తానికి చాలా అపాయం అయిన జీవితం'

'పోలీసులు యెప్పటికప్పుడు అదిలిస్తూ కావలసింది పట్టుకు పోతూంటారు. పీకదాకా తాగి బాకీపడ్డామని లేనిపోని నిందలు వేసి యిక్కడే వుండిపోయి నానా హింసా పెడతారు కొందరు. ఎందుకులే యివన్నీ. నువ్వూ, నీ జీవితం బాగుండాలి'

'యేం బాగో? చూస్తూ చూస్తూ మిమ్మల్ని నరకంలో వదిలి వెళ్ళాలని లేదు పిన్నీ'

'యింకా యేవిటో నీకు లేనిపోని బంధాలు. ఆరోజుతోటే ఆ యింటికీ నాకూ ఋణం తీరింది. అందుకే అనుభవిస్తున్నాను. యింకా చిత్రవధ అనుభవించాలి. అప్పుడుగానీ తృప్తివుండదు'

'మీ మీద మీకు అంత కక్ష యేవిటి





'మీనా' డీజల్ ఇంజన్
6 H P 650 R.P.M.
ఉత్పత్తిదారులు :-
శ్రీ తిరుమలై ఇంజనీరింగ్ కార్పొరేషన్,
191 శివాజి ఉద్యమ నగర్,
కొల్హాపూర్, (మహారాష్ట్ర)
ఆంధ్రప్రదేశ్‌లో జిల్లావారీ ఏజెంట్లు కావాలి

వాయిదాల చెల్లింపుపై ట్రాన్సిస్టర్

రు. 320/- విలువగల ప్రపంచ ప్రఖ్యాతిగల 'ఎస్కార్ట్స్' 3 బ్యాండ్ ఆల్ వరల్డ్ పోర్టబుల్ ట్రాన్సిస్టర్ నెలకు రు 10/- వంతున వాయిదాలపై చెల్లించి పొందండి. వివరములకు వ్రాయండి.



JAPAN AGENCIES, (APWM-10)
Post Box 1194, Delhi-6.

3 నెలలు ఉచిత బహుమతి

స్త్రీలకు అందాన్నిచ్చే కాశ్మీర్ ఆర్ట్ చీరెలు సరికొత్త ఆకర్షణీయమైన నమూనాలలోను రంగులలోను యీ బుతువుకు తగినట్లు మావద్ద గలవు పెద్ద సైజులలో మాత్రమే లభించును. 1 డీలక్స్-చీరరు. 11లు; 2కి రు. 20లు; 3కి రు. 28లు; 4కి రు. 36/- రెండు లేక అంతకుపైన చీరెలకు ఆర్డరు పంపిన వారికి బ్లౌజు గుడ్డ ఉచితం మీ ఆర్డరును పోస్టు పార్శిల్ ద్వారా పంపెదము.



ARVIND AGENCIES (APW-22)
P. B. 1408. Delhi-6.

# మొగలి పొదలు

పిన్నీ'

'అదంతే! కొన్ని సరిహద్దులు దాటాక మనిషి తనను తాను చంపుకునే స్థితికి దిగజారి పోతాడు. అదిమాత్రం చేయలేకుండా వున్నాను నేను'

'పిన్నీ' బాధగా అన్నాడు శ్రీనివాస్.

'దేనికి బాధపడతావు? యిప్పుడు ఈ శిథిలం అయిపోయిన శరీరాన్ని నీ యింటికి చేర్చమంటున్నావు. నాకు తెలుసు నేను యెక్కువ కాలం బ్రతకనని. నువ్వు వెళ్ళిపో శ్రీనివాస్.'

శ్రీనివాస్ చటుక్కున యేదో గుర్తుకు వచ్చినవాడిలా అన్నాడు: 'అప్పుడు యెవరో అన్నారు వొక ఆడపిల్ల వుండాలని...చెల్లియేదీ పిన్నీ?'

సుభద్ర యేడుపు దిగమింగి అంది: 'దాన్ని నాకు కాకుండా చేశారు సింహాచలం దాన్ని దేవదాసు దగ్గరే వుంచేశాడు.'

'ఎందుకూ?'

'అది పెద్దదైతే ఆటా, పాటా నేర్పి...'

సర్వం అర్థమయింది శ్రీనివాస్‌కి. ఝామకోడి కూస్తూంటే లేచి నిలుచున్నాడు: మీకు నేను ద్రోహం చేసివుంటాను. నన్ను క్షమించండి. మీకంటూ యేదైనా చేయాలనిపిస్తోంది. అది నాకూ ఆత్మతృప్తిగానే వుంటుంది. దేవదాసు అడిగినంత డబ్బొ యిచ్చి రేపే పిల్లని తెచ్చుకుని నా దగ్గర వుంచుకుంటాను. దాని భవిష్యత్ బాగుండేట్లు చూస్తాను. దానికి నేను వున్నాను. తండ్రి సంగతి అనవసరం. కానీ అది మీ ద్వారా నాకు చెల్లెలే అవుతుంది. మరి వస్తాను.' సుభద్ర రెండు చేతులూ జోడించింది: 'కన్నతల్లి ఎటువంటిదైనా ప్రేమలో భేదం వుండదు. దాన్ని కని పెంచిన ప్రేమని బానిసగా వదులుకున్నాను. నీకు నమస్కారం చేస్తున్నాను. నువ్వు సుఖంగా వుండు. పిల్లాపాపాతో...' సుభద్ర ఆశీర్వదించింది. శ్రీనివాస్ వొంగుని సుభద్ర పాదాలు తాకి చీకట్లో కలిసిపోయాడు. పార్కు నిర్మానుష్యంగా వుంది. చుట్టూ పది గజాలదూరం వరకూ యిళ్ళ ఛాయలుగానీ, మనుష్యుల అలికిడిగాని లేదు. సుభద్ర ఏడుపు శ్రీనివాస్‌ని వెన్నంటి తరుముతూనే వుంది.

* * *

రాజమండ్రీ చేరుకున్నాక యెకాయెకి దేవదాసు యింటికే వచ్చాడు శ్రీనివాస్.

'డబ్బు గడించానని రాజేశ్వరిని తీసుకు వెళ్ళాలని వచ్చావా?' కటువుగా అన్నాడు దేవదాసు.

'నాకు ఆ దురుద్దేశ్యం లేదు'

'మరి నీకు వున్న మంచి వుద్దేశ్యం తెలుసుకోవచ్చా?'

'ఆపిల్ల అంటే మా పిన్నికూతుర్ని తీసుకు వెళ్ళాలని వచ్చాను.'

'ఎవర్ని? మాధవినా'

'అవును'

'దాన్ని సింహాచలం దగ్గర డబ్బుపోసి కొన్నాను'

'ఆడబ్బు నేను యిస్తాను'

'ఆరోజుల్లో నేను ఐదు వందలకి కొన్నాను' యిప్పుడు యిన్నాళ్ళు దాన్ని భరించినందుకు.'

'నీకు కావలసినడబ్బు యిస్తాను. పిల్లని యిచ్చెయి దేవదాస్.

రాజేశ్వరి బయటకురాలేదు. తెరవెనుక ఆవిడ కంఠం స్పష్టంగా వింటూంటే శ్రీనివాస్‌కి దుఃఖంముంచుకువచ్చింది. తనతో గడిపిన ఆక్షణాలు యెంతదూరం జరిపినా చుట్టూ పరిభ్రమిస్తూనే వున్నాయి. ఎందుకిలా చేశావు? అనుకుంటూనే వున్నాడు అతను పదేపదే. ఆడది, ఆవిడకే లేని ఈ ప్రేమా వ్యామోహాలు తనకి దేనికి? చివరకి సర్దుకున్నాడు తనలోతనే. మళ్ళీ అతనిలో యేదోభావం తళుక్కుమంది తాళి కట్టిన తనమీద గౌరవంకానీ, స్నేహభావంకానీ, అభిమానంకానీ లేని స్త్రీలో కఠినశిలని చూస్తే చిత్రం అనిపించింది.

మాధవిని భుజాన వేసుకుని వెయ్యి రూపాయలూ యిచ్చేసి హైదరాబాదు వెళ్ళాడు. యిప్పుడు మాధవి ఐదేళ్ళపిల్ల ఆరోగ్యంగా జగదీశ్‌వే ముమ్మూర్తులా పోలిన ఆపిల్లని చూస్తూంటే శ్రీనివాస్ ప్రాణం చివుక్కుమన్నా అమాయకంగా ఆపిల్ల చేతులు చాపుతుంటే 'నేను అన్నని' అన్నాడు జాగ్రత్తగా.

(ఇంకా ఉంది)

# వారఫలం

## 20-9-1968 శుక్రవారం మొదలు 26-9-1968 గురువారం వరకు

**మేషం:** వృత్తి వ్యాపారాల్లో మీ కార్య క్రమాలు అనుకొన్నట్లుగా నెరవేరతాయి. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాల సంచలనం పెరుగుతుంది. ప్రయాణాలు శ్రమమీద ఫలిస్తాయి.

స్త్రీలకు—ఆరోగ్యంబాగా ఉంటుంది. ఆడంబరంకోసం వ్యయం జరుగుతుంది.

**వృషభం** సామాన్యమైన పనులకు కూడా విశేషమైన ప్రయత్నం చేయవలసి వస్తుంది. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీకృషి రాణిస్తుంది. పోటి వారితో మాట పట్టింపులు తగవు.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో అధిక వ్యయం జరుగుతుంది. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**మిథునం** వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాల్ని తగవు ఉద్యోగంలో గౌరవ ప్రాబల్యాలు బాగా ఉంటాయి ప్రయాణాలోచనలు చేస్తారు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది సంతోషకరమైన వార్తలను వింటారు.

**కర్కాటకం** . వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కలుసు కొంటారు. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది అధికారులవలన జరుగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరతాయి. స్థిరాస్తి వ్యవహారాలు బాగా ఉంటాయి. పోటి వారిలో గౌరవం లభిస్తుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. బంధువులకు సహాయం చేస్తారు.

**సింహం** మీ ఆత్మవిశ్వాసమే అన్ని వ్యవహారాల్లోను అనుకూలతను సాధించ గలదు. నూతన వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వృత్తిలో ఆదాయం పెరుగుతుంది. సాహిత్య కళారంగాల్లో మీకృషి రాణిస్తుంది. నజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కన్య** · వారం ప్రారంభంలోనే వృత్తివ్యాపారాలో చికాకులు యేర్పడి తరువాత సర్దుకొంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వ్యాపారంలో నూతనావకాశాలు అభిస్తాయి. సాంఘిక వ్యవహారాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. దైవకార్యాలు నెరవేరవచ్చు.

**తుల:** వృత్తిలో ఆదాయం బాగా ఉంటుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వారం మధ్యలో అన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడతాయి. మీ తాలూకు వస్తువులు పోయే ప్రమాదం ఉంది. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉండదు. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**వృశ్చికం:** ఆదాయం మాట యెలాగ ఉన్నా, అన్ని వ్యవహారాల్లోను గౌరవ ప్రాబల్యాలు బాగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు వారం మధ్యలో లాభిస్తాయి. వారం ఆఖరులో అని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడతాయి అధిక వ్యయం జరుగుతుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. నూతన విషయాలను తెలుసుకొంటారు.

**ధనుస్సు:** ఇదివరకు మీకు ఆందోళన కలిగించిన వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయ గలరు. మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు

**మకరం** లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం వచ్చేపరిస్థితి యేర్పడుతుంది. వృత్తిలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు. వారం మధ్యలో అనుకూలపరిస్థితి యేర్పడుతుంది. వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. పోటి వారిలో గౌరంవం లభిస్తుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. దైవ కార్యాలు నెరవేరతాయి.

**కుంభం** వృత్తివ్యాపారాల్లో మీ కార్యక్రమాలు అనుకొన్నట్లుగా నెరవేరతాయి ప్రయోజనంగల పరిచయాలు యేర్పడతాయి వారంమధ్యలో అన్ని వ్యవహారాల్లోను చికాకులు కలుగుతాయి. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉండదు. సంతోషకరమైన వార్తలను వింటారు

**మీనం:** వృత్తిలో పోటివారితో పోటీ పెరుగుతుంది. ఇతరుల మీద ఆధారపడి యేవ్యవహారమూ ప్రారంభించడం తగదు సాంఘిక వ్యవహారాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది. వారం ఆఖరులో అనుకోని చికాకులుకు గురి కాగలరు.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. పోటివారితో మాట పట్టింపులు తగవు.

— మహేష్






పెళ్ళిమండపం కళకళ్లాడుతూంది. సువిశాలమైన కాంపౌండులో కారాగింది. ముందు అమ్మమ్మ దిగింది. వెనుకనే రేఖా దిగింది. వేసవికాలపు సాయంత్రపు గాలి చెట్ల సందుల్లోంచి విసురుగానే వీస్తూంది. వేసుకున్న పైటచెంగు గాలితో కుస్తీపట్టి చేయి తప్పించుకుని వెనక్కి ఎగిరింది. అది వెనకనే వస్తున్న వో అందమైన యువకుడి ముఖానికి అడ్డంగా పడింది. ఎగురుతున్న పైటచెంగుని అందుకునే ప్రయత్నంలో గభాలున వెనక్కి తిరిగింది రేఖ—అప్పుడే చూసిందా యువకుణ్ణి—తొలిసారిగా.

అతని పేరు తెలియదు. ఊరు తెలియదు. కాని తొలిసారి ఇద్దరి కళ్ళూ కలుసుకున్న క్షణంలో చుట్టూ ప్రపంచం యావత్తూ కరిగిపోయినట్టూ—తను చూడగల్గింది అతనిముఖం ఒక్కటే నన్నట్టూ అనిపించింది రేఖకి. రంగు రంగుల దీపాలమధ్య అతని ముఖం ఎంత కాంతితో నిండి ఉంది.

అమ్మమ్మ గబ గబ నడుస్తూంది పెళ్ళి మంటపంకేసి. వెనకనే నడిచి వెళ్ళింది రేఖ.

అమ్మమ్మకి ముద్దుల మనుమరాలు కావడంతో ఆవిడ దగ్గరే ఉండి పెరిగి పెద్దదైంది. గర్వంగా తనవెంట తిప్పుకొంటూ, 'నా మనమరాలు రేఖ' అంటూ పెద్ద పెద్ద విందులలోనూ, సభలలోనూ సమావేశాలలోనూ పరిచయంచేసే అమ్మమ్మని చూస్తే రేఖకి భయం భక్తీ ఎక్కువ. అమ్మమ్మ - అటువంటి పేరుగన్న సంఘ సేవిక.

ఏలాగైన సరైన వరుణ్ణి అటు ఎయిఫోర్సులోంచో ఇటు ఆర్మీలోంచో పట్టి మనమరాలుకి కట్టపెట్టాలని అమ్మమ్మ ఆశ.

పెళ్ళిహాలు జనంతో నిండిఉంది. భరత నాట్య ప్రదర్శనం ఒకపక్క జరుగుతోంది. ఇంకోపక్క విందుగుడుస్తున్నారు కొందరు. వెళ్ళేవాళ్ళువెళ్ళి కూర్చుని చూస్తున్నారు. గుంపులు గుంపులుగా నిలబడి కబుర్లు చెప్పుకుంటున్న వాళ్ళు చెప్పుకుంటున్నారు.

'రేఖా అబ్బ! ఎంత అందంగా ఉన్నావే.' అంటూ రేఖని స్నేహితులు చుట్టుముట్టారు. అమ్మమ్మవెళ్ళి విందులో కూర్చుంది... రేఖ కళ్ళు అటూ ఇటూ దేనికోసమో వెతుకుతున్నాయి.

లోపలికి వచ్చాడా యువకుడు కూడా. ఇద్దరు పలకరిస్తున్నా తలూపి తిన్నగా రేఖకేసి నడిచి వచ్చాడు.

'ఏమిటలా బిత్తరపోతున్నావు? కెప్టెన్ భాస్కర్ తెలియదా? ఉండు పరిచయం చేస్తాను' అంటూ వద్దంటూన్నా వినకుండా 'భాస్కర్ కమ్ హియిర్' అంటూ కేక వేసింది రాధ. అందుకోసమే ఎదురు చూస్తున్నట్టు ముందుకు వచ్చి రేఖ ఎదుట నిలచాడు కేప్టన్. 'రాధా నీ స్నేహితురాల్ని పరిచయం చేస్తావా?' అన్నాడు రేఖమీదనుంచి దృష్టి మళ్ళించకుండానే.

'అందుకే నే పిలిచింది. రేఖ నాతో చదువుకుంది. కాని ఇప్పుడు అమ్మమ్మ సెక్రటరీగా ఉంటూ చదువుకి స్వస్తి చెప్పింది. రేఖా ఇతను భాస్కర్. కేప్టన్. నాకు దూరపు బంధువుగూడా.' అని పరిచయాలు ముగించేలోగానే రాధని ఎవరో కేక వేశారు. బొప్పుడ హెయిర్ విదిలించి 'ఇప్పుడే వస్తాను, మాట్లాడుతూ వుండండి' అంటూ వెళ్ళిపోయింది.

'రా, నాట్యంలో చివర కూర్చుని మాట్లాడుకుందాం' అన్నాడు భాస్కర్.

'అమ్మమ్మ...' అంది నెమ్మదిగా రేఖ.

'ఆవిడ కళ్ళపడని స్థలం ఖాళీగానే వుంది' అంటూ రేఖని నడిపించుకు వెళ్లాడు భాస్కర్.

'నిన్ను చూసిన క్షణంనుంచి నా కళ్ళ

కించెం కనబడ్డం లేదు' అన్నాడు నెమ్మదిగా. జతిస్వరం జోరులో ఎవరికీ యెవరి మాటలూ వినబడడం లేదు. విస్ఫారిన కళ్ళతో అతన్ని చూసింది రేఖ.

ఆ కళ్ళలోని భావం ఎప్పుడో అర్థం చేసుకున్నాడు భాస్కర్. మృదువుగా ఆమె చేయి తీసుకుని తన చేతుల మధ్య పెట్టుకున్నాడు

'హలో' అని నిన్ను పలకరించగానే ఈ రోజు వృధాకాలేదు' అనిపించింది తెలుసా? నీతో ఏకాంతంగా గడపడానికి ఓక్షణమైనా లభ్యం అవుతుందా లేదా అని భయపడ్డాను' అన్నాడు.

'అందరిమధ్యా ఉంటూనే గోప్యంగా మాట్లాడ్డం నేర్చుకోవాలి. నేనూ రాధా అంతే చేస్తాం ... అయితే రాధ నన్ను పూర్తిగా అర్థంచేసుకున్న స్నేహితురాలు' అంది క్రీగంట అతన్నిచూస్తూ.

''ఇందాక హలో అన్న దాని అర్థం గ్రహించలేదా నువ్వు?' 'దొంగా, తొలి మాపులోనే నన్ను బానిసను చేసుకున్నావు' అని దాని అర్థం'' అంటూ నవ్వాడు భాస్కర్.

ఇంతట్లో అమ్మమ్మ దృష్టి తనపై పడడం గమనించిన రేఖ కొంచెం భయపడింది. 'అమ్మమ్మ చూస్తోంది. మనకు కూడా కూర్చుందుకు రాథనస్తే బాగుంటును' వినీ వినిపించనంత నెమ్మదిగా అంది రేఖ.

'నువ్వు పూర్తిగా మీ అమ్మమ్మ అధీనంలో ఉన్నావా? ఆమె మెప్పుపొందాలంటే ఏం చెయ్యాలి?' కుతూహలంగా అడిగాడు.

'గొప్పవాడు కావాలి. హోదాలో ఉండాలి. గొప్పగొప్పవారితో భుజం కలిపి తిరగగలగాలి. యింకా...'

రేఖమాటని మధ్యలోనే ఆపి—

'చాలు. వాటిలో ఏ ఒక్కటీ నాకులేదు. మరి నిన్ను అడగాలంటే ఏం చెయ్యాలి రేఖా? అసలావిడ నన్ను చూస్తోందంటావా?' నవ్వేసి ఊరుకుంది రేఖ—

అమ్మమ్మ లేచింది. రేఖ తనూ లేవడానికి సిద్ధపడింది. జనాన్ని తప్పించుకుంటూ బయటికి వస్తోంది

'మళ్ళీ ఎప్పుడు దర్శనం' ప్రాధేయపడుతున్నట్టు అడిగాడు రేఖచెయ్యి వదలకుండా.

'రేపు రాధవాళ్ళ ఫేమిలీతో పిక్నిక్ ఉంది.' అంటూ నిలబడింది రేఖ.

'థ్యాంక్యూ. ఇకమీదట రాధారావుకుటుంబాన్ని పట్టుకు వేలాడుతాను. వాళ్ళెక్కడికి వెడితే అక్కడికల్లా నేనూ సిద్ధం అవుతాను. నిన్ను నలుగురిలోపాటు చూసే అవకాశమేనా దొరుకుతుంది. ఏం రేఖా?' దీనంగా అడిగాడు.

'అలాగే-నే వె డ తా ను' అంటూ భాస్కర్‌ని తప్పించుకుని అమ్మమ్మ కేసి నడిచింది రేఖ—అటే చూస్తూ కూర్చున్న భాస్కర్‌కి కాలం స్తంభించిపోయినట్టయింది.

'ఇక వెళ్ళిపోదామా అమ్మమ్మా!' అడిగింది అమ్మమ్మ మోచేతిదగ్గర నిలబడుతూ.

'నీ కోసమే చూస్తున్నానురా' అంటూ రిసెప్షనులో యిస్తూన్న పంచీ అందుకుని అందరినీ పలకరించుకుంటూ కారుకేసి నడిచింది. వెనకనే రేఖ నడిచింది.

ఆమె మనస్సు ఎక్కడో ఉంది.

మేఘాలమీద నడుస్తున్నట్టుంది. కాళ్ళకి భూమి తగలడంలేదు.

చెవులేవేవో తీయని మాటలని వినిపిస్తున్నాయి.

కళ్ళు వింత వెలుగుతో ఆకాశంమీద వెలుగుతున్న నక్షత్రాలలాగా మెరుస్తున్నాయి.

అమ్మమ్మ వెనకనే కారెక్కి కూర్చుంది రేఖ.

'నీతో మాట్లాడుతున్న కుర్రాడెవరు?' ఉరమని పిడుగులాగా అడిగింది అమ్మమ్మ. ఊహల మేఘాలలో తేలియాడుతున్నా రేఖ ఒక్క ఉదుటున నేలమీదకొచ్చిపడింది.

'నాకు తెలియదమ్మమ్మా రాధారావు వాళ్ళకి దూరపు చుట్టంట' అంది.

'మేజర్‌రావు పదిసార్లేనా అన్నాడు నాతోటి. అది మంచిదే అయిందిలే. ఎలాగేనా రావుదృష్టి నీకేసి మళ్ళాలన్నా నా ఎత్తులో పూర్ క్రీచర్ పాన్ అయాడు' గట్టిగా నవ్వింది అమ్మమ్మ.

అదరిపడింది రేఖ.

'ఏమిటమ్మమ్మా? మేజర్‌రావు విడోయర్ కదూ?' అడిగింది.

'అయితేనేం కుర్రాడు. అందగాడు ఆస్తిమంతుడు. అతడెంతటి శ్రీమంతుడో నీకేమైనా ఐడియా ఉందా?' రేఖ అమాయకత్వానికి నొచ్చుకుంది అమ్మమ్మ.

'అయినా ప్రేమ లేనిచోట నేను పెళ్ళి చేసుకోలేను అమ్మమ్మా' అంది.

'సిల్లీ, ప్రేమ అదేవస్తుంది మిగతావి అలా సులభంగా వస్తాయి? ... అంతా రాజాలూ రాణీలూ అవరు. అందుకే నా ఎత్తుకి భాస్కర్ పావుకింద చక్కగా కుదిరాడనుకో'' అంటూ సంతోషంగా నిట్టూర్చింది అమ్మమ్మ.

'బైది బై రేవు రాధా వాళ్ళతో పిక్నిక్ వెడతావు కదూ? రావుకూడా వస్తాడు. మర్యాదగా మాట్లాడి మంచి ఉద్దేశ్యం కలిగేలా చూసుకో. ఎలాగా మనింటికి రావాలనీ నాతో మాట్లాడాలనీ అన్నాడులే. అప్పుడడుగుతాడు నిన్ను తనకిచ్చి చెయ్యాలని. ఆ అదృష్టం నీకు రాసి పెట్టాలి' అంది అమ్మమ్మ.

కారు ఇల్లు చేరేసరికి రేఖలో ఉత్సాహం పూర్తిగా హరించిపోయింది. రాత్రి నిద్రలో మెలుకువలో భాస్కర్ మాటలు వినిపించాయి. కళ్ళ వెలుగులు జిగేలుమనిపించాయి. కాని అమ్మమ్మ మాటలు ముళ్ళుముళ్ళాగా గుచ్చుకోసాగాయి. ఆ రాత్రి రేఖ కలత నిదరే అయింది.

* * *

ఉదయం లేచేసరికి అందెమ్మ వచ్చి 'లేండి రేఖమ్మగారూ, అమ్మమ్మగారు యింకా లేవలేదు' అని లేపింది.

'ఏం అందెమ్మా, ఒంట్లో బాగాలేదేమో చూశావా?' లేస్తూ అడిగింది రేఖ.

'జలుబు చేసి జ్వరం వచ్చిందిటమ్మా. పడుకునే వున్నారు. మిమ్మల్ని పెందరాళే లేపమన్నారు' అంది అందెమ్మ.

ఎందుకో తెలియదు గాని 'హమ్మయ్య' అనుకుంది రేఖ. రాధ వాళ్ళ పిక్నిక్‌కి అ మ్మ మ్మ రా ద నే కా బో లు! స్నానంచేసి టిఫిను ముగించి అమ్మమ్మ దగ్గరికి పరుగెత్తింది రేఖ. మనస్సు ఏమిటో మహతేలికగా హాయిగా ఉంది.

'ఏం అమ్మమ్మ, మరెలా నువ్వు రావా? పోనీ మానేద్దామా?' ఒకే ఊపిరితో అన్ని ప్రశ్నలూ వేసేసింది.

'నేనెలా వస్తానే యీ రొంపతో. నువ్వు వెళ్ళు. వచ్చేప్పుడు మేజర్‌రావు నిన్ను

# తొలి చూపు

చింపేస్తాడులే అని పర్మిషన్ ఇచ్చేసింది.

పది నిముషాలలో అందంగా అలంకరించు కొని పురివిప్పిన నెమలిలాగా కారులో అడుగుపెట్టింది రేఖ.

కారు రాధా వాళ్ళింటిముందు ఆగిందాకా ఏం ఆలోచించిందో కూడా గుర్తులేదు. డ్రైవరు తలుపు తెరిచాడు.

'అమ్మయ్య, వచ్చావా? నీ కోసం భాస్కర్ కాలుకాలిన పిల్లిలాగా తిరుగు తున్నాడు. ఓ కాలిమీద కొంతసేపు, ఇంకో కాలిమీద కొంతసేపూ, దృష్టేమో వీధి గుమ్మం వైపు!' నవ్వుతూ ఆహ్వానించింది రాధ.

రెపరెపలాడుతున్న హృదయంతో డ్రాయింగు రూములో అడుగెట్టింది రేఖ.

'వచ్చావా??' అంటూ మెరిసే కళ్ళతో ముందుకి వచ్చాడు భాస్కర్

'మనం మాట్లాడుకోవలసింది ఎంతో ఉన్నప్పుడిలా గుంపులోపడి కాలం వృథా చేస్తావా రేఖా?' ప్రాధేయపడ్డాడు భాస్కర్. 'ఎలాగ? అందరిమధ్యా ఉండి గోప్యంగా మాట్లాడుకోవాలంతేగాని...'

'మరిందాకా నేనన్న 'వచ్చావా' అన్న దానికి అర్థం ఏమిటనుకున్నావు రేఖా — రేఖా నువ్వు చాలా అందంగా ఉన్నావు. తొలి వసంత పిచికలా ఉన్నావు. ప్రేమ గీతపు పల్లవిలాగా ఉన్నావు చిర విరహాగ్నిలో మగ్గిన నా శరీరానికి నిండైన కౌగిలిలా ఉన్నావు' అని అర్థం. తెలియ లేదా!?' అన్నాడు భాస్కర్—రేఖ చెవులు రెండూ పట్టుకుంటూ.

అమ్మమ్మ రాకపోవడంతో పెద్ద వాళ్ళు తప్పించుకున్నారు — రాధా రేఖా భాస్కర్ ఇంకో ముగ్గురు మిగిలారు. అందరూ సర్దుకునేలోపల రేఖని తన కారులో ఎక్కించుకు ముందుకు సాగాడు భాస్కర్.

మహాబలిపురం — ఎన్నోసార్లు చూసినదే కాని చేతిలో చేయి వేసుకుని ఏకాంతంలో అర్థంలేని యింకెవరికీ అర్థం గాని ప్రేమమాటలు మాట్లాడుకుంటూ వాళ్ళవెంట నడవడానికీ, ఇసకలో, షోర్ టెంపుల్ వెనకాలా కూర్చుందుకు ఎంతో బాగుంటుంది. అందుకే ప్రేమికులకి ఏకాంతాన్ని కోరుకునేవారికీ మహాబలిపురమే— పిక్నిక్‌కి వెళ్ళడం అంటే!

రేఖా, భాస్కర్ గుండెలు నిండేలా మాట్లాడుకున్నారు.

'నేను అమ్మమ్మకి చెప్పేస్తాను భాస్కర్, నిన్ను తప్పించి ఇంకెవరినీ పెళ్ళి చేసుకోను' అంది అతని హృదయం మీద వాలిపోతూ.

'నువ్వు నన్ను పెళ్ళి చేసుకోకపోతే నేనసలు పెళ్ళేచేసుకోను రేఖా ఇంకో స్త్రీని ఈ కళ్ళతో చూడను' అన్నాడు ఆవేశంగా రేఖను తన కౌగిట పొదవుకుంటూ.

ఎంతో హాయిగా కాలంగడిపి నిస్త్రాణగా యిల్లు చేరింది. తొలి ప్రేమ బరువుతో వాలిన కళ్ళతోవస్తున్న రేఖనుచూసి ఆత్రంగా అమ్మమ్మ అడిగింది ఎలా గడిపారు రేఖా యీరోజు?' ఆమెకి మేజర్ రావు వచ్చాడో లేదో తెలుసుకోవాలని కోతుకగా ఉంది.

'నువ్వు రాలేదని రాధావాళ్ళ అమ్మగారూ అత్తయ్యగారూకూడారాలేదమ్మమ్మా. మేమేవెళ్ళి కాస్సేపు తిరిగివచ్చాం' అంది ఏమంత ఉత్సాహం కనబడనీయలేదు.

హృదయంలో వేయికోయిలలు పాడుతున్నా నిశ్శబ్దంగా కాలంగడుపుతున్న రేఖ ఏదో దాస్తోందని గ్రహించింది అమ్మమ్మ. కాని అవకాశంకోసం ఎదురుచూస్తోంది.

* * *

ఆరోజు హాల్లో రేఖని అడ్డగించి రహస్యంగా అందెమ్మ అంది. 'అమ్మాయి గారూ పొద్దుటినుండి ఓ కుర్రాడు కాలు కాలిన పిల్లిలాగా మన రోడ్డు మొగని తిరుగుతున్నాడు. మీ కోసం లాగుంది.' అంది లాలోచీగా నవ్వుతూ

ఇంతలోనే తలుపుతట్టి హాల్లోకి అడుగుపెట్టాడు భాస్కర్

'మీ అమ్మమ్మ గారిని కలుసుకోవాలని వచ్చాను రేఖా.చెప్తావా'అంటూ దగ్గరే ఉన్న కుర్చీలో కూలబడ్డాడు అతనో నిర్ణయానికి వచ్చినట్టు ఎంతో ధైర్యంగా వున్నాడు. అందెమ్మ వెళ్ళి అమ్మమ్మని పిల్చుకు వచ్చింది రేఖ వెళ్ళిపోయి గది అవతల తలుపుదగ్గర నిలబడింది కొట్టుకుంటున్న గుండెల చప్పుడు చెవుల్లో భూకంపంలాగా ధ్వనిస్తోంది.

'నమస్కారమండీ,' అంటూ లేచి నిలబడ్డాడు భాస్కర్—అమ్మమ్మ హాల్లోకి రాగానే లేచి నిలబడుతూ.

'కూర్చో...ఏం మాట్లాడాలని?' గంభీరంగా ఉన్న అమ్మమ్మ కంఠస్వరంలోని కాఠిన్యానికి గుమ్మం అవతల నిలబడిన రేఖ అదిరిపడింది.

'నేను మీ రేఖని వివాహం చేసుకోవాలని కోరుతున్నాను మీతో ముఖాముఖీ మాట్లాడి వెళ్దామని వచ్చాను' భాస్కర్ కూడా గంభీరంగా అన్నాడు.

చాలా తేలికగా, హేళనా పూర్వకంగ నవ్వేసింది అమ్మమ్మ.

'మా రేఖనా? నువ్వా? పెళ్ళి చేసుకోవాలని కోరుతున్నావా?...రేఖ కూడ



అదే కోరుతోందా ?'

'మేం ఇద్దరం ఒకరినొకరం ప్రేమించుకున్నాం. మీరు అనుమతిస్తే ఎంత త్వరగా వీలయితే అంత త్వరలో పెళ్ళి చేసుకోవాలని కోరుతున్నాం...' ఇంకా ఏదో చెప్పబోతున్న భాస్కర్ మాటకి అడ్డు వచ్చి—

'నీ మాట్లాడ్డం అయిపోయిం దను కుంటాను. నువ్వలాంటి ఆలోచన విరమించుకోవడం ఇద్దరికీ శ్రేయస్కరం. రేఖకి ఐశ్వర్యవంతుడూ హోదాలో ఉన్నవాడూ వరుడు ఎప్పుడో నిర్ణయం అయిపోయాడు. నీకు రేఖ చెప్పలేదా?' తీవ్రంగా అడిగింది అమ్మమ్మ.

ఆ పచ్చి అబద్ధానికి అదిరిపడింది రేఖ. ఒక్క పరుగున హాల్లోకి వచ్చి భాస్కర్ సరసన నిలబడుతూ,

'అది అబద్ధం భాస్కర్. నేను నిన్ను తప్పించి ఎవరినీ పెళ్ళి చేసుకోను. నిన్నూ నన్నూ ఎవరూ వేరు చేయలేరు' అంటూ అతని గుండెలమీద తల ఆన్చుకుంది.

'రేఖా, నీకు సిగ్గు కూడా వేయడం లేదా ? నీ ప్రవర్తనకి నా తల సిగ్గుతో వాలిపోతూంది. బొత్తిగా బరితెగించిన ఆడపిల్లని ఏ మగవాడూ గౌరవించడని తోచ లేదా ?' గట్టిగా అరిచింది అమ్మమ్మ.

'అమ్మమ్మా, మేం పెళ్ళిచేసుకుంటాం. నువ్వు ఒప్పుకున్నాసరే, లేకున్నాసరే. భాస్కర్‌కి ఏం లోటని?' నిలదీసి అడిగింది రేఖ.

'నీకాలోటు తెలియకపోవడంలో ఆశ్చర్యం లేదు రేఖా, నువ్వు ముందు లోపలికి వెళ్ళు' అంది ప్రశాంతంగా అమ్మమ్మ.

వెక్కివెక్కి ఏడుస్తూ లోపలికి నడిచింది రేఖ. వెడుతూ వెడుతూ వెనక్కితిరిగి దెబ్బ తిన్న లేడిపిల్లలాగా భాస్కర్‌కేసి చూసింది.

'నన్ను జ్ఞాపకం ఉంచుకో. నన్ను మరిచి పోకు భాస్కర్. నన్ను మరచి పోకు' అంటూ లోపలికివెళ్ళి మంచంమీద వాలిపోయింది.

అలా ఎంతసేపు గడిచిందో తెలియలేదు రేఖకి. తెలివివచ్చేసరికి మధ్యాహ్నం దాటి నట్టుంది. ఎండ తీవ్రంగా ఉన్నా కిటికీ తెరలు గాలికి కదలాడుతున్నాయి. అందెమ్మ లోపలికి వచ్చింది — చేతిలో పండ్లరసం గ్లాసు పట్టుకుని 'అమ్మాయిగారూ,




ముత్యాలవంటి,

తెల్లని పలువరస...
సులభమైన డెంటానిక్ పద్ధతి ద్వారా మీరు అందమైన తెల్లని దంతములను, ఆరోగ్యకరమైన చిగుళ్లను పొందగలరు.

సోడా, మరియు క్లోరోఫిల్ తో లభించును

బెంగాల్ కెమికల్స్.

డెంటానిక్

ఆంటిసెప్టిక్ టూత్ పౌడర్

కలకత్తా * బొంబాయి * కాన్పూర్ * ఢిల్లీ






ఓం! తత్! సత్!



సుఖ జీవిత సేవ

"సిద్ధవైద్యమహిమ"

సిద్ధుల సాటిలేని కీర్తికి ఒక తార్కాణము

కే. టి. కృష్ణమూర్తి ఆచ్చారి గారి

'మేల్ మాయిల్ మందు'

(Regd)

దీర్ఘకాల చర్మరోగములకు చక్కని నివారిణి

నల్లరంగు, ఎర్రరంగు పొడలు, దద్దులు, పోట్లు, గజ్జి (చర్మసంబంధము) పొడలు గల చోట్లలో తిమురులు, సూదితో పొడిచినప్పుడు నొప్పి లేకుండుట, నిప్పవడి బొబ్బలు గలిగినా తెలియకుండుట, దుర్నీరు సర్వ అవయవములందు వ్యాపించి, రక్తములో కలిసి మత్తు కలుగజేయుట, (నరముల సంబంధము) చేతివ్రేళ్ళు ముడుచుకొనుట, బొబ్బలు లేచుట, ముక్కు బంధనములు, పాదము నందు పల్లపు పుండ్లు ఏర్పడుట, కాలుచేతులు వ్రేళ్ళు తగ్గుట, ముక్కు సొట్టవడుట, చూచుటకు విసుగు పుట్టించు రణములు (అస్థి సంబంధము) వీటికి చక్కని నివారిణి.

1 మండలం (40 రోజులు) నూనె, లేహ్యము రు. 11/- తపాలా ఖర్చు రు. 2-50

8 ఔన్సుల శ్రీ పరమాత్మ తైలం రు.5/- తపాలా ఖర్చు రు. 2/-

సిద్ధ డాక్టర్

కే. టి. కృష్ణమూర్తి ఆచ్చారి & సన్సు

5/22, మేల్ మాయిల్ P.O., (N.A. Dt.)

# ప్లాటిపస్



రంగులరాట్నం

జమ్మి కోనేటిరావు

దీన్నే డక్‌బిల్ అంటారు. బాతు ముక్కులాటిది ఉండడమే దీనికి కారణం. ఇది స్తన్యజీవి అయినా, పిల్లలను కనకుండా గుడ్లు పెట్టడం దీని ప్రత్యేకత. సుమారు 2 అడుగుల పొడవున్న దీని శరీరంమీద, స్తన్యజీవులకు మల్లే వెంట్రుకల కప్పు—ఊదారంగుది—ఉంటుంది. బాతులకు మల్లే కాలివేళ్ళమధ్య చర్మం ఎదిగింది. ఈతకు ఇది ఎంతో అనువు.

ప్లాటిపస్ తూర్పు ఆస్ట్రేలియా, టాస్మేనియాలో నివసిస్తుంది. నది వద్దున భూమిలో లోతుగా బొరియలు చేసుకొని నివసిస్తాయి. ఒక ద్వారం నీటిలోకి, వేరొకటి పైన భూమి మీదకు ఉండడంవల్ల, అవసరమైతే బయటకు కనబడకుండానే నీటిలోకి పోగల్గుతుంది. లోన గడ్డి కర్రలతో గూడు కట్టుకొంటాయి. ఒక మగ-ఆడకలిసి నివసిస్తాయి. 2 నుండి 4 వరకు గుడ్లు ఉంటాయి వెంట్రుకలు లేని, చిన్నపిల్లలు బయటకు వచ్చాక, పాలకని, తల్లి, తోకతో స్తనాలకు పిల్లలను ఒత్తుకొంటుంది.

చక్కగా ఈదగల్గే వీటికి ఇతర త్రా రక్షణ శక్తులు తక్కువ. అయితే మగదాని వెనుకకాళ్ళకు, ఒక విష ఆయుధం ఉంటుంది. వాటి గూడు మార్గాలలో ఇతరజంతువులు రాకుండా అడ్డు పెట్టుకొంటాయి.

రెండుమూడు అంగుళాల పొడవుండే, 'బాతు' ముక్కుతో, నీటి అడుగున మట్టికెలికి వానపాములు, నత్తలు, పురుగులు తింటాయి. విపరీతంగా తినడం దీనిలక్షణాలలో ఒకటి.

చిన్నవాటికి దంతాలున్నా, పెద్దవాటికి అవి రాలిపోయి విసురు రాళ్లలాగా వేరే కొన్ని ఎదుగుతాయి! అంతే కాక సామాన్యంగా ఇతరస్తన్య జీవుల లాగా వీటికి చెవి డిప్పలు ఉండవు!

## తొలి చూపు

ఇదేనా తాగండమ్మా, శోషవచ్చి అలాగే నిద్రపోయారు' అంది చెదిరిన రేఖ ముంగురులు సవరిస్తూ.

'అందెమ్మా, భాస్కర్ వెళ్ళిపోయాడా? అమ్మమ్మ ఏమంది?' ఆత్రంగా అడిగింది.

'అబ్బాయిగారు వెళ్ళిపోయారమ్మా' దీనంగా అంది అందెమ్మ

'మంచి బాబులాగా ఉన్నాడు. పాపం!' అంది.

'అమ్మమ్మ ఏమంది?'

'మీ మనసు మారకపోతుందా! నేను అప్పటిదాకా ఉంటానన్నా'రాయన. ఆవిడగారు ముఖంమీదే నవ్వేసింది. అంతేకాదు—'నా మనస్సు మారడం సంగతి అటుంచు ముందు నీ సంగతి చూసుకో. మళ్ళీ రేఖని కలుసుకున్నట్టుగాని మాట్లాడినట్టుగాని తెలిస్తే నీకూ మర్యాదకాదు, నాకూ మర్యాద కాదు' అంటూ లేచి చక్కా వచ్చేశారు... అబ్బాయిగారేమో, అలాగే చాలాసేపు కూర్చుండిపోయారు. నేను ఇటూ అటూ అక్కడే తిరిగాను—బాబేదో చీటీ రాసి యిచ్చాడు—యిందు' అంటూ బొడ్లో దాచిన చీటీతీసి యిచ్చింది.

ఆత్రంగా ఆచీటీ అందుకుని విప్పింది రేఖ. కళ్ళనీళ్ళు వరచుకుని అక్షరాలు సరిగ్గా కనబడలేదు 'ఎప్పటికేనా నీ వాణ్ణే నిన్ను మరిచి బ్రతకలేను రేఖా ఆ సంగతి మరిచిపోకు. జీవితాంతం నీకోసం ఎదురు చూస్తాను. అంటూ తన హృదయం విప్పి కాగితంమీద పరిచాడు భాస్కర్. మళ్ళీ ఎక్కడినుంచో దుఃఖం పెల్లుబికి వచ్చింది రేఖకి. తలగడాలో ముఖం దాచుకుని వెక్కి వెక్కి ఏడుస్తూ పడుకుంది.

*          *          *

అమ్మమ్మకి పెద్ద సొసైటీలో ఉన్న పలుకుబడి రేఖకి తెలియనిది కాదు. వారం రోజులలోపలే ఆనోటా ఆనోటా మేజర్ రావు రేఖని ప్రేమిస్తున్నాడన్న వార్త వ్యాపించిపోయింది. రేఖ స్నేహితులు వచ్చి అడిగిపోతున్నారు. వేళాకోళాలు చేస్తున్నారు. రేఖ బిత్తరపోయింది—యీ వార్తవిని. చాలా మంది దగ్గర ఖండించింది. కాని ఏం లాభం? అమ్మమ్మ పట్టుదలముందు ఉపాయాలముందు రేఖ ఏడుపు, బాధ అంతా వృధా. ఏడవడం తప్పించి ఏం చేయ

లేకపోయింది. రాధకి అందెమ్మచేత కబురంపింది. భాస్కర్‌ని చూసి మాట్లాడి మేం వెళ్ళిపోడానికి సహాయం చెయ్యలేవా? అని అడిగింది.

రాధ ఆరోజు సాయంత్రమే భాస్కర్ కోసం వెళ్ళింది. కాని అతని యిల్లు తాళం వేసి ఉంది. ఆవార్త రేఖకి అందచేసింది. ధైర్యం చిక్కబట్టుకోమని చెప్పివంపింది.

భాస్కర్ మళ్ళీ రేఖని ఒప్పించాలనిగాని కలుసుకోవాలనిగాని ప్రయత్నించలేదు. అన్నీ సిద్ధం చేసుకుని వచ్చి రేఖని తీసుకు వెళ్ళిపోవాలని అతని ఉద్దేశ్యం.

మేజర్‌రావుకి అమితమైన ప్రోత్సాహం యిచ్చి రేఖంటే పడిచచ్చేలా తయారు చేసింది అమ్మమ్మ. త్వరలోనే పెళ్ళిచేసుకుంటాను. మళ్ళీ నాకు ట్రాన్స్‌ఫర్ వచ్చేలా ఉంది. అని తొందరపడ్డాడు రావు. అమ్మమ్మకి కావలసింది అదే. ఆమె సింపుల్‌గానూ హుందాగాను రేఖ పెళ్ళిచేయాలని నిర్ణయించి అన్నీ సిద్ధం చేస్తుంది.

మటి బొమ్మలాగా అన్నీ చూస్తూ ఊరుకున్నరేఖ ఒకరోజు అతి ఉత్సాహంగా తయారైంది. అమ్మమ్మతో సరదాగా కబుర్లుచెప్పి రాత్రి పడుకుందుకు వెళ్ళింది. అమ్మమ్మ కూడా చాలా సంతోషించింది—రేఖ మనస్సు మార్చుకున్నందుకు. కాని రేఖ లోతు గుండెలోకి మూర్ఖత్వం మూర్తీభవించిన అమ్మమ్మ ఎలాగ చూడగలదు?

రాత్రి తృప్తిగా పడుకుందుకు వెళ్ళిన రేఖ ఉదయం లేవనే లేదు. సాధారణంగా తొమ్మిది గంటలదాకా పడుకొంటుందని ఎవరూ లేపలేదు.

కాని కింద భాస్కర్ వచ్చాడు. అమ్మమ్మతో తీవ్రంగా వాదిస్తున్నాడు. ఈ హడావిడి చూసి అందెమ్మకి తోచింది రేఖమ్మని లేపి తీసుకురావాలని. ఆదరా బాదరాగా రేఖ పడక గదిలోకి వెళ్ళింది. ప్రశాంతంగా ఒత్తిగిలి పడుకుని వుంది రేఖ. 'అమ్మాయిగారూ, ఆ బాబుగారు వచ్చారు' అంటూ రహస్యంగా లేపింది. కాని రేఖ కదలలేదు. మళ్ళీ పిలిచింది అందెమ్మ. తట్టి లేపింది. చల్లగా తగిలింది రేఖ చేయి. 'అమ్మాయిగారూ... అమ్మగారూ' అంటూ గట్టిగా కేకలు పెడుతూ హాల్లోకి వచ్చిపడింది.

'ఏమైంది?' గట్టిగా కసిరింది అమ్మమ్మ.

'అంతా అయిపోయిందమ్మా, రేఖమ్మ ప్రాణాలు తీసుకున్నట్టుంది' అంటూ ఏడ్చేసింది అందెమ్మ.

అమ్మమ్మ మేడమీద గదిలోకి నడిచారు. భాస్కర్ మారు మాట్లాడకుండా వెళ్ళిపోయాడు.

భయంకరమైన నిశ్శబ్దం తాండవించింది ఆ యింట్లో.

ఆ సాయంత్రమే ఆ నిశ్శబ్దం ప్రతిధ్వనించింది. కాప్టన్ భాస్కర్ కణతపై కాల్చుకుని చచ్చి తన యింట్లో పడివున్నాడన్న వార్త చూసి...రాధ మూగవోయింది. ఆ క్షణం రాధతో పాటు ప్రకృతి అంతా మూగవోయింది. ●




ఆ జలుబును అరికట్టండి!

అమృతాంజన్ ఇన్‌హేలర్




నిరపాయముగా, త్వరగా ముక్కుపడిశమును పోగొట్టును. తలశీతలమును నివారించును. తుమ్ములను నిలుపును. చేతసంచు కోడానికి అనువైనది. సులభంగా వాడవచ్చు, తక్కువ ఖరీదు ఎల్లప్పుడు మీ వద్ద ఉంచుకోండి.

తయారుచేయువారు
అమృతాంజన్ లిమిటెడ్, మద్రాసు-4.

# కుక్కకాటు - మీరు తీసుకోవలసిన జాగ్రత్తలు

కరచిన కుక్క మామూలు కుక్కే. అయితే, (అంటే పిచ్చికుక్క కాదని నా అభిప్రాయము) ఏ జాతికి సంబంధించిన కుక్క అయినాసరే రోగిని వెంటనే డాక్టర్ వద్దకు తీసుకు వెడితే, గాయమునకు అవసరమైతే కట్టు కట్టి, ధనుర్వాతము రాకుండా, గాయము చీము పట్టకుండా తగిన చికిత్స చేసి పంపిస్తాడు.

ఆ కుక్క పిచ్చికుక్కా, మంచి కుక్కా మనకు ఎట్లా తెలుస్తుంది? అసలు కుక్కకు పిచ్చి ఎక్కటం అంటే ఏమిటి? కరచిన కుక్క పిచ్చి కుక్కే అయితే మనము చెయ్యాల్సింది ఏమిటి? ఆ విషయాలు తెల్సుకుందాము.

పిచ్చికుక్క అయితే కుక్క నడవడిలోను, మొరగటంలోను ముందు మార్పు వస్తుంది. కుక్క అట్లా మొరుగుతోంది ఏమిటి అనిపిస్తుందన్నమాట. చీకట్లో ఉండటానికే ఎక్కువ ప్రయత్నిస్తుంది. తర్వాత చురుకు ఎక్కువ అయి (excite) విశ్రాంతి లేకుండా ఉంటుంది. అక్కడ నుండి కన్పించిన వస్తువునల్లా, జంతువుల్ని, మనుషుల్ని కరచుకుంటూ పోతూ ఉంటుంది. సొల్లు ఎక్కువగా కారుతూ ఉంటుంది. అట్లా 30 కిలోమీటర్లవరకు పరుగిడుతూ పోతూ ఉంటుంది. తర్వాత ఆ కుక్క వెనుకకాళ్లకు ముందుగా పక్షవాతం వచ్చి శరీరమంతా వ్యాపిస్తుంది. కుక్క నడవడిలో మార్పు వచ్చిన తర్వాత వారం రోజులకంటె ఎక్కువ బ్రతుకదు.

ఈ వ్యాధి ఒక రకమయిన వైరస్ అనే క్రిమివల్ల వస్తుంది. ఈ క్రిమి గాయముగుండా మెదడులోకి, మెదడును బట్టి అన్ని నరాల్లోకి ప్రవేశిస్తుంది. కనుక పిచ్చికుక్క ఒక మనిషినిగాని మరియొక జంతువునుగాని కరచినపుడు ఉమ్మిలోఉండే క్రిములు కరచిన పుండు ద్వారా రెండవజంతువు నరాల్లోకి, ఉమ్మిగ్రంధుల్లోకి ప్రవేశిస్తాయి. పిచ్చికుక్క కరచిన మరోకుక్కకు ఈ వ్యాధి 10 రోజులనుండి 90 రోజులలోగా వస్తుంది. గుర్రాన్ని కరిస్తే గుర్రానికి 4 వారముల నుండి 8 వారములలోగా ఈ వ్యాధి వస్తుంది మనిషిని కరిస్తే మనిషికి మామూలుగా 6 వారాల్లో వస్తుంది ఒక్కొక్కసారి సంవత్సరము లేదా 1½ సంవత్సరములుకూడా పట్టవచ్చును. కరచిన 12 రోజుల లోపులో మాత్రము ఈ వ్యాధి మనిషికి రానేరాదు. దీనినే ఇన్కుబేషను పీరియడ్ అంటారు. ఇది మన చికిత్సకు ఎంతో ఉపయోగపడుతుంది.

పిచ్చికుక్క కరచినవారికి అనేకచోట్ల అనేకమంది నాటు వైద్యులు మందు ఇస్తూఉంటారు. ఉదాహరణకు శివపురం, కోరుకొల్లు, నిడదవోలు, గుడివాడ, నూజివీడులలో ఈ మందు ఇస్తూ ఉంటారు. ఈ నాటు వైద్యులంతా ఏదో ఒక నాటు మందుఇచ్చి కొబ్బరికాయ వాడకూడదని, జున్ను తినకూడదని, ఉలవలు చూడకూడదని, పొయ్యిదగ్గరకు వెళ్లకూడదని పేరుశనగ ముట్టకూడదని అనేక రకాలైన విపరీతమైన పత్యాలు చెబుతూ ఉంటారు. కరచినకుక్క పిచ్చికుక్కే అయితే ఈ మందు వాడినవారు నూటికి నూరుమంది చనిపోవటం ఖాయం. రోగి చనిపోయినపుడు బంధువులంతా పాపం ఏదో అపత్యం చేసాడు అని కన్నీరు కారుస్తారు ఈ నాటు మందు వాడినతర్వాత రోగి బ్రతికే ఉంటే అది పిచ్చికుక్క కాదన్న విషయం నిస్సందేహంగా ఒప్పుకోవాలి.

మన ప్రభుత్వము వారు ఈ నాటు వైద్యుల విషయంలో తగినచర్య తీసుకోకపోవటం బహు శోచనీయం. కరచిన కుక్క మళ్లా మనకు కన్పించకపోయినా, పదిరోజుల లోగా మరి ఏ ఇతర కారణాలవల్ల చచ్చిపోయినా దాన్ని పిచ్చికుక్కక్రిందే జమకట్టి మనం వైద్యం చేయించుకోవటం చాలా అవసరం.

పిచ్చికుక్క కరచినవారికి వ్యాధి రాకుండా ఇంజక్షనులు చేయించుకుంటే ఆ మనిషిని పూర్తిగా కాపాడగల్గుతాము. ఆ ఇంజక్షనులు ఎన్ని చెయ్యాలి అనే విషయం డాక్టర్ నిర్ణయిస్తాడు. ప్రపంచమంతా అవే ఇంజక్షనులు వాడతారు. ఆ ఇంజక్షనులు గవర్నమెంటు ఆస్పత్రులలోను, జిల్లా పరిషత్ ఆస్పత్రులలోను, మునిసిపల్ ఆస్పత్రులలోను, శాస్త్రయుక్తంగా వైద్యం చేసే అందరి అల్లోపతీ డాక్టర్లవద్ద అందుబాటులో ఉంటాయి.

ఆ ఇంజక్షనుమందు కనిపెట్టిన వారి పేరు పేశ్చర్. ముఖ్యమైన విషయమేమంటే ఆ ఇంజక్షనులవల్ల వ్యాధి రాకుండా సుమారు పూర్తిగా అందరిని కాపాడవచ్చును. ఇంజక్షనులు చేయించుకొనే రోజులలో విశ్రాంతి తీసుకోవటం మినహా ఆహారములో పత్యం ఏమీ అక్కరలేదు. వ్యాధి వచ్చిందంటే ప్రపంచంలో ఎక్కడా, ఎంత ఖర్చుపెట్టినా ఇంతవరకు మందు లేదు. ఇంతవరకు ఇంత మంచి ఇంజక్షనులు కనిపెట్టబడలేదని చెప్పాలి. ఇంజక్షనులు చేయించుకోకపోతే పిచ్చికుక్క



# పద్మభూషణ ప్రొఫెసర్ టి. ఆర్. శేషాద్రి

ఫెలో ఆఫ్ ది రాయల్ సొసైటీ ఆఫ్ లండన్ (ఎఫ్. ఆర్. ఎస్.) గా ఎన్నికైన భారత శాస్త్రవేత్త ప్రొ. టి. ఆర్. శేషాద్రి, ప్రకృతిలో దొరికే పదార్థాల రసాయన నిర్మాణాన్ని గురించిన పరిశోధనలలో ప్రపంచ కీర్తి సంపాయించారు. ముఖ్యంగా పువ్వులలో రంగుల్ని కలిగించే ఫ్లావనాయిడ్స్ అనేవి ఆయన్ని ఎక్కువగా ఆకర్షించాయి. చాలా కాలం ఆంధ్ర యూనివర్సిటీలోను, 1949 నుంచి ఢిల్లీ యూనివర్సిటీలోను కెమిస్ట్రీ డిపార్ట్‌మెంట్ హెడ్‌గా పని చేసి, 1965 రిటైరయ్యారు. అయినా ఢిల్లీలో ఎమెరిటస్ ప్రొఫెసర్‌గా వుంటూ ఇంకా తమ పరిశోధనలు కొనసాగిస్తూనే వున్నారు. విద్య, వైజ్ఞానిక, పారిశ్రామిక రంగాల్లో గొప్ప సేవ చేస్తూ, మన దేశానికి విదేశాల్లో పేరు తెచ్చిన ప్రొ. శేషాద్రి జీవిత విశేషాలేమిటి?

జననం 1900 లో. విద్యాభ్యాసం మద్రాసు యూనివర్సిటీలో జరిగింది. 1923—27 లో మద్రాసులో ఈయన చేసిన రిసర్చికి రెండు బహుమానాలు వచ్చాయి. 1927 లో ఇంగ్లండు వెళ్ళి సర్ రాబర్ట్ రాబిన్‌సన్ (ఆర్డర్ ఆఫ్ మెరిట్, నోబుల్ బహుమతి గెలుచుకున్న శాస్త్రవేత్త) తో కలిసి మాంచెస్టర్, లండన్ యూనివర్సిటీలలో రిసర్చి చేసి పి. హెచ్. డి. సంపాయించారు. కొంత కాలం ఎడింబరో యూనివర్సిటీలో ప్రొ. జి. బార్గర్, ఎఫ్. ఆర్. ఎస్. తోను, ఆస్ట్రియాలో గ్రాజ్ యూనివర్సిటీలో ప్రొ. ఎఫ్. ప్రెగ్ల్ (ఈయనకు నోబుల్ ప్రైజు వచ్చింది.) తోను పని చేసారు. 1933 లో ఆంధ్ర యూనివర్సిటీలో చేరి, 1938 నుంచి 1948 వరకు అక్కడే కెమిస్ట్రీ ప్రొఫెసర్‌గా వున్నారు. ఆ టైములో వారి దగ్గిర అనేకమంది విద్యార్థులు తర్ఫీదయ్యారు. ముమ్మరంగా పరిశోధనలు జరిపించారు. దాంతోటి ఆయన పేరు నాలుగు మూలల వ్యాపించింది. 1949లో ఢిల్లీ యూనివర్సిటీలో కెమిస్ట్రీ ప్రొఫెసర్‌గా రావలసిందని ఆహ్వానం వచ్చింది.



ప్రొఫెసర్ టి. ఆర్. శేషాద్రి

ఆంధ్ర, ఢిల్లీ యూనివర్సిటీల్లో మొత్తం నూరు మందికిపైనే ప్రొ. శేషాద్రి దగ్గిర పి. హెచ్. డి. తీసుకున్నారు. వారిలో చాలా మంది యిప్పుడు ప్రొఫెసర్లుగాను, రిసర్చి ఇన్‌స్టిట్యూట్‌ల డైరక్టర్లుగాను ఉన్నారు. అంతేకాకుండా ప్రొ. శేషాద్రి పరిశోధనలు పరిశ్రమల్లో గూడ బాగా ఉపయోగించాయి. ఆయన ప్రచురించిన రిసర్చి పేపర్లు 750 కి పైనే వుంటాయి.

ఇంత కృషి చేసిన ప్రొ. శేషాద్రికి లెక్కలేనన్ని గౌరవాలు దక్కాయంటే ఆశ్చర్యం ఏముంది?

1966 లో ఇండియన్ సైన్స్ కాంగ్రెస్ ప్రెసిడెంట్ అయ్యారు. అంతకుముందే ఇండియన్ కెమికల్ సొసైటీ, యింక ఎన్నో వైజ్ఞానిక సంఘాలకి అధ్యక్షత వహించారు. ఇప్పుడు నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్స్ ఆఫ్ ఇండియాకు అధ్యక్షులుగా వుంటున్నారు. జర్మన్ అకాడమీ ఆఫ్ నాచురల్ సైన్స్‌లో గౌరవ సభ్యులు. ఆంధ్ర, బెనారస్ యూనివర్సిటీలు గౌరవ డాక్టరేటు డిగ్రీలు యిచ్చాయి. ఉస్మానియా యూనివర్సిటీలో విజిటింగ్ ప్రొఫెసర్ భట్నాగర్ అవార్డుని కూడా పొందారు.

విదేశ ప్రభుత్వాలు ప్రొ. శేషాద్రిని తమ దేశాలు సందర్శించమని ఆహ్వానించాయి. అమెరికా, యునైటెడ్ కింగ్‌డం, యూరప్, ఆస్ట్రేలియా, ఆసియా దేశాల్లో ఎన్నో విశ్వ విద్యాలయాల్లో ఉపన్యాసాలిచ్చారు. జూరిచ్‌లో జరిగిన ఇంటర్నేషనల్ కాంగ్రెస్ ఆఫ్ కెమిస్ట్రీలో ప్రసంగించారు. అంతర్జాతీయ సమావేశాల్లో చాలాసార్లు అధ్యక్షత వహించారు.

ప్రొ. శేషాద్రి, విద్య, వ్యవసాయ, ఆరోగ్య, మంత్రిత్వ శాఖలు, యూనివర్సిటీ గ్రాంట్స్ కమీషన్, ఎటామిక్ ఎనర్జీ కమీషన్, యునెస్కో, సి. యస్. ఐ., ఆర్. ఐ. సి. ఆర్., ఐ. సి. యం. ఆర్. వంటి అనేక సంస్థల కలాపాలలో ప్రముఖపాత్ర వహించారు. యూనియన్ కాబినెట్ వైజ్ఞానిక సలహా సంఘంలో సభ్యులు. 1960 లో రాయల్ సొసైటీ సభ్యత్వం, 1963 లో పద్మభూషణ బిరుదు వచ్చాయి.

రిటైరు అయినప్పటినుంచి, దేశానికి ప్రభుత్వానికి సేవ చెయ్యడానికి యిదివరకటి కంటే గూడా ఎక్కువ టైము కనబడుతోందిట ప్రొ. శేషాద్రికి!

—డా॥ ఆర్.ఎల్.ఎన్. శాస్త్రి

రోజులనుండి 1½ సంవత్సరాల లోపులో మనిషికి ఈ వ్యాధి వస్తుంది. వ్యాధి ప్రవేశించిన వెంటనే ముందుగా గొంతుక మింగేటప్పుడు కష్టంగా ఉంటుంది. గ్లాసు లో నీళ్ళుపోసి నోటిదగ్గరకు పట్టుకునస్తే గొంతుక అసలు మింగనివ్వదు. కనుకనే దీనిని నీటిభయం వ్యాధి హైడ్రోఫోబియా అంటారు. రోగి గాలి వీస్తుంటే ఉండలేడు. తర్వాత 3 లేక 4 రోజులకంటె ఎక్కువ బ్రతుకడు. చనిపోయేవరకు మనస్సు నిర్మలంగా ఉండి తెలివిగా మాట్లాడతాడు. ఈ వ్యాధి వచ్చిందంటే ఎన్నిమందులు వాడినా నిరుపయోగము.

ఈ వ్యాధి ప్రపంచమంతటా ఉంది. ఇంగ్లాండు, అమెరికా, రష్యా, జర్మనీలలో ఈ వ్యాధిలేకుండా ఆయా ప్రభుత్వాలు తగిన కట్టుదిట్టాలు చేసాయి. మన ప్రభుత్వంకూడా తగిన శ్రద్ధ వహిస్తే ఈ వ్యాధి మనదేశంలోకూడా లేకుండా చేసుకోవచ్చును.

ఈ వ్యాధికి ముఖ్య కారణం కుక్కలు కాబట్టి పై దేశాల్నుంచి వచ్చిన కుక్కలను నిర్బంధంగా 6 మాసాలు వేరే ఉంచాలి. వీధికుక్కల నన్నింటిని అంతం చెయ్యాలి. స్వంత కుక్కల కు లైసెన్సులు ఇచ్చి లైసెన్సులులేని కుక్కల యజమానులకు ఎక్కువ పన్ను విధించాలి.

కుక్కకాటు విషయంలో ఏ ఇతర అనుమానాలున్నా పేశ్చర్ ఇన్‌స్టిట్యూట్ కూనూరు, వారికి వ్రాస్తే వారు సమాధానం వ్రాస్తారు.

"శుభ"

# సుజాత

ఉన్నవ విజయలక్ష్మి

### జ రి గి న క థ

సుజాత టీచరుగా పని చేస్తూ మానేసి టైపు నేర్చుకున్నది. అన్నపూర్ణా ఇంజనీరింగు వర్క్సులో టైపిస్టుగా చేరింది. ఆ కంపెనీ అధిపతి నీలకంఠం. అతని కొడుకు శ్రీధర్. శ్రీధర్‌ని ఎక్కడో చూసి నట్టు అనిపిస్తుంది సుజాతకి. సూర్యం సుజాతకి మేనబావ. ఆమెని వెతుక్కుంటూ వస్తాడు. వాళ్లిద్దరికీ పెళ్లి చెయ్యాలని తలిదండ్రులు చిన్నప్పుడే అనుకున్నారు. సూర్యం అందంగా వుండడు. చదువు కూడా అబ్బలేదు. సుజాత అతన్ని తప్పించుకు తిరుగుతూ వుంటుంది. మొదట్లో ఏదో అనుకున్నా, తర్వాత్తర్వాత సుజాతని సూర్యానికివ్వాలనే ఆలోచనని విరమించుకున్నారు ఆమె తల్లిదండ్రులు. ఈ ఆలోచన ఆమె చదువుకు ఆసరా అయింది. నీలకంఠం స్వశక్తి మీద పైకి వచ్చిన మనిషి.

## 6

స్వంత తమ్ముడితోనే అంత ఖచ్చితంగా వ్యవహరించిన భర్త తనవాళ్ల విషయంలో అదే ధోరణి వ్యక్తం చెయ్యటం ఆమెకి ఆశ్చర్యం కలిగించలేదు కాని భోగభాగ్యాలతో తులతూగుతున్న చెల్లెలు తమకి సహాయం చేసి తన స్థితిగతులని కొంత మెరుగు పరచలేక పోయింది, అని వాళ్లు బాధ పడుతూంటే ఆమెకీ కష్టంగానే వుండేది. అక్కడికీ భార్యమాట కాదనలేక అంతో ఇంతో సహాయం చేస్తూనే వుండేవారు కాని వాళ్లకి తృప్తి వుండేదికాదు. తాము కూడ బావగారంతటి వాళ్లు అయిపోవాలని ఆకాంక్ష. అందుకు తమ ప్రయత్నం మీదకంటె బావగారి సహాయంమీదే ఎక్కువ ఆశపెట్టుకు కూర్చునేవారు.

'ఏ వాళ్ళయినా, నా వాళ్ళయినా దూరపు బంధువులైనా ఎవరైనా కాని వాళ్లు అడిగినవెంటనే మనం సహాయం చేస్తున్నంత కాలం మంచివాళ్లం అవుతాం. ఏనాడు లేదంటే ఆనాడే విరోధులమవుతాం. గతంలో చేసిందంతా కూడ తుడిచి పెట్టుకు పోతుంది.' అనేవాడు నీలకంఠం భార్యతో.

ఒకసారి అన్నపూర్ణమ్మ అన్న లిద్దరూ కార్యార్థులై చెల్లెల్ని చూడవచ్చారు. 'మన అదృష్టంవల్ల ఒక లాభసాటి వ్యాపారానికి అవకాశం వచ్చింది — ఇవాళ పదివేలు మదుపు పెడితే ఏడాది తిరిగేసరికి పదిహేనువేలు రాలతాయి. అయిదువేలు నికరలాభం వుంటుంది — ఒక్క రెండు మూడేళ్లలో మీ డబ్బు మీకు తీర్చేస్తాం —బావగారితో చెప్పి ఎలాగయినా ఈ సహాయం చెయ్యాలి. తప్పదు' అన్నారు బ్రతిమాలుతూనే ఒలవంత పెడుతున్న ధోరణిలో.

వాళ్ల మాటలలో పొరపాటుకాని అక్రమంగాని ఏమీ కనిపించలేదు ఆమెకి. అందుకే భర్తని ప్రాధేయపడింది.

'నీకు తెలియదు పూర్ణా — అయిన వాళ్లతో డబ్బు లావాదేవీలు పెట్టుకో కూడదు—వాళ్ల అదృష్టం బాగుండి అనుకున్నట్లు జరిగి డబ్బు తీర్చగలిగితే సరే సరి. లేక ఇంకోలా జరిగితే మనం చూస్తూ చూస్తూ అడగలేం. అడిగినా నిష్ఠూర్యం కొనితెచ్చుకోటం తప్ప మరేం ప్రయోజనం వుండదు — మనం ఇప్పుడిప్పుడే తల ఎత్తుకుంటున్నాం— పదివేలు పోతే పోయాయి అనుకునే స్థితిలో లేము —అయినా అంతవూరిలో వాళ్లకి అప్పు ఇచ్చే మనిషే దొరకడా ఏమిటి. అక్కడే ఏదో చూసుకోమను. మరి నన్ను మొహమ్మాట పెట్టకు' అనేశాడు నిష్కర్షగా.

చెల్లెలు చెప్పింది విని కోపగించుకుని వెళ్లిపోయిన ఆ అన్నలు పోనీ మనకి ప్రాప్తంలేదు అని వూరుకోకుండా, బావగారిమీద పోటీతో, నువ్వు ఇవ్వకపోయినా మేం బాగుపడగలం అని అతనికి చూపించటానికి, ఉన్న కాస్తపొలం ఇల్లు తాకట్టు పెట్టి పదివేలు అప్పుతెచ్చి వ్యాపారంలో పెట్టారు—ఒక సంవత్సరం బాగానే లాభం వచ్చింది — మళ్లీ సంవత్సరం మరింత ఉత్సాహంతో అసలూ లాభం రెండూకలిపి మరుపుపెట్టారు—ఆ సంవత్సరం మొదటిలా లాభం రాకపోయినా నష్టం రాలేదు. దాంతో చేతులు దులుపుకుంటే తీరిపోయేది. కాని ఈ సంవత్సరం తప్పకుండా లాభాలు వస్తాయి అంటూ మళ్లీ రంగంలో దిగారు. పూర్తిగా నష్టపోయారు. మూడేళ్లయినా ఒక్కపైసా అయినా తీర్చకపోవటంతో అసలుకీ వడ్డీకలిపి ఆస్తిమీద జప్తు తీసుకువచ్చాడు డబ్బు ఇచ్చిన మనిషి. కొంచెం వ్యవధి ఇస్తే ఎలాగో తీర్చుకుంటాం అని బ్రతిమాలుకున్నారు వాళ్లు.

'నీలకంఠంగారు హామీవుంటే నాకేం అభ్యంతరంలేదు' అన్నాడతను.

తల్లివచ్చి పరిస్థితులన్నీ అన్నపూర్ణతోచెప్పుకుని కళ్లనీళ్లు పెట్టుకుంది— అన్నపూర్ణమ్మ భర్తని బ్రతిమాలుకుంది— ఆయన మొదట చెప్పినదానికంటే ఒక్క అంగుళంకూడ దిగిరాలేదు—

ఉన్నదంతా పోగొట్టుకొని కేవలం రెక్కలమీదే ఆధారపడవల్సిన వాళ్ళయి

యూరు వాళ్ళు. ఆకోపంతో బంధుత్వం కూడ క్రమంగా దూరం అయిపోసాగింది.

'ఉన్నదంతా అందరికీ వూడ్చిపెట్టి నేనుకూడ వాళ్ళలా అప్పులపాలయిపోతే అప్పుడు వాళ్ళకళ్ళు చల్లగావుంటాయి—అందుకు నేను తయారుగా లేకపోవటం తప్పు క్రింద జమ అయితే అది ఒప్పుకోటానికి నాకేం అభ్యంతరం లేదు—నేను స్వార్థపరుడినే—తనకిమాలిన ధర్మం నావల్ల కాదు' అనే భర్తమాటలు వింటూంటే అతను చెప్పింది సబబుగానే వుందనిపించేది ఆమెకి.

'మా బావ రెండుచేతులా గడిస్తున్నాడని చెప్పుకుని మురిసిపోవటమేకాని అవసరానికి ఆదుకునే ఆశమాత్రం ఆవగింజంత కూడలేదు—తుమ్మచెట్టు నీడలాంటివాడు మీ ఆయన.' అని అన్నగార్లు నిష్ఠూరం వేస్తుంటే వాళ్ళమాటలలోనూ న్యాయం వుందనిపించేది.

ఇటు కట్టుకు భర్త, అటు రక్తం పంచుకుని పుట్టిన అన్నగార్లు—ఎవరికీ చెప్పలేక, ఎవరినీ నిందించలేక అడకత్తెరలో పోకలా ఆమె ఎలా విలవిల్లాడిపోయేదో ఆభగవంతుడికి ఒక్కడికే తెలుసు.

భార్య అంటే ఎంత అభిమానం వున్నా, లాభాలు నష్టాలు ఈ గొడవలోనే పడికొట్టుకుంటూండే నీలకంఠరంగారికి ఆమె సున్నితమైన ఆంతర్యాన్ని అర్థంచేసుకోటం అసలు సాధ్యమేకాలేదు—

రోజు రోజుకీ వారిసంపద పెరిగింది—ఆయన ఓ ఫ్యాక్టరీకి యజమాని అయ్యాడు.

ఇంటి ఖర్చుకి వందలకి వందలు ఆమె చేతిలో పొయ్యటమేకాకుండా ఆమె పేరున తీసుకున్న షేర్లమీద వచ్చిన లాభాలు, ఆమె పేరునకొన్న ఇంటిమీదవచ్చిన అద్దె తీసుకొచ్చి సంబరంగా ఆమెకే ఇచ్చేవాడు 'నీ ఇష్టం వచ్చినట్లు చేసుకో' అంటూ.

పుష్కలంగా డబ్బు వచ్చి చేతిలో పడుతోంది. తినటానికి ఏ పది వున్నారు—ఉన్న ఒక్కడికీ కావలసింది ఆ భగవంతుడే ఇచ్చేడు — ఇక తను సంతోషంగా ఇచ్చింది అందుకోవలసిన వాళ్ళంతా దూరం అయిపోయారు — తల్లికి, బిడ్డకి అన్నకి తమ్ముడికి — అందరితో విరోధం తెప్పించిన ఈ డబ్బు ఏం చేసుకోను అనిపించినా క్రమంగా తనవాళ్ళు పరాయివాళ్ళు అనే భేదం విస్మరించి; అడిగిన వాళ్ళందరికీ ఇంతో అంతో సహాయం చెయ్యటం నేర్చుకుంది — సంఘ సేవకురాలిగా సభల్లో, సమావేశాల్లో పాల్గొనక పోయినా ఎన్నో సేవా సంస్థలకి సహాయం చేస్తూండేది. జీవితంలో అన్నీ పోగొట్టుకుని సమాజంలో గౌరవంగా బ్రతికే అర్హత పోగొట్టుకున్న నిర్భాగ్యులైన స్త్రీలపట్ల కూడ ఆమెకి దయ సానుభూతి వుండేవి—

భార్య చేస్తున్న ఈ దానధర్మాలన్నీ ఒక్కోసారి మనస్ఫూర్తిగానూ ఒక్కోసారి రవంత అయిష్టంగానూ ఆమోదించేవారు నీలకంఠరంగారు — ఒక అంతస్తుకి చేరుకుని పదిమందిలో పేరు ప్రతిష్ఠ సంపాదించుకున్న ఆయనకి అలాంటి ఖర్చులు అనివార్యమే అనిపించేది అప్పుడప్పుడు. అన్నపూర్ణమ్మ బ్రతిమాలి, భంగపడి చివరికి ఆయనచేత అంగీకరింపజేసిన సందర్భాలూవున్నాయి. ఆయనచేత 'ఊ' అనిపించలేక నిరాశ పడిపోయి నిట్టూర్చిన సందర్భాలూ వున్నాయి. పదిమంది ఎదుట ఏ సందర్భంలోనూ ఆమె మొహంలో శాంతి పెదవులమీద చిరునవ్వు చెదరకుండా విగ్ర



హించుకుంటూ రావటంవల్ల ఆమె అంతరంగిక జీవితం చాలామందికి తెలియదు.

*　　　*　　　*

'రేపూ, ఎల్లుండీ శలవు తీసుకుంటు న్నా నమ్మా' అన్నారు సీతాపతిగారు.

'అలాగా' అంది సుజాత.

ఆమె ఎలాంటి కుతూహలం కనబరచక పోయినా ఆయనే చనువుగా మొదలు పెట్టాడు.

'మనవడు పుట్టాడుగా—ఉన్నంతలోనే అన్ని ముచ్చట్లూ తీర్చాలి మరి— ఇదుగో ఇంత పొడుగు లిస్టు వ్రాసిచ్చింది మా ఆవిడ—కొన్ని ఈ సాయంకాలమే కొనాలి. కొన్ని రేపు సాయంకాలంలోగా ఏర్పాటు చెయ్యాలి. రేపు ఉదయం స్టేషనుకి వెళ్ళి అల్లుణ్ణి వాళ్ళని దింపుకుని దగ్గరుండి ఇంటికి తీసుకు రావాలి — ఒకటా, లక్ష పనులు—కలిగిన మహారాజులకయితే ఏ బాధా వుండదనుకో — నాలాంటి వాళ్ళకి అన్నీ సమస్యలే.' ఉహూ కుటుంబీకుడయిన మధ్యతరగతి గృహస్థు ఈ తిబాధలన్నీ ఆయన ఏకరువు పెడుతూంటే మౌనంగా వింటూ నిలబడింది సుజాత.

'ఎల్లుండి ఉదయం హడావిడి అంతా అయిపోతుం దనుకో — సాయంకాలం మన ఆఫీసువాళ్ళందర్నీ పిలిచి చిన్న టీ పార్టీ ఏర్పాటు చేద్దామనుకున్నాను—ఏదీ వాళ్ళ బోలెడంతమంది రావటంతో అన్నింటికీ కూగలేం, మరోసారి చూద్దాంలెండి అంది

# సుజాత

మా ఆవిడ —' 'మనవడు పుట్టాడని చెప్పారు, మా నోళ్ళు కాస్త తియ్యబరి చారు కాదు' అని వాళ్ళంతా అనుకునిపోతారేమో నన్న ఉద్దేశ్యంతో ఆయన అలా సంజాయిషీ ఇస్తున్న ధోరణిలో మాట్లాడుతూంటే సుజాతకి ఓ ప్రక్క జాలి మరో ప్రక్క నవ్వుకూడా ముంచుకు వచ్చాయి. కాని ఆభావాలేమీ పైకి కనపడనీయకుండా

'అబ్బె ఇప్పుడవన్నీ ఎందుకండీ—వచ్చిన బంధువుల్ని ముందు మర్యాదచేసి పంపించాలిగా' అంది ఎంతో అనుభవజ్ఞురాలిలా.

'అదే. అదే మేమూ అనుకున్నాం' అని వెళ్ళిపోయాడాయన.

'ఇవాళ, రేపు సీతాపతిగారు రారన్న మాట.' మర్నాడు ఆఫీసుకి వస్తూనే అనుకుంది సుజాత.

'అయితే ఈ రెండు రోజులూ లెటర్సు డిక్టేట్‌చేసేవని బాస్‌దే' అనుకుంటూ, కూడా తెచ్చుకున్న నవల తెరిచింది పిలుపు వచ్చేదాకా వూరికే కుర్చోటం ఎందుకని—

శ్రీధర్ చెప్పటం అయిపోయాక ఆమె నచ్చేసేయబోతూంటే, 'నేను మిమ్మల్ని చూశాను నిన్న' అన్నాడతను హఠాత్తుగా.

తెల్లబోయింది సుజాత.

'అంటే అదే—బేగంపేట రోడ్డుమీద అవాళ ఏక్సిడెంటు కాబోయిందే ఆచుటు వల్లే—మీ ఇల్లు అటువేపా' అన్నాడతను కుతూహలంగా.

'కాదండి — అక్కడో ఫ్రెండుంది, చూడటానికి వెళ్తుంటాను' తడపడుతూ సమాధానం చెప్పింది. ఆమె ఖంగారు చూస్తూంటే నవ్వొచ్చింది అతనికి.

'ఎవరా ఫ్రెండు?' అన్నాడు చిన్నగా నవ్వుతూనే.

'మీ కెందుకా అనవసరపు గొడవ అన్నట్లు' ఒకసారి మొహం చిట్లించుకుని మళ్ళీ అంతలోనే సర్దుకుని ఏదో చెప్ప బోతుంటే

'మీకు విసుగొస్తున్నట్లుంది ఆవిడ్ని గురించి అడుగుతూంటే—పోనీ మిమ్మల్ని గురించి చెప్పండి, మీకు ఇక్కడ పని ఎలా వుంది' అన్నాడు.

తలవంచుకుని కూర్చున్న సుజాత పెన్ను కేప్ ఇటూ అటూ కదిలిస్తూ 'పనికేం, చాలాసరదాగా వుంటోంది—సీతాపతిగారు నన్ను తండ్రిలాగే చూసుకుంటు న్నారు—మిగతా స్టాఫ్ అంతాకూడా మంచి వాళ్ళు మర్యాదస్థులు' గబగబ అనేసి, ఆతరువాత అనవసరంగా చాలా వాగేశాను అనుకుంది.

'స్టాఫ్‌అంతా మంచివాళ్ళని సర్టిఫికేట్ ఇచ్చేశారు. మరి బాస్ ఎలాంటివాడో చెప్పారు కాదు' పెంకిగా అడిగాడు.

ఉలిక్కి పడినట్లయి అప్రయత్నంగానే కళ్ళు కొంచెం ఎత్తిచూసింది. అతని కళ్ళలోను పెదవులచివరా చిత్రమైన చిరునవ్వు మెరుస్తోంది—అతను కేవలం తన అభిప్రాయం తెలుసుకోటానికే అడగ లేదన్నది స్పష్టమైపోయింది— సుజాత గుండెలు దడదడలాడాయి. 'ఏమిటి సంభాషణ, ఎవరైనావింటే ఏమనుకుంటారు—అసలు ఇది ఇంకా ముదరకుండా ఎవరైనా వస్తే బాగుండును.' తనకి అక్కడనుండి త్వరగా విముక్తి కలిగించమని అర్థిస్తున్నట్లు తలుపువైపు కాలింగ్‌బెల్‌వైపు టెలిఫోన్‌వైపు చూసింది. ఏ ఒక్కటీ ఆమె మొర వినలేదు, ఒకటి రెండు క్షణాలు గడిచిపోయినా—ఆమె ఏదో అన బోతుంటే అతనే తిరిగి అన్నాడు.

'నేనంటే మంచి ఇంప్రెషన్ లేనట్లుంటే, అది చెప్పటానికే సంకోచిస్తు న్నారు' మనస్సుని గిలిగింతలు పెట్టేశకి



అతనిమాటలలో వుందని పించింది. అవి తనమీద మత్తుమందు చల్లినట్లు పని చేయవుకదా—తనకే అర్థంకాని ఉద్వేగంతో,

'అబ్బెబ్బే అదేంలేదు —ఎలా చెప్పాలా అనే ఆలోచిస్తున్నాను. మీరు, మీ నాన్న గారు నన్ను ఎంతో దయతో చూస్తున్నారు—కేవలం నా అదృష్టం వల్లనే ఈ ఉద్యోగం దొరికిందని నేనూ మా అమ్మా ఎప్పుడూ అనుకుంటూ వుంటాం' అంది గబ గబ.

'మీ ఫాదర్ లేరుటకదూ—ఇంక అన్న దమ్ములూ, అక్కచెల్లెళ్లూ…' అంటూ ఆగిపోయారు ఆమెమొహం చూసి.

'ఎవ్వరూ లేరు … నాన్నగారి కయినా ఏమంత ముసలితనం ముంచుకురాలేదు — ఏదో ఆలోచిస్తూ పరధ్యానంగా నడుస్తున్నా యన్ని ఆంబోతు కుమ్మేసింది…' సుజాత గొంతు వణికింది — నల్లటిమేఘం ఒకటి ఆమె మొహాన్ని కప్పివేసింది.

సుజాత గొంతువిని చలించి పోయిన శ్రీధర్ తప్పుపని చేసినవాడిలా నొచ్చు కుంటూ 'ఐ యామ్ వెరీ సారీ యధా లాపంగా అడిగానేగాని మిమ్మల్నింత బాధ పెట్టవలసి వస్తుందనుకో లేదు— గతం ఇంత భయంకరంగా వుంటుందని నేను వూహించలేక పోయాను' అన్నాడు. లోకంలో వున్న సానుభూతి అంతా నింపుకున్నంత మృదువుగావుంది అతని గొంతు.

'ఫరవాలేదు లెండి—ఎవరూ అడగక పోయినా దానంతటు అదే గుర్తు వస్తూ వుంటుంది ఎప్పుడూ — ఏ జబ్బయినా చేసి ఆయన పోయివుంటే మేమింత బాధ పడేవాళ్లం కాదేమో ననిపిస్తుంది. షికారు కని బయలుదేరిన నాన్నగారు మరి తిరిగి రాలేదు—'

'ప్చ్, మీరు ఎప్పుడూ ఉదాసీనంగా నిర్లిప్తంగా వుండటం-గమనించాను — అయితే దానివెనుక ఇంతటి దుఃఖం ఉండి వుంటుందని వూహించలేక పోయాను.' అని ఒక్కక్షణం ఆగి మళ్లీ తనే మొదలు పెట్టారు.

'ఒక్క విషయం మీరు తెలుసుకోవాలి— జీవితంలో కష్ట సుఖం అనేవి రెండూ వుంటాయి. సుఖాలు కలిగినప్పుడు పొంగి పోవటం, కష్టం వచ్చినప్పుడు కృంగి పోవటం కూడ మనిషికి సహజమే—అయితే ఆ దుఃఖాన్ని ఆరని అగ్నిలా అలాగుండెలో


నొప్పిని త్వరగా తొలగించడానికి మాత్రమే 'ఆస్ప్రో' మైక్రోఫైన్డ్ కాబడినది

క్రొత్త మైక్రోఫైన్డ్ 'ఆస్ప్రో' ఈ విధంగా పనిచేస్తుంది.






బిళ్ళలోని అణువు ఎంత పెద్దదిగా వుంటే అంత నెమ్మదిగాను అది ఇముడుతుంది— అందువల్ల మీరు, నొప్పి తగ్గడానికి చాలా సేపు ఆగాలి.

ఇది మైక్రోఫైన్డ్ చెయ్యబడుట వలన, ప్రతీ, క్రొత్త మైక్రోఫైన్డ్ 'ఆస్ప్రో' బిళ్ళలోను ఇంచు మించు 15 కోట్లు అతి సూక్ష్మమైన అణువులు వుంటాయి. ఇందువలన, అది అతి త్వరగా ఇమిడి, అతి శీఘ్రంగా నివారణ నిచ్చును.

వీటి కోసం క్రొత్త మైక్రోఫైన్డ్ 'ఆస్ప్రో'ను వాడండి: నొప్పి • తల నొప్పి • ఒళ్ళు నొప్పి • ఫ్లూ • జ్వరముతో కూడిన జలుబు • కీళ్ళ నొప్పి • గొంతుక నొప్పి • వంటి పోటు.

కొత్త మైక్రోఫైన్డ్ 'ఆస్ప్రో' నొప్పిని నివారించుటకు, ఇప్పుడు మీకు లభించే వాటిలో అతి ఆధునికమైన సాధనము.






మోతాదు:
పెద్దవారికి: రెండు బిళ్ళలు. అవసరమైతే మళ్ళీ వేసుకోండి.
పిల్లలకు: ఒక బిళ్ళ. లేక డాక్టర్ సలహా ప్రకారము వేసుకొనవలెను.

కొత్త మైక్రోఫైన్డ 'ఆస్ప్రో'
అతి శీఘ్రంగా నొప్పిని తొలగించును

A.G. 22-69 TL

నికోలస్ Ⓝ తయారు

పెట్టుకున్నందువల్ల ఏమీ ప్రయోజనం లేదు—దాన్ని మరిచిపోవటానికే ప్రయత్నించాలి. మీరు సంతోషంగా వుండి మీ అమ్మగారికి కాస్త మనశ్శాంతి చేకూర్చటానికి ప్రయత్నించాలి. మీ కోసంకూడ ఆవిడ బెంగపెట్టుకునే పరిస్థితి కలిగించ కూడదు.' ఓదార్పుగా అతనన్న మాటలలో ఎంతో ఆత్మీయతా, అభిమానం ఉన్నాయనిపించింది. ఆర్ద్రత నిండుకున్న కళ్లతో అతనివంక చూస్తూ,

'నేను అలాగే అనుకుంటాను — కాని ఆ ప్రయత్నం మాత్రం కొనసాగటంలేదు' అని, చటుక్కున సర్దుకుని,

'నా గొడవతో మీ టైమంతా వేస్టయింది—వస్తాను. త్వరగా చేసేసి తీసుకొస్తాను' అంటూ లేచింది.

'తొందరేం లేదు. టేక్ యువర్ టైమ్' అన్నాడతను — ఎంతో సరదాగా మొదలుపెట్టిన సంభాషణ చివరికిలా పరిణమించటం అతని కెలాగో అనిపించింది.

* * *

'ఎక్కడికైనా వెళ్తున్నావా ?' ఆఫీసు నుండి వచ్చి కాఫీ తాగి మళ్లీ గబగబ జడ అల్లుకుంటున్న కూతుర్ని అడిగింది మీనాక్షమ్మ.

'ఊ—మా ఆఫీసు మేనేజరు సీతాపతి గారని, ఆయనకి మనవడు పుట్టాడు—మొన్న ఉయ్యాలలో పెడుతున్నాం పేరంటానికి రమ్మని చెప్పి పిలవటానికి వాళ్ల మామ్మాయి వస్తుందని కూడ చెప్పారు. ఏదో వీలు కాలేదుట ఆ అమ్మాయి రాలేదు—నేనూ వెళ్లలేదు—ఆఫీసులో ఆయనేదో చెప్పారే కాని ఇంటికి వచ్చి పిలవలేదని నేను వెళ్లటం మానుకున్నానని వాళ్లు అనుకుంటున్నారు — ఓసారి వెళ్లి వద్దామని.' మాట్లాడుతూనే జడ అల్లుకోటం ముగించి పెట్టెలోంచి మరో చీర తీసుకుంది—

గేటు దాటి నాలుగడుగులు వెయ్యగానే ఎదురు వచ్చిన ఖాళీ రిక్షాని ఆపి, తిన్నగా సీతాపతిగారి ఇంటికే మాట్లాడబోయి అంతలో మరో ఆలోచన రావడం వల్ల అబిడ్సుకి మాట్లాడి, వాడిని ఒక్క క్షణం వుండమని మళ్లీ యింటివైపు వెళ్లింది సుజాత.

# సుజాత

'ఏం. ఏమయినా మరిచిపోయావా ?' అంది మీనాక్షమ్మ తలుపు తీస్తూ.

'అబ్బే. పసిపిల్లవాడిని చూడటానికి వెళ్తూ వట్టిచేతులతో వెళ్తే ఏం బాగుంటుంది—ఏదయినా కొందామని— పర్సులో అయిదు రూపాయ లున్నాయనుకో—అయినా దగ్గరుంటే ఎందుకయినా మంచిదని.' తల్లితో చెప్తూనే పెట్టె తెరచి మరో పది రూపాయల కాగితం మడిచి బేగ్‌లో పెట్టుకుంది—జీతం అందుకుని యింకా వారం రోజులయినా కాలేదు. చేతిలో డబ్బు వుంది కనక ఏదైనా కాస్త మంచిదిగా చూసి ఇవ్వాలని ఆమె ఉద్దేశ్యం.

'నేనిందాకనే చెప్పాలనుకున్నాను. సరే—నువ్వేలాగూ కొని ఇస్తావేమోనని...' తల్లి మాటలు పూర్తి కాకుండానే వీధి గుమ్మం దిగి రిక్షా ఎక్కింది.

అబిడ్సులో రిక్షా దిగి డబ్బు లిచ్చి ముందుకి వెళ్లబోతూంటే పరిచితమైన కారు హారన్ వినిపించి ప్రక్కకు తిరిగి చూసింది. సందేహం లేదు. అది నీలకంఠంగారి కారే. శ్రీధర్ పేవ్‌మెంటు ప్రక్కగా దాన్ని పార్కు చేసి డోర్ లాక్ చేస్తున్నాడు. అతన్ని అప్పుడు పలకరించటమా మానటమా అని ఒక్క క్షణం తటపటాయించి చివరికి, చూడనట్లుగా ప్రక్క షాపువేపు వెళ్లబోయింది.

'ఏమిటిలా వచ్చారు?' శ్రీధర్ గొంతు వెనకనుండి వచ్చి అడుగు ముందుకి పడనియ్యలేదు.

వెనక్కి తిరిగి చూసి—అప్పుడే అతన్ని చూసినదానిలా 'మీరా—కొద్దిగా బజారులో పనుండి వచ్చాను.' అంది.

'ఏం కొనాలి.'

'సీతాపతిగారి మనవడ్ని చూడ్డానికి వెళ్దామని...'

'విశేషం ఏమైనా వుందా ?'

'ఆ విశేషం ఏదో మొన్ననయిపోయింది. అవాళ నేను వెళ్లలేదని ఆయనకి కాస్త కోపం వచ్చినట్లుంది. పోనీ ఇవాళ వెళ్దామని......' పేవ్‌మెంటు మీద తామిద్దరూ అలా నిలబడిపోయి మాట్లాడుకోటం బాగుండదనీ, వీలయినంత త్వరగా అతన్ని వదుల్చుకుని షాపులోకి దూరిపోవా అని గబగబా చెప్పేసింది.

'అయితే అబ్బాయికేమయినా కొనాలనా—రండి ఇక్కడ మంచిరకాలు దొరుకుతాయి' అంటూ అటుప్రక్కగావున్న షాపువేపు దారి తీశాడు.

సంశయిస్తూనే వెనకంగా అతన్ని అనుసరించింది సుజాత మరేం చెప్పాలో తెలియక—కాని ఆ షాపు పేరుచూసిన దగ్గరనుంచీ ఆమెగుండెలు బితుకు బితుకుమంటూనే ఉన్నాయి—తనెప్పుడూ ఇంతవరకూ అక్కడ కొనలేదు కాని మాటలసందర్భంలో చాలా సార్లు దాన్నిగురించి వింది—పైన పావలాకి దొరికేవస్తువు అక్కడ రూపాయి చెప్తాడనీ డబ్బువిలువ తెలియనివాళ్లూ, కష్టపడకుండా వూరికే డబ్బువచ్చి వళ్లోపడుతున్న వాళ్లు అక్కడికి వెళ్లాల్సిందే తప్ప మనలా పైసా లెక్కచూసుకుంటూ ఖర్చుపెట్టుకునే మధ్యతరగతివాళ్లు అందులో అడుగు పెట్టటం శుద్ధదండగ అని చాలామంది చెప్పారు. అది గుర్తువచ్చింది కాని ఆమాట అతనితో అనే సాహసంమాత్రం ఆమెకు లేకపోయింది—'అయినా సరుకునిబట్టే ధర వుంటుంది. మళ్లీ వెనక్కివెళ్లి మరో పదిరూపాయలు తెచ్చుకోవటం ఎంతో మంచిదయింది—ఎంత దారుణంగావున్నా పదిహేనురూపాయలకి పసిపిల్లవాడికి పనికివచ్చే బట్టలురావా—బోలెడు ఖరీదైనవిచూపిస్తే అంతపెట్ట దలుచుకోలేదని అప్పుడే స్పష్టంగా చెప్పేయొచ్చు. అతనికిమాత్రం తెలియదా ఏమిటి తాహతు?' ఆలోచించుకుంటూనే ముందుకి నడిచింది సుజాత.

టేబిలుముందు కుర్చీలో కూర్చుని, బిల్లుచూసి డబ్బు అందుకుంటున్న ఓబొజ్జ గణపతిలాంటి ఆకారం శ్రీధర్‌ని చూస్తూనే మొహంనిండా నవ్వుపులుముకుని,

'అయియే, అయియే' అంటూ ఆహ్వానించాడు. లోపలికివెళ్తూ 'ఏం కావాలి' అన్నాడు శ్రీధర్ వెనక్కి తిరిగి—

సుజాతకాపరిస్థితి అంతా ముళ్లమీద వున్నట్లుంది. తను ఒక్కతే ఏదో మామూలు షాపులోకి వెళ్లివుంటే తనకి ఎలాంటిది కావాలో ఎంతధరలో కావాలోచెప్పి చూపించమనేది. ఇప్పుడలా అడగటం బాగుంటుందా—ఎటూ తేల్చుకోలేక చివరికి,

'ఏడెనిమిదినెలల అబ్బాయికి పనికివచ్చే బాబా సూటు చూపించమనండి' అంది

మెల్లిగా.

ఇద్దరూ కౌంటరుముందు నిలబడ్డారు. సేల్సుమెన్ తను మొయ్యగలిగినంత దొంతర తెచ్చి పడేసి ఒక్కొక్క అట్టపెట్టె మూత తీసి బట్టలు చూపించటం మొదలు పెట్టాడు.

'సుజాత వాటి అందచందాలనీ బట్టల నాణ్యాన్ని పరిశీలిస్తూనే వాటిమెడ వెనక అంటించిన లేబిల్‌కోసం ఆత్రంగా చూడటం మొదలుపెట్టింది, ప్రక్కనే నిలబడిన శ్రీధర్ అది కనిపెట్టకుండా జాగ్రత్తపడుతూ చివరికి ఆమెకి నచ్చినది దొరికింది. ధర పదమూడు రూపాయలు. 'ఇది పేక్‌చేసిఇయ్యి' అని ఆమె చెప్పబోతూంటే, అంతవరకూ ఏదో ఆలోచిస్తున్నట్లు నిలబడి పోయిన శ్రీధర్ 'ఇలాంటివి చాలామంది తెస్తారు' ఉలెన్ ఎక్విప్‌మెంటు బాగుంటుందికదా.. అని సుజాత సమాధానానికి ఎదురయినా చూడకుండా 'ఇవివద్దు స్వెటర్లు చూపించు' అన్నాడు.

'అక్కడికి వెళ్ళండి' అన్నట్లు ప్రక్క కౌంటరువేపు చెయ్యి చూపించి, విప్పి పడేసిన బట్టలు మడత పెటుకోటంలో మునిగిపోయాడు వాడు.

సుజాత మాట్లాడకుండా అతనివెంట వెళ్ళింది—ఆ సమయంలో అలాంటి పరిస్థితినుండి బయటపడటం ఎలాగో ఆమెకి అర్థంకావటం లేదు.

'ఏం జరిగితే అది జరగనీ' అన్నట్లు తనకేం సంబంధం లేదన్నట్లు చూస్తూ నిలబడి పోయింది.

ఆమె ప్రమేయం లేకుండానే శ్రీధర్ ఒక స్వెటరు, ఓజత సాక్సు సెలక్టుచేసి, 'బాగున్నాయి కదూ' అంటూ ఓసారి ఆమె వంకచూసి.

'బిల్ బనావో' అంటూ ప్రక్కన పెట్టాడు.

పర్సు తెరిచి డబ్బు తియ్యబోయిన సుజాత ఏదో గుర్తు వచ్చినట్లు 'ఎంతయింది' అంది.

అప్పటికే జేబులోంచి పర్సుతీసి డబ్బు తీస్తున్న శ్రీధర్ 'నలభై' అంటూ నాలుగు పదిరూపాయల నోట్లు కౌంటరు మీద పెట్టాడు.

వ్రాసిన బిల్లూ, డబ్బూ పట్టుకుని క్యాషియరుదగ్గరికి వెళ్ళాడు ఆ అబ్బాయి. శ్రీధర్ ఎన్నిక చేసిన దుస్తులు వో ప్లాస్టిక్ కవరులోను, ఆ కవరు మరో అట్టపెట్టెలోను పదిలమైన స్థానాన్ని ఆక్రమించుకుంటున్నాయి. మరో కుర్రాడి చేతిలో.

**సుజాత కా పరిస్థితి అంతా** ఎలాగో వుంది—ఆ ఎయిర్‌కండిషన్డ్ షాపులోకూడ చెమటలు పోసుకువస్తున్నట్లుంది. 'ఏమిటి తను—నేను కొనటానికి వస్తే నా వెంట వచ్చినవాడు మాట్లాడకుండా చూస్తూ నిలబడాలి—తన కేదైనా కావలిస్తే విడిగా తీసుకోవాలి. అదేం లేకుండా నేను కొనవలసినవాటికి నా ప్రమేయం లేకుండా అంతా తన ఇష్టమే అయినట్లు ఎన్నిక చేసేసి, పైగా పైకే మర్యాదకి అడిగినట్లు ఓసారి నాతో చెప్పి బిల్లు వ్రాసేసెయ్యమన్నాడు. అంత ఖరీదైనవి కొని మరొకరికి ఇచ్చే తాహతు నాకు ఉండదన్న సంగతి కొస్తయినా గ్రహించుకోటానికి ప్రయత్నించడేం—ఛ, ఈ డబ్బు గలవాళ్ళెప్పుడూ ఇంతే—వాళ్ళ దర్జాకీ అంతస్థుకీ సరిపడేవే కాని కాస్త తక్కువ వాటివైపు వాళ్ళ దృష్టే పోదు. అందువల్ల ఎదుటి మనిషి మనసు నొచ్చుకుంటుం దేమో నన్న ఆలోచనైనా వీళ్ళకి రాదుల వుంది—కొంతలో కొంత నయం. డబ్బు తీసి ఇచ్చాడు. లేకపోతే అందరి ముందు నిలువునా పరువు పోయేది.' అంత విసుగు లోనూ మనస్సుకి కాస్త స్థిమితంగా






## మూలశంకకు

త్వరగా నమ్మకమైన హెడన్‌సాత్ చికిత్సను పొందండి శస్త్రచికిత్స అవసరములేదు!

DOL-327 TEL

## సేల్సుమేన్ కావలెను

నెలకు రు. 350 లేక కమిషన్‌పై స్త్రీలు/పురుషులు రెండు తెగలవారు పూర్తికాలము/విరామ కాలములో ప్రతి పట్టణం/గ్రామమునందు మా కొత్త వస్తువులు, కాస్మెటిక్స్, టెరిలిన్, సాక్సు, టైస్, కుక్క పాత్రలు, అల్లిక & రెడిమేడ్ ఉడుపులు విక్రయించుటకై సేల్సుమెన్ కావలెను. ఉచిత షరతులకు, శాంపిల్ సెట్‌నకు వ్రాయ గోరడమైనది.

Employment Officer, (APM-44)
P. Box 1456, Delhi.

## వాయిదాల చెల్లింపుపై ట్రాన్సిస్టర్



నెలకు రు. 10/- వంతున సులభముగా చెల్లించి రు. 320 వెల గల 'టెలి క్వీన్' పోర్టబుల్ 3 బ్యాండ్స్, ఆల్ వరల్డ్ పోర్టబుల్ ట్రాన్సిస్టర్‌లు పొందండి. వివరములకు:

ATLAS CO., (APW-M22)
Box No. 1329, Delhi-6.

## పుస్తకములు

5 పుస్తకముల సెట్టు రు. 5-50.

(1) కొక్కోకశాస్త్రం (2) సుహాగ్రాత్ (3) చుంబన పద్ధతులు, (4) 84 ఆసనములు, (5) రహస్యఫోటో ఆల్బం. ఒక్కొక్క పుస్తకం రు. 2/-. పోస్టేజి, ప్యాకింగ్ అదనం. ఇంగ్లీషులో వ్రాయండి.

SULEKHA TRADERS,
(WAT-7) Beat No. 13, Aligarh.


# సుజాత

చిక్కినట్లయింది.

ఇద్దరూ షాపులోనుండి ఇవతలకి వచ్చారు 'నా దగ్గర అంత డబ్బు లేదిప్పుడు—రేపు ఆఫీసులో ఇచ్చేస్తాను.' సిగ్గుతో కుంచించుకుపోతూ మెల్లిగాఅంది సుజాత.

ఏం చెప్పాలో తెలియనివాడిలా చూస్తూ వకొనంగా చెయ్యిజాచి పేకెట్ అందివ్వబోయా డతను. అది అందుకోటానికి ఆమె ఒక అడుగు ముందుకు వెయ్యటం, ఎవరో నిర్లక్ష్యంగా పారవేసిన అరటిపండు తొక్కమీద పాదం ఆనటంవల్ల జర్రున జారి ముందుకి పడబోతూంటే శ్రీధర్ చటుక్కున ఆమెచెయ్యి అందుకుని పడిపోకుండా ఆసరా ఇవ్వటం అన్ని మరుక్షణంలోనే ఒకదానివెంట ఒకటిగా గబగబ జరిగిపోయాయి — సుజాతలో అణువణువూ తనకే అర్థంకాని విచిత్రమైన అనుభూతితో స్పందించాయి. అతనిచెయ్యి విడిపించుకుని సర్దుకుని నిలబడుతూ 'థ్యాంక్స్' అంది. ఆ పేవ్‌మెంటు మీద బోర్లా పడిపోకుండా చెయ్యి ఆసరా ఇచ్చినందుకు ఆమాట అనటం తన మొదటి కర్తవ్యం అనిపించి.

'కాలు బెణకలేదు కదా' అభిమానం ఆదుర్దా వ్యక్తం అయాయి అతని గొంతులో.

'లేదులెండి.' సిగ్గుపడుతూనవ్వేసింది.

'పండు తినేశాడు. తన పని అయిపోయిందంతే. ఆ తొక్కదారిలో పడేస్తే ఈగలు ముసురుతూ అసహ్యంగా వుంటుంది. చూసుకోకుండా ఎవరైనా దానిమీద అడుగేస్తే జారి పడతారు అన్న జ్ఞానం వుండదు — నాలుగడుగులువేసి ప్రక్కనేవున్న డస్టుబిన్‌లో పడేసే ఓపిక వుండదులా వుంది.' కనిపించని ఆ వ్యక్తి మీద చిరాకు పడిపోయాడు శ్రీధర్.

'తన ఇల్లు శుభ్రం చేసుకుని ఆ చెత్తా చెదారం గోడమీదనుంచి రోడ్డు మీదికి విసిరేసే రకానికి చెందుతారు వీళ్లంతా — వీధిలో మనుష్యులు తిరుగుతూంటారు. అది వాళ్ల నెత్తిమీద పడుతుందేమో నన్న ఆలోచన రాదు వాళ్లకి— ఒకవేళ పడినా గోడ అవతలవున్న వాళ్లకి మనం కనిపించం కదా అన్న ధైర్యం — ఇదీ అలాంటిదే — వస్తానండీ. చాలా థ్యాంక్సు.' అని మరొకసారి చెప్పి రిక్షా కుదుర్చుకుని వెళ్ళిపోయింది.

ఆమె కనుమరుగయి పోయేటంత వరకు అటే చూస్తూ కారు స్టార్టుచేసిన శ్రీధర్‌కి హఠాత్తుగా ఎవరో గుర్తు చేసినట్లే వచ్చింది ఓ ఆలోచన. 'ఇవాళ నా ప్రవర్తన కాస్త ఎబ్బెట్టుగా వున్నట్లుంది సుజాత ఏమీ అనుకోలేదుకదా' అనుకుంటూ, తప్పుపని చేసినవానిలా సిగ్గుపడి పోయాడు—అందమయిన అమ్మాయిని ఒంటరిగా చూసేసరికి ఒళ్లు మరిచిపోయే బలహీనత తనలో లేదు — మరి, ఇవాళ ఇలా ఎందుకు జరిగింది — ఇవాళ ఉదయంనుంచీ తన ఆలోచనలలో సుజాత తప్ప మరో విషయం జొరబడకుండా పోయింది — మధ్యాహ్నం ఆమెని పిలిచి కాస్సేపు మాట్లాడాలి చూచాయగానైనా తన అభిప్రాయం తెలియజెయ్యాలి అనిపించింది—కాని అతి ముఖ్యమైన ఆఫీసు పనులు (ట్రంక్‌కాల్సు, విజిటర్సు వీటితో ఒక్క క్షణంఅయినా తీరుబడిగా వూపిరి పీల్చుకోటానికే అవకాశం లేకపోయిం దివాళ —మళ్లీ రేపు పదిగంటలదాకా ఆమె కనిపించదు అప్పుడయినా ఏ అవాంతరాలు వస్తాయో అనుకుంటూ చిరాగ్గా కారు తీసుకుని బయలుదేరిన తను ఆ ప్రక్క రిక్షాదిగిన వ్యక్తి సుజాతలా వుంది అనిపించి కారు అటుప్రక్కగా ఆపాడు— సందేహం లేదు, ఆమె సుజాతేఅని రూఢి కాగానే మనస్సు నిండా మధురభావాలు అల్లుకు పోయాయి — అనుకోకుండా ఆ క్షణంలో ఆమె కనిపించటంవల్ల తనలో కలిగిన సంచలనాన్ని దాచుకోలేక పోయాడు. అసలు మనస్సు తన వశంలో లేకుండా పోయింది—మర్యాదకి పలకరించి వూరుకోకుండా చొరవగా ఆమెని వెంట తీసుకు వెళ్లాడు. ఆమె కొనదలచిన దేదో తీసుకోనివ్వకుండా స్వతంత్రంగా తను ఇంకేదో ఎన్నిక చేశాడు—తను చేస్తున్నపని సరి అయినది కాదు అన్న వూహ కనీసం ఒక్కసారి మనస్సులోకి వచ్చినా కాస్త జాగ్రత్త పడేవాడు—ప్చ్. సుజాత ఏమనుకుంటోందో —రేపు డబ్బు తీసుకువచ్చి ఇచ్చేస్తుంది —తీసుకోకపోతే అభిమాన పడటమే కాదు దురభిప్రాయం ఏర్పరచుకోవచ్చు — తీసుకుంటే, ఆమెకి ఈ నెల అంతా చాలా ఇబ్బందిగా గడుస్తుందేమో పాపం — ఛ, ఇవాళ అన్నీ అవకతవక పనులే చేశాను. నా కసలు బుద్ధిలేదు' — ఇంక ఎక్కడికీ వెళ్లాలనిపించక కారు తిన్నగా యింటివేపుకి తిప్పాడు.

(ఇంకా వుంది)




నీతులు చాలా గమ్మత్తయినవి. ఊదితే ఉబ్బే రబ్బరు బొమ్మల మొఖాల్లాగా రూపాంతరం చెందుతూ ఉంటాయి. అవసరాన్నిపట్టి మారుతూ ఉంటాయి.

అబద్ధాలాడ్డమే తీసుకోండి. అబద్ధాలు కోరనిపించుకుందుకు హడలి చచ్చేవాళ్ళు కూడా నిర్మొహమాటంగా తియ్యగా నిజానికి మైళ్ళదూరంలో ఉండే నిజాలు వల్లిస్తారు. కొంచెంకూడా తటపటాయించరు! (ఇష్టంలేని వ్యక్తిని)'కలుసుకోడానికికూడా టైములేనంత బిజీగా ఉన్నానోయ్' అనడం అబద్ధంగా లెక్కకిరాదు—బోర్‌తో ఎంత సేపని మాట్లాడ్డం బాబూ? రహస్యం బయటపెట్టడం, అందించవలసిన వార్త అందించకపోయినా 'ఓ చెప్పానే', అనేయడం, ఉత్తరాలకి సమాధానాలు రాయికపోడానికి చెప్పేకబుర్లు—వాటికి పైమెరుగులు దిద్దినకొద్దీ కొట్టవచ్చినట్టు అబద్ధాలుగానే తెలుస్తాయి. అయినా నమ్మేదెవరు?

అబద్ధానికి నిజానికి మధ్యనున్న సరిహద్దు చాలా విశాలమైనది. అందుకే పిల్లలకిదోపట్టాన అర్థంకాదు. నిజమే మరి. వాళ్ళో చిన్న అబద్ధం ఆడితే విరుచుకుపడతాం. కాని వాళ్ళేమో పెద్దవాళ్ళు చెప్పే అబద్ధాలు విని గౌరవంగా ఊరుకోవాలని తలపోస్తాం — టెలిఫోనుల్లో, ఇంట్లో శాంతిభద్రతలకోసం చిరువిరు అబద్ధాలు అలా ప్రవహించిపోతూనే ఉంటాయి 'చాకలికి చొక్కాలు వేశావా?' అని హుంకరించిన భర్తకి 'ఓ వేశాను కాని యీ సారి అర్జెంటుకూడా రెండురోజులు ఆలస్యంకావచ్చు నన్నాడు' అనేస్తుంది ఇల్లాలు—ఆరోజు భర్త ఆఫీసుకి వెళ్ళాక చాకలికి వేయని పర్టులు! పక్కనేఉన్న చంటాడు'లేదునాన్న మరిచిపోయింది'అంటే వాడుచేసినదే తప్పుగా తోస్తుంది ఆక్షణంలో—అమ్మమాటకి అడ్డుచెప్పి సరిదిద్దుతాడా వెధవాయి-కొంచెంకూడా కృతజ్ఞత లేదు!...అమ్మ అబద్ధంచెప్పి దొరికిపోవడం నిజం చెప్పిన కుర్రాడి పీకలమీదికి వస్తుంది.

సర్వ సామాన్యంగా మన నోటపడి నలిగే అబద్ధంలాంటి నిజం, నిజం లాంటి అబద్ధం—ఇంకోటి ఉంది.దొంలింగిచడం. దారిలో కోట్లో నాలుగణాలు కన్పిస్తే హాండుబ్యాగులో వేసుకోవడం పెద్ద దొంగతనం కాదు—కాని దాన్ని కొట్టువాడికివ్వాలని ఎందుకో తోచదు. నాన్నగారి జేబులో అడపాతడపా కొట్టేశే రూపాయీ అర్ధా దొంగతనం కిందకి వస్తాయా?

వైవాహిక జీవితంలోనూ, సాంఘిక జీవితంలోనూ అందరూనమ్మే కొన్ని నీతులు ఉన్నాయి. అవి ఈనాడు నిన్నా వచ్చినవి కావు సంప్రదాయం,సంస్కారం పెంచినవి. చిన్నతనంలో ఈనీతి కట్టుబాటుల జబ్బులు అర్థంకావు. అన్నీ 'ముఖం విలువ'ను పట్టే తీసుకునే వయస్సులో వాటికి పలు అర్థాలు స్ఫురించవు. కాని ఈనాడలా కాదే—ప్రేమ కోసం లేచిపోతే—నైతికంగా పతనం అయిందనీనాడు అంతా అనుకోవడంలేదు. ప్రేమలేనిచోటువ్యభిచారంతప్పంటున్నాం—ప్రేమవల్ల దారితప్పితే—దానికి పంచ రంగులు పులిమి గౌరవనీయం చేయాలని చూస్తాం. ఈ ప్రోసెస్‌లో ఒక భార్యగాని ఒక భర్తగాని మానసికంగా దెబ్బతింటే—ఏం చేస్తాం వాళ్ళ దురదృష్టం అంటున్నాం. ఏం చేస్తారు. అనుభవించడమే అంటున్నాం. 'అటువంటి అడ్డగాడిదలాంటి భార్య ఏం సుఖం యిచ్చిందని?' అంటూ నిలవేస్తాం. తొలిరోజుల సొగసులు సంసారపు వంటలో నలిగి, పిల్లపాపలు, ఎప్పుడూ ఏవో యిబ్బందీ కలిగి, పది సంవత్సరాల పెళ్ళికి అనంతరం భార్య లెలా ఉంటారు? 'అయిన్నేం అనకూడదండీ ఏం చేస్తాడూ?' అంటారు. అంత మాత్రంచేత ఆయన చేసినపని రైటౌవుతుందా అన్నదిప్రశ్న. కాని అలవాటైపోయిందీ రోజుల్లో. న్యాయ న్యాయాలు తోచడంలేదు ఇద్దరు ప్రేమించుకున్నప్పుడు తరువాత జరగవలసినది జరిగి తీరుతుంది మనం ఏంచేస్తాం. నిస్వార్థపరురాలైన భార్యని ముచ్చటైన పిల్లలని కాలదన్నితే కర్మ అనేస్తున్నాం అంతేగాని నిజాన్ని నిజంగా గుర్తించి భార్యని వదిలేశాడనిగాని, ఫలానా ఆవిడ లేచిపోయిందనిగాని ఈరోజుల్లో వినబడదు. ప్రేముందంటుంటే దొంగతనం ఎలా అవుతుందని?

'నన్నొదిలేసి ఆమెతోనే ఉంటున్నారు. ఆపెళ్ళి చట్టసమ్మతమౌతుందా' అంటూవాపోయిందో పిల్లల తల్లి. చట్టసమ్మతం కాదంటే నువ్వు చేయకలిగిన దేమిటి పిచ్చిదానా? కోర్టు కెక్కగలవా? నీచేతులతో నీవే భర్త పరువు తీసినట్టు బాధపడే హృదయం నీది—అనుభవించడమే — అని చెప్తాం—కాని ఏదోఒకటి చెయ్యి, ఆరెండో స్త్రీ నిజంగా చేసినది దొంగతనం. కేసు పెట్టు అని నిజం చెప్పకలరూ? 'నన్ను ఒదలకండీ' అని కాళ్ళనడ్డా 'నేనేం చేయను సుశీ నన్నామె తన ప్రాణంకంటే ప్రేమించింది 'అని బదులుచెప్తే అబద్ధం అనెలా అనడం? హృదయదౌర్బల్యాన్ని కాదని గెలవలేం అని వేదాంతం జ్ఞాపకం చేసుకుంటామా?

# నన్ను చెప్పనీయి

పి. ఎస్. నారాయణ



శశిరేఖ ఉత్తరం వ్రాసింది.

'ఒరేయ్ తమ్ముడూ!

ఈ మహారాణి రేపు శనివారం బొంబాయి వెళుతూ మీ ఊళ్లో ఓ పగలు గడప బోతోంది. తెల్లవారుతూనే బండిదగ్గరకు వచ్చి తీసుకువెళ్లటం, సాయంత్రం దగ్గరుండి రైలెక్కించటంగూడా నీవంతే—అంతేగాదు నీగదిలోవున్న నీతోటి బ్రహ్మచారులనంతా ఆ రోజుకు బయటకు తోలేయ్ బాబు— ఈ కాస్త సహాయం చేశావో నీఋణంజన్మ జన్మాలకు తీర్చుకోలేను.

మిగతా విషయాలన్నీ నీ మొఖాన చెప్పనీయ్

—శశిరేఖ.'

ఓహోహో—నాకు పండుగ!

* * *

శనివారం పొద్దున లేస్తూనే సికింద్రాబాద్ స్టేషన్‌కు బయల్దేరాను.

బండి మామూలుగానే ఓగంట ఆలస్యంగా వచ్చింది.

పెట్టెలంబటే పరుగెత్తాను.

'ఒరేయ్ సత్యం!'

—ఆ కంఠం శశిరేఖది!

'వచ్చానక్కాయ్!'

'నీ మొఖం...నీకంటే ముందు నేనే చూశారా!'

'అదిగాదే పొద్దున్నే లేవంగానే ఒకసారి, మొఖం కనుక్కొని ఒకసారి, తలదువ్వుకుంటూ ఒకసారి...నేనే చూచుకున్నానే అద్దంలో...' అమాయకంగా మొఖం పెట్టాను.

అది ఫక్కున నవ్వింది.

'నీ నవ్వును చూచి సంతోషించేందుకు మా బావ లేడుగాని దిగుదిగు...!'

అది మూతి తిప్పుకుంటూ దిగింది.

అది దిగుతూనే వెనక్కు తిరిగి 'దిగవే శారూ!' అన్నది.

మరుక్షణంలోనే శారూ—బంగారు తీగ బయటకు వచ్చి తళుక్కున మెరిసింది!

నేను గుడ్లప్పగించి చూడసాగాను.

ఎవరా బంగారు తీగ?—ఏంవాకథ?

'ఇదుగో ఈ ప్రభుద్దుడే...మాతమ్ముడు సత్యం!'

'నమస్కారమండీ!'—అచుట్టుప్రక్కల ఎవరో వీణవాయించినట్లయింది.

'నమస్కారమండీ!' చేతులు జోడించి మరీ బుద్ధిమంతుడిలా చెప్పేశాను.

జనాన్ని తప్పుకుంటూ బయటకు వచ్చేటప్పటికి పదినిముషాలు పట్టింది.

పోర్టర్‌కుచెప్పి బెడ్డింగ్‌తప్ప అన్నీ క్లోక్‌రూంలో పడవేయించింది శశిరేఖ—బెడ్డింగ్ తీసుకొని మారూంకు జేరేటప్పటికి మరో పావుగంట!

అప్పటికే ఎన్నడూ ఎనిమిదిగాందే లేవని అక్కుపక్షి, చిరంజీవి మొఖాలు కడుక్కొని రోడ్డు పట్టుకున్నారు మరెవరిదన్నా రూం పట్టుకునేందుకు!

'ముందు బాత్‌రూం చూపించు...ఆపైన నీవు వెంటనేవెళ్లి ఓడజను ఇడ్లీలు లావుపాటివిగట్టి చట్నీతోపొట్లం కట్టించుకొని, మూడు కప్పుల కాఫీ ఫ్లాస్కులో పోయించుకొని పరుగెత్తుకుంటూరా—ఆత్మారాముళ్లు ఆవురావురుమంటున్నారు!'

'చిత్తం దేవిగారూ...నన్ను కొంచెం చెప్పనిస్తారా?'

'అరేయ్! నేను గెస్టును ... నీవు హోస్టువి...నేను చెప్పిందల్లా చేయటమే నీవంతు...మారుమాట్లాడకుండా వెళ్లరా.. రావే శారూ...టూత్ బ్రష్, పేస్టు బెడ్డింగ్‌లోంచి బయటకులాగు!

నెత్తికొట్టుకుంటూ వెనక్కుతిరిగాను: 'ఆ వచ్చే మొగుడెవడోగాని ఓ ఆరునెలల్లో అడ్డగాడిదను చేసికూర్చోపెడుతోంది!' పెద్దగానే గొణిగాను.

'అరేయ్!...ఆమాటవచ్చిందిగాబట్టి... అసలు సంగతి నన్ను చెప్పనీయ్......'

వెనక్కు తిరిగాను.

అది మెలికలు తిరిగిపోతుంది.

'అదేమిటి?..షాక్ఏమైనా కొట్టిందా?'

శారద మెరుపులా నవ్వింది.

'అదిగాదండి...!' ఏదో చెప్పబోయింది. కాని బుగ్గలు కందినయి. నోరు మూత పడింది. కనురెప్పలు వాలిపోయినయి— అంతేగాకుండా శశిరేఖలాగానే మెలికలు తిరిగిపోతోంది!

'ఖర్మ ... వస్తా!' రోడ్డెక్కాను — మా సోదరీమణి కోరిక తీర్చేందుకై — వాళ్ళు చెప్పబోయే సంగతిని వాళ్ళకే వదిలివేసి!

మా పెదనాన్న కూతురయిన (అదీ) నేను ఓ ఏడు సంవత్సరాలు ఓచూరు క్రింద గడిపాం—స్వంత అక్కాతమ్ముళ్ళ కంటే మిన్నగా, ఆత్మీయంగా—'యింత' అని చెప్పుకోలేనంత 'ఇది' గా!— క్రితం సంవత్సరమే విడిపోవటం తటస్థించింది— అదైనా వాళ్ళనాన్నకు బొంబాయికి మార్పిడీ, నాకు హైద్రాబాద్‌లో ఈ ఉద్యోగం అవ్వటంతో!

—అది ప్రస్తుతం గుంటూరులో వున్న వాళ్ళ పెద్దన్నయ్య దగ్గరనుండి బొంబాయి వెళుతుంది!

టేబుల్‌మీద ఫ్లాస్కో, యిడ్లీపొట్లం వున్న సంచీ పెడుతుంటే, 'అరేయ్ తమ్ముడూ! నాకు పెళ్ళిరా!' అన్నది.

చటుక్కున తలెత్తాను—అది కళ్ళ ముందు లేదు!

* * *

మధ్యాహ్నం హోటల్ నుంచి డబుల్ క్యారియర్ వచ్చింది — పన్నెండు గంటలకు. అప్పటికి శశిరేఖ, శారదా ఓ కునుకు లాగి, లేచి కూర్చొని ఆవులించి 'ఆకలి' అన్నారు.

ఈ హోస్టుగాడు 'ఇదుగో రోకలి' అన్నాడు — క్యారియర్‌ను వాళ్ళముందు పెడుతూ.

శశిరేఖ వడ్డించింది.

శారద మంచినీళ్ళు పెట్టింది.

శారద ఎందుకో పక్కకు వెళ్ళగానే, 'అదిగాదే! ఆ అమ్మాయిచేత పనిచేయిస్తావేం ... మనకు గెస్ట్‌గదా! ఏం బాగుంటుంది!' అన్నాను...చిన్నబుచ్చు కుంటున్నట్టుగా గొంతు కొద్దిగా తగ్గించి.

'పడింది కన్ను ... ఇక అయిందన్న మాటే ... కథలు ఎప్పుడూ మొదలయ్యేది జాలితోటే...కానీయ్ ... కానీయ్' అని వోరగా నా మొఖంలోకి చూస్తూ, 'ఒసేయ్ శారదమ్మ తల్లీ ... ఇలా వచ్చి పీటవాల్చుకు కూర్చోఅమ్మా...నీ వెక్కడ అరిగిపోతావోనని మా తమ్ముయ్యగారు గుండాగి చస్తున్నాడు!' అరిచింది గొంతు చించుకుంటూ.

'నీ నోటికి శుద్ధీ బుద్ధీ లేదే ... ఏమిటీ వాగుడూ ... నేనేమన్నానని ... నీ యిష్టం వచ్చినట్లు చేసుకో...మధ్యలో నాదేం బోయింది!' ... విసుగా కంచం ముందునుంచి లేవబోయాను.

చేయిపట్టుకు ఆపుతూ, 'కాళ్ళు పట్టుకుంటాను...గోలమాత్రం చేయబోకు ...నోరుమూసుకు కూర్చో!' అన్నది గంభీరంగా.

భోజనాలదగ్గర ప్రయాణానికి పూర్వగాథను చిన్నగా బయటపెట్టింది — ఓ ఎమ్మే చదివిన అబ్బాయి తండ్రి ఓ ఉదయాన్నే వచ్చి 'పదిరోజుల్లో పెళ్ళి చేస్తారా? — లేకపోతే మావాడు దేశాంతరాలకు పోతున్నాడు, తిరిగొచ్చిందాకా ఆగుతారా?' అన్నాట్ట. అందుకు మా పెదనాన్న హడావుడి పడిపోతూ, 'బాబ్బాబు! పెండ్లీడు కొచ్చిన ఆడపిల్ల తల్లిదండ్రుల గుండెలమీద కుంపటేకదా?— మీ యిష్టమే, మా యిష్టం!' అన్నారుట! — అంతే, దీన్ని టెలిగ్రాంమీద గుంటూరునుంచి బొంబాయికి పిలిపిస్తున్నారట!

మూడుగంటలవుతూనే టాయిలెట్టయ్యారు.

నేనూ తయారయ్యాను.

గదికి తాళమేస్తుండగా, 'ఇప్పుడా అయింది మూడు ... నీకో మూడుగంటల టైం యిస్తున్నాను...ఆరుగంటలకల్లా రూంలో వుండాలి. ఏడుగంటలకల్లా భోం చేసి టాక్సీ ఎక్కాలి. ఎనిమిది గంటలకు మూర్తైలు ... ఈలోగా చార్మినారే చూపిస్తావో, జూకే లాక్కెళతావో ... సాలార్‌జంగ్ మ్యూజియం మాత్రం మరెప్పుడైనా చూస్తాం...కాదంటావా టాక్సీ కట్టించుకొని గండిపేట పోదాంపద...లేదంటావా సావిత్రివున్న మంచిసినిమా ఏదైనా చూడు ...హాయిగా కూర్చొని చూసొద్దాం!' గడగడా చెప్పేసింది.

'ఓ తిమ్మడూ! నన్ను చెప్పనీయ్... అడక్కుండా వెంట నడవటమే నీవంతు... పర్సు తెరిచావో వేళ్ళిరగకొడతాను ... కోరటం నీవంతు, కొనటం నావంతు ... నీకో మరదలు తగిలేటంతవరకు ఈసామ్రాజ్యానికి రాజాధి రాజును నేనే!' శారద వంక వోరగా చూస్తూ అన్నాను.

శారద తెల్లచీర కట్టుకుంది. తెల్ల జాకెట్టు తొడుక్కుంది — తెల్లజోళ్ళు, తెల్ల హ్యాండ్‌బ్యాగ్!

చిక్కడపల్లి సెంటర్‌లో కొచ్చే టప్పటికి టాక్సీ డోరు తెరుచుకు నిలబడింది.

ముందుగా మల్లెదండ, తరువాత మా తిమ్మడూ, వెనక ఎక్కారు. ముందు నేను కూర్చున్నాను.

తరువాత దిగింది తాజమహల్ ముందు!

దిగుతుంటే మల్లెపూల మాలలు బుట్టలో పెట్టుకు అమ్ముతున్న కుర్రాడు కనబడ్డాడు. రెండు కొన్నాను.

లోపలికెళ్ళాం. ఫ్యామిలీ రూంలో కూర్చున్నాం.

'ముందు శారదగారికి ఇద్దాం!'అన్నాను మల్లె చెండ్లు బల్లమీద పెడుతూ.

శశిరేఖ నవ్వుతూ, 'ముందు నన్ను చెప్పనీయ్...దీనికి పూలంటే పరమ అసహ్యం ...అదో పెద్ద జిడ్డు...చెప్పింది వినదు... ఆ రెండు దండలూ నాకివ్వు...రెండు జడలకూ పెట్టుకుంటాను!' అన్నది.

నా ఉత్సాహమంతా చప్పగా చల్లారి పోయింది.

'అంత అందమైన అమ్మాయికి పూలంటే పరమ అసహ్యమా?' (భగవాన్ ఇంకెందుకు నన్ను బ్రతికి వుండనిస్తున్నావ్?)

శారద మొఖంలోకి చూచాను.

—దిగులు ఆవరించివున్న ఆమె మొఖంలో ఏదో వెలితి ఉన్నట్లనిపించింది!

శశిరేఖ గిచ్చిందల్లేవున్నది 'కేర్' మన్నది శారద.

'నీవేం దిగులుపడకు తల్లీ ... మా గురించి నీవేం బెంగపడ నక్కరలేదు...నీ కిష్టంలేని పనిని మేమేం చేయమనం...

# నన్ను చెప్పనీయ్!

అయితే ఆ మొగుడుగాడు వచ్చిం తరువాత మారిపోతావనుకో!'

శారద తీక్షణంగా చూసింది శశిరేఖ ముఖంలోకి చూచింది.

పెసరట్లు తిన్నాం.

ఐస్‌క్రీం తిన్నాం.

'కాఫీ' వేసుకున్నాం.

క్రిందనుండి చార్మినార్ చూసి—'జూ' కెళ్ళాం!

అక్కడే ఆరంభమయింది — నా జీవితంలో శారదతోగూడిన రెండో ఘట్టం!

టిక్కెట్లు కొనుక్కొని గేటు దాటి లోపలికి వెళ్ళామో లేదో, చిన్న పిల్లలు ఏనుగెక్కేచోటకి వచ్చేటప్పటికి, శశిరేఖ తల పట్టుకొని, 'అరేయ్ తమ్ముడూ! నాకు కళ్ళు తిరుగుతున్నయి...కాళ్ళు తేలిపోతున్నయి...ఈ చెట్టు క్రింద బెంచి మీద కూర్చుంటాను గాని, మీరలా కాసేపు తిరిగి వీలయినంత త్వరగా వచ్చేయండి!' మాట పూర్తి చేయకుండానే కూర్చుండిపోయింది.

నేను శారదా హడావుడిపడ్డాం: 'అయితే ఇంటికే వెళ్దాం పద...ఇక్కడెందుకు?'

'కాదులే...శారద ఎప్పుడూ చూళ్ళేదుగా...చూపించు!' అన్నది హేళగా శారద మొఖంలోకి చూస్తూ.

'పద్దులేవే శశి!...వెళ్దాంపద!' అన్నది శారద.

'కాదురా తమ్ముడూ!...అదో మొద్దుపోగాని తీసుకొనివెళ్ళు...నాకేం ఫరవాలేదు..నేగంట ఇలాగే కూర్చోగలను!'. అంటూ బలవంతాన మమ్మల్ని ముందుకుతోసింది.

—నా హృదయం నాకందుకు పరవశించినమాట వాస్తవమే!

'అక్కాయ్! ఈ తమ్ముడు నీకు జీవితాంతం ఋణపడి వుంటాడే!' మనస్సులోనే కృతజ్ఞతలు చెప్పేసుకున్నాను.

శశిరేఖకు దూరమయ్యాం అనుకున్న తరువాత శారదకు దగ్గరవ్వాలనిపించింది.

ముందు కోతులున్నవైపుకు వెళ్ళాం.

'మీరు నడవగలరా?...చాలాదూరం నడవాలి!' అన్నాను కళ్ళుపక్కకు తిప్పి శారద మొఖంలోకి చూస్తూ.

'ప్రయత్నిద్దాం...ఎప్పుడు నడవలేకపోతే అప్పుడే వెళ్ళిపోదాం ... అక్కడా శశిరేఖ ఒక్కతే ఉన్నదిగదా!' అన్నది నవ్వుతూ.

శశిరేఖను భయం 'సన్నటి ఒణుకు' రూపంలో ఆవరించిందేమోననిపించింది ఆక్షణంలో.

'మీరు హైద్రాబాద ఎప్పుడూరాలేదా?'

'ఇదే మొదటిసారి!'

'మీరేమైనా చదువుతున్నారా?'

'అవునండీ!' చిన్నగా నవ్వి, 'ఏంవిటీ—ప్రెస్ రిపోర్టర్‌లా అడుగుతున్నారు నన్ను!' అన్నది.

ఫక్కున నవ్వాను నేను.

'ఒక్కొక్కరినిచూస్తే అలా అడగాలనిపిస్తుంది!' సూటిగా ఆమె కళ్ళల్లోకి చూస్తూ అన్నాను.

'ఇప్పటికి మీరెంతమందిని అడిగారేం అలా?' దెబ్బకొడుతున్నట్లుగా అడిగింది.

తడుముకోకుండా అన్నాను: 'ఆడపిల్లల్లో మీరే ప్రథమం!'

బుగ్గలు గులాబుల్లా మారినయి. నవ్వింది వసంతం వెదజల్లుతున్నట్లుగా — ఏదో విజయం సాధించిన తరువాత! ఆమెకళ్ళను కాంతి కప్పివేసింది ఆక్షణాలు ఆమె కోరికలకు విజయసోపానాలే అయితే అందలమెక్కినట్లే ఉవ్విళ్ళూరింది...

'శారదా...శారూ...'

—ఆవేశంలో నన్ను నేను మర్చిపోయాను.

'శారదా!'

'నడవండి...ఏంవిటీ స్మరణ!'ముందుకు అడుగులేస్తూ అన్నది.

'మీరేం అనుకోకుండా వుంటే మీకో మాట చెబుతాను!'

'నేననుకుంటాను!' అన్నది సీరియస్‌గా.

—నేను దిక్కుమొఖంవేయక తప్పలేదు!

ఒక్కక్షణ మాగి, — 'ఏదో ఒకటి అనుకోవాలి గదా మరి!' అన్నది—తెల్లని పలువరుస తళుక్కుమనేలా—నవ్వుతూ

ఆమెభావన అర్థమయ్యేటప్పటికి నాకూ నవ్వాగలేదు!

కోతుల్ని దాటి కొండముచ్చుల దగ్గరికొచ్చాం.

ఆపైన సింహాన్ని చూద్దామనుకుంటే —అది ఏ మూల ముఖం కనబడకుండా ముడుచుకు పడుకొని నిద్రపోతుంది!

కొంగలు, నెమళ్ళు చిలకలు, పిచ్చుకలు, పాములు, కొండచిలువలు—చిన్నగా దాటుతున్నాం!

'నన్ను గురించి మీరేమనుకుంటున్నారు? ...పోనీయ్ నన్ను గురించి నన్ను చెప్పనిస్తారా?' చాలా చిన్నగా, సౌమ్యంగా అన్నది—చుట్టూ మనుష్యులు లేకుండా చూచి.

'ముందు నన్ను చెప్పనీయండి!'కొంటెగా నేనన్నాను ఆమె వైపుకు చూస్తూ.

'మధ్యాహ్నం నాకో కల వచ్చింది! నేను గుర్రంమీద కొండల్లోపడి పరుగెడుతున్నాను [!] దూరంగా కొండ కొసన ఓ విద్యుల్లత నన్ను కవ్విస్తూ నిలబడ్డది. నా వంక చూస్తూ చేయూపుతుంది.

నా జ్వరం ఎప్పుడో తగ్గిందయ్యా! నువ్వు, రోజూ ఇక్కడికి రానవసరం లేదు!



# తలనొప్పా?

## పోగొట్టుటకు ఒకే ఒక సారిడన్ చాలును

'రోష్'



## అది మిమ్మల్ని నవోత్సాహముతో వుంచుతుంది!

### అదే సారిడన్ యొక్క ప్రత్యేకత

నొప్పికి మీరు వేసుకోవలసినది సారిడన్ నొప్పిని త్వరలో పోగొట్టుటకు సారిడన్ వలె యితర మార్గాలు వుండవచ్చు. కాని నొప్పితోపాటు కలిగే నరముల ఒత్తిడిని కూడ పోగొట్టి హాయి నవోత్సాహములను కలిగించుటకై ఒక ప్రత్యేక ఫార్ములా ప్రకారము తయారు చేయబడినది ఒక్క సారిడన్ మాత్రమే. అందువలన ఒకే ఒక సారిడన్‌తో నొప్పి మటుమాయమై, మీరు సరిగ్గా ఆలోచించ గలుగుతారు... మీకు పనియందు ఆసక్తి కలుగుతుంది... మీరు మళ్ళీ చిరునవ్వుతో వుండగలుగుతారు! అంతే కాదు, సారిడన్ యిచ్చే నివారణ స్థిరమైనది. సారిడన్‌ను ఎల్లప్పుడు మీ దగ్గర సిద్ధంగా వుంచుకోండి!

## సారిడన్ వేసుకోండి

'రోష్'



పంటినొప్పి, ఒంటినొప్పి, బహిష్టునొప్పి, వీటికి కూడ సారిడన్ దివ్యమైనది. పిల్లలకు ¼ నుండి ½ బిళ్లవరకు మాత్రమే చాలును.

**'రోష్' తయారు**

ఏకైక డిస్ట్రిబ్యూటర్లు: **వాల్టాస్ లిమిటెడ్**

కొండపైకి దారిలేదు. అంతా ముళ్ళు,— రాళ్ళు, ఎత్తులూ పల్లాలు...కొంతదూరం అలాగే ముందుకు వెళ్ళి పక్కకు చూస్తే పెద్ద లోయ — పడిపోతాననే భయంతో కెవ్వున కేకవేశాను—'ఇంకా పైకి వెళ్ళాలనే అనుకుంటున్నావా?' వో అస్పష్టమైన కంఠం—వెళ్ళాలనే నా నిశ్చయానికి తిరుగులేదని చెప్పాను — సౌమ్యంగా ఆ కంఠం, 'భక్తా! నిన్ను మెచ్చితిని...ఇదో ఆ తిలోత్తమకడకు నిన్ను ఇదే జేర్చువాడ!'—మరు క్షణంలోనే ఆ పూబంతి కౌగిట్లో...' పక్కకు తిరిగి శారద మొఖంలోకి చూచాను.

'ఆ తిలోత్తమను నేనే కదూ!' అన్నది వో క్షణం తరువాత సిగ్గుతో నంగి నంగిగా.

'అరె ! నీ కెలా తెలుసు !' విచిత్రంగా ఆమె మొఖంలోకి చూచాను — చల్లని వెన్నెల్లో చిరుగాలి !

'మీ అక్కయ్యే చెప్పింది !'

—తరువాత పావుగంటవరకు నాకు నోటమ్మట మాట పెగల్లేదు! లేళ్ళను, కోళ్ళను దాటాం. ఏనుగులు చూచాం.

చిన్న చిన్న బోట్లు తిరుగుతున్న కాలువ అవతలకు జేరాం.

కాలి బాటమీద నడుస్తున్నప్పుడు, నాకు చాలాదగ్గరిగా జరిగి చెవులో చెబుతున్నట్లుగా అన్నది: 'నన్నేమైనా కొంచెం చెప్పనిస్తారా ?'

# నన్ను చెప్పనీయ్!

'ఏవిటి...నీటిగుర్రాన్ని గురించా ?' పక్కకు తిరిగి ఆమె మొఖంలోకి త్రాగేస్తున్నట్లుగా చూస్తూ అన్నాను — ఎగతాళి మిళితంచేసి.

'కాదు...నాగురించి !'

'అంత ముఖ్యమా అది ?'

'ఆఁ...నాకూ, నా జీవితానికి — మీరు ముందుగా తెలుసుకోక తప్పదు !' నొక్కి పలుకుతూ అన్నది.

నేను విచిత్రంగా ఆమె మొఖంలోకి చూచాను.

బుజంమీద చిన్నగా తడుతూ (చొరవ తీసుకుంటున్నందుకు తేలిగ్గానే క్షమిస్తుందన్న నమ్మకంతో), 'కానీయ్ శారదా ! అంత ముఖ్యమయిన విషయమైతే తప్పక తెల్సుకోవాల్సిందే !' అన్నాను.

'పదండి !...ఆ పందిరి క్రిందగా బెంచీ మీద కూర్చుందాం !'

'పద !'

శారద ఏం చెప్పాలను కుంటున్నది ?— తనని ప్రేమించవద్దనా ? తనకు పెళ్ళి చేసుకోవటం యిష్టంలేదనా ? ఊహూ... అలా అయితే తను యింతచనువూ యివ్వదూ...అటు అక్కమద్దతూ ఇవ్వదు.

ఏం చెబుతుంది ?

ఏవో ?...

వౌనంగా అనుసరించాను.

'కూర్చోండి !' కూర్చున్నాను—

తను పక్కగా కూర్చొని, ఒక్కసారి భారంగా నిట్టూర్పు విడిచి, నా వైపు రెప్పలార్పకుండా చూస్తూ, 'ఒక్కొక్కరి జీవితంలో...' మొదలెట్టింది.

'ఎవరి జీవితంలో ?...ఎవరిని గురించి చెప్పాకుంటున్నారు !'

ఇద్దరం ఉలిక్కిపడ్డాం.

బెంచీవెనుక మా యిద్దరినడుమా శశిరేఖ నిలబడి వున్నది !

'నీవెక్కణ్ణించి ఊడిపడ్డావ్?' ఆశ్చర్యంగా అడిగాను.

'అయితే మమ్మల్ని వెంటాడుతున్నావన్నమాట!' కళ్ళు చిట్లించి నిష్ఠూరంగా అన్నది శారద.

'...ఏఁవీగాదు...అయిదవ్వ బోతోంది... మిమ్మల్ని వెతుక్కుంటూ ఇప్పుడేవచ్చాను.. నడవండి, నడవండి!' అన్నది హడావుడి చేస్తూ.

శారద అసహనంగా మూలుగుతూ లేచి నిలబడి, 'నీవెప్పుడూ ఇంతే శశిరేఖా!' అన్నది కోపంగా.

'—లేకపోతే క్షణాలమీద మారిపోతాననుకున్నావా?' ఎగతాళిగా చూస్తూ అన్నది.

బజార్లో షాపింగ్ చూసుకొని, టాక్సీలో ఇంటికి జేరేటప్పటికి ఆరుగంటలయింది.

గదిలో కాలుపెడుతూనే, 'హోటల్ కెళ్ళి భోంచేసివస్తే సరిపోలా...దగ్గరేగదా అక్కాయ్!...అయినా నీయిష్టం...గేహుగారి ఆజ్ఞ!' అన్నాను.

'ఎందుకు దగ్గరయిలే భోంచేసేవద్దాం!'

మళ్ళీ బయల్దేరాం.

శారదతో వంటరిగా మాట్లాడాలని, ఏవేవోచెప్పాలని, ఒక్కసారి హృదయానికి హత్తుకొని...

ఊఁహూఁ...

మా అక్కయ్య మా నడుమనుండి ఒక్క క్షణంగూడా తప్పుకోవడంలేదు...

ఏంచేయాలి?

భోంచేసి వో అరగంటలో తిరిగి రూం కొచ్చేశాం.

'అక్కయ్యా!...నన్నొకటి చెప్పనీయ్!'

'చెప్పరా తమ్ముడూ!'

'రాకరాక...కాదు..మొట్టమొదటిసారిగా మా యింటికి (ఇది ఇల్లా?) వచ్చింది శారద...అందుకని ఏదైనా ప్రజంటేషన్.'






# న్యూట్రిన్

మీ మధురానందము కొరకు—
పైనాపుల్ టాఫీలు
ఫ్రూట్ టాఫీ రోల్స్ డైరీ టాఫీ రోల్స్
ఇంతకంటే రుచికరమైన టాఫీలున్నవా?
మీ నాలుక చెప్ప నివ్వండి!






న్యూట్రిన్ కన్ఫెక్షనరీ కంపెని ప్రైవేట్ లిమిటెడ్
చిత్తూరు - ఆంధ్రప్రదేశ్

నామాట పూర్తిగాకుండానే... 'అంత అర్జంటే లేదులేరా నాన్నా!...ఎటూ రేపు నా పెళ్ళికి బొంబాయి వస్తున్నావుగదా ...అక్కడే అది ఓపన్నెండ్రోజులు ఉంటుంది... తెచ్చేదేదో అక్కడికి తేరా!...'

ఎందుకో కొన్ని గంటల పరిచయం తోనే శారదకు దూరమవ్వాలన్నా బాధగా వున్నది. గుండె, మనస్సు బరువుతో నిండి పోతున్నయి. నిరుత్సాహం నన్నంతా ఆవరించివేస్తోంది...

తరువాత—ఎనిమిది గంటలకు—రైలు కూసిన కూత నా గుండెలమీద దెబ్బ కొట్టింది!

* * *

# నన్ను చెప్పనీయ్!

సరిగ్గా శశిరేఖ బొంబాయి వెళ్ళిన ఆరోరోజున దాని దగ్గరనుండి వో ఉత్తరం వచ్చింది—దాని పెళ్ళి శుభలేఖతో పాటు!

దాని పెళ్ళికి అందుకోవాలంటే రేపు రాత్రికే రైలెక్కాలి!

ఉత్తరం మడత విప్పాను—శారదను గురించి ఏమైనా రాసిందేమోనని ఆదుర్దాతో.

'తమ్ముడూ !

పెళ్ళిచూపు లయిపోయినయి. పిల్ల నచ్చిందీ లేందీ గూడా తెలుసుకోవాల్సిన అవసరం లేకుండానే అసలు సంగతి నేను పసిగట్టేశాను...నీవు జన్మలో 'శారద'ను తప్ప మరొకరిని వివాహం చేసుకోవని నాకు తెలుసు !

కాని శారదకే వివాహం అంతగా యిష్టం లేదు !

నీ గుండెగాని ఆగలేదుగదా ?

ఆగకుండా వుంటే అసలు విషయం నన్ను చెప్పనీయ్...

శారదకు ఇదివరకే వివాహమయింది !

ఈ సారి ఆగిపోతే ఆగిపోయి వుండవచ్చు !

ఆగిపోలేదూ...

అయితే విను ... ఆ మొగుడనే మనిషి మూడుముళ్ళు వేసిన మూడోరోజు తిరక్కుండానే—అయిదు సంవత్సరాల క్రితం—వో కారుక్రిందపడి 'హరీ' అన్నాడు !

నా అంచనాలు తప్పకుండా వుంటే నీవు మళ్ళా బ్రతికివుంటావ్ !—అవునా ?

అదే మీ అమ్మా, నాన్నలకుగూడా గంటసేపు బోధించాను. వాళ్ళు ఇష్టమయితే చూపలేదు గాని వ్యతిరేకతను మాత్రం వ్యక్తం చేయలేదు — ఆ భారాన్నంతా నీ మీదకే నెట్టారు !

—అందుకే శారదకు వివాహంచేసె బాధ్యతను నా మీద వేసుకున్నాను !

— నా నమ్మకాల్ని వమ్ముచేయవు గదా ?

శారదకైతే ముందుగా అన్ని విషయాలూ నీకుచెప్పి నీకు అంగీకారమైతేనే చేసుకోవాలని వున్నది — అందుకే ఈ ఉత్తరం—దాని మాటల్ని గౌరవించాలిగదా నేను!

'శారద'ను మొగన్నాని పించుకోగలదమ్మంటేనే నాపెళ్ళికిరా—

అంటే—

అర్థమయిందిగదా!

ఉంటా

—శశక్క.'

వాకిట్లో ఓ పిల్లవాడు అరుస్తున్నాడు సైకిల్‌మీదపోతూ 'మల్లెపూలో' అని.

తలుపు తీసుకు రోడ్డెక్కి రెండు మూరలు కొన్నాను.

—అని [illegible] [illegible] నేను బొంబాయిలో దిగి శారద ముందు కాలుపెట్టేటంతవరకూ వాడిపోకూడదని! ●


పం. డి. గోపాలాచార్యులవారి
అశోకా
స్త్రీల
ఆరోగ్య సౌభాగ్యానికి
1898 నుండి ప్రసిద్ధిగాంచినది
ఆయుర్వేదాశ్రమం
(ప్రైవేట్) లిమిటెడ్
100·జి·ఎస్·రోడ్· మదరాసు·17.


గమనిక

ఉత్తరాల శీర్షికకి రాసేవారు ఈ కింది నియమాలు పాటించాలని మనవి: 1. ఉత్తరాలు వీలయినంత చిన్నవిగా ఉండాలి 2. రాసేవారి పూర్తిపేరు, చిరునామా ఇవ్వాలి 3. ఇంగ్లీషు లిపిలో అక్షరాలు రాయరాదు 4. కాగితానికి ఒకవయిపునవే రాయాలి. 5. సిరాతోనే రాయాలి. —సం॥


ఇంకాప్స్ అంటే
IMPCOPS
పరిశుద్ధమైన ఆయుర్వేద,
సిద్ధ, యునాని మందు అనేది నిశ్చయము.
[illegible] 30/320A. [illegible] 19. [illegible] 27. [illegible] P.O. [illegible] 4/166. [illegible]
IMP-527M TEL

## అసభ్యత చలన చిత్రాలలో మాత్రమేనా ? (చర్చ)

# కాదంటే మాత్రం నిజం నిజం కాకపోతుందా ?

# అసభ్యత అనే ముసుగునుంచి బయటపడాలి !

తన మనసును తనే మోసం చేసుకునే మనుషులు 'అసభ్యత చలన చిత్రాలలో మాత్రమేనా' అన్న చర్చలో బయట పడుతున్నారు. ఇలాంటి వాదం చూస్తూ ఉంటే మనమింకా రాతియుగం లోనే ఉన్నామనిపిస్తున్నది. "మాంసం తినే వాళ్ళు ఎముకలు మెళ్లో కట్టుకోవాలా ?, అయ్యయ్యో! సీతమ్మవారు నారచీరలు కట్టుకొన్నారు, మనం టెర్లిన్ చీరలా" అనే సభ్యత, సంస్కారం గల్గిన వారంతా సి. వి. రమణ గారి వ్యాసాన్ని దుయ్యబడుతున్నారు.

ఆయన ప్రశ్నను ఎవరూ అర్థం చేసుకున్నట్టే కన్పించరు ఆయన చెప్పిన యదార్థాన్ని ఒప్పుకున్నట్టే అనిపించదు. 'సెక్సు విషయాన్ని నే నసలు ఆదరించను. దాంతో నాకేమి సంబంధం లేదు. ఈ మాటతో నేను మనసార ఏకీభవిస్తాను!' అని గుండెల మీద చెయ్యి వేసుకొని ఎవర్నన్నా అనమనండి చూద్దాం! ఇది జరిగే విషయం కాదు. దీన్నే సి. వి. రమణ గారు విప్పి చెప్పారు. ఈ వ్యాసం ఆంధ్ర సచిత్రవారపత్రికలో చోటు చేసుకోగల్గింది అంటే అందులోనే దాని విలువ అర్థమవుతున్నది ఈ వ్యాసం కేవలం ఒక వ్యాసానికి విమర్శ అని నాకనిపించదు. 'ఇది ఒక సమస్య ఈ సమస్యని ప్రజలు పరిష్కరించాలి. సంచలనాన్ని కలుగ జేయాలి. ముసుగులో గుద్దులాట మానేయాలి' అన్నారు రచయిత

ఈ వ్యాసం రచయిత ఆత్మ సంస్కారానికి కొటురాయి ఏమీ దాచకుండా ఉన్నదున్నట్లు బయట పెట్టినందుకు యింతింత విమర్శలు! ఏమైనా 'నిజం నిష్ఠూరం' అన్నసామెతకి యీ విషయంలో సరైన అర్థం కనిపిస్తున్నది. ఆత్మవంచన చేసుకోవడం మనుష్యుల పురోగతికి సూచన అవదు సభ్యత అనే ముసుగులో పడి కొట్టుకుంటూ అందులోకి మరింతమందిని లాగి వాళ్ళను ఉక్కిరిబిక్కిరి చేయడం సభ్యత కలవారి పనేనా? రచయిత చెప్పిన అన్ని విషయాలలోను నేను ఏకీభవించక పోవచ్చును. కాని రచయిత నిజం చెప్పారన్నది వాస్తవం. యిటువంటి నిజానికి ఎప్పుడూ అడ్డుగోడ లుంటాయి

ఇక్కడ సి. వి. రమణ గారు చెప్పని మరొకవిషయాన్ని చెప్పదల్చుకున్నాను. ప్రఖ్యాతి గాంచిన అనేక శిల్పాలున్నాయి. ఇందులో నగ్నంగా చిత్రించినవే ఎక్కువ ఎందుకుటా? వాటిని అలా ఎందుకు చిత్రించ వలసి వచ్చింది ? ఉడుపులు ఉన్నట్లుగా చిత్రించ కూడదు? ( ఒకవేళ ఉడుపులు ఉన్నా ఒంపులు కనబడేలా చిత్రిస్తారు. మరి యిదెందుకో ! ) జరిగింది. ( దేశం పేరు గుర్తులేదు) అసభ్యతని అరికట్టేందుకు చట్టం చేశారు. అప్పుడు నగర కేంద్రాల్లో ఉన్న 'నగ్నచిత్రాలకు' ఉడుపులు తగిలించారుట ప్రజలు. మరో ఉదాహరణ తీసుకుందాం! ఒక చిత్రకళా ప్రదర్శన జరిగిందనుకోండి అందులో ఒక నగ్న చిత్రముంది. ప్రదర్శనలో మొత్తం మీద ఆకర్షింప బడేది అదొక్కటే! ఎందుకిలా జరగాలి? మరి అసభ్యతకాదాఅది? అయితే మన విమర్శకులు ఎలాంటి వారు అంటే—దాన్ని చూడాలనే ఆ పేక్షలోపలి బలవంతాన అణచుకొని కళ్ళుమూసుకొని వేళ్ళ సందులోంచి చూసే సంస్కార వంతులు! యీ దొంగదాటు పద్ధతి నుంచి బయటపడిన నాడే జాతి సంస్కారవంత మవుతుంది. ఆ అభ్యుదయం మనం చూడలేం. ఎదురు చూడటమే మన పని.

ఇలా కుండబద్దలు కొడితే నన్నాడిపోసుకుంటారని తెలుసు. అంతమాత్రం చేత నిజం నిజం కాకపోదుకదా!

యస్. పున్నయ్య శాస్త్రి.
( హైదరాబాద్)

## అసభ్యకరమైన సన్నివేశాలు చిత్రాల విజయానికి కారణం !

సి. వి. రమణ గారి విమర్శ చదివాను. అసభ్యత ఇందులో లేదా? అంటూ పెద్ద పెద్ద గ్రంథాలను ఉదహరించారు శ్రీ సి. వి రమణ గారు. హాశ్చర్యం! వాటిని అందరూ—అంటే 4వ తరగతికి చెందిన వ్యక్తులు చదవడం కుదరదు. చదవలేరు. అథవా చదివినా అర్థంచేసుకోలేరు. కారణం వాళ్ళు వాడిన భాష ప్రభావం. కానీ ఈనాడు వస్తున్న సినిమాలలాకావే. "గౌరమ్మా! నీ మొగుడెవరమ్మా...." అని ప్రతి రిక్షావాడూ ఒంటరిగా కన్పించే ప్రతి ఆడపిల్లనూ ప్రశ్నిస్తుంటాడు. సైకిల్ మీద పోతున్న అమ్మాయిలను "సైకిల్ మీద వన్నెలాడి పోతున్నది రివ్వుమని పిట్టలాగ పోతున్నది. ." అనే రిక్షావాళ్ళు, హోటల్ కుర్రాళ్ళు బోలెడు మంది ఉన్నారు. వీళ్లకీపాటలెక్కడివి? శ్రీనాథుని కవిత్వాలిచ్చిందా? లేక ప్రాచీన కవుల పచ్చి అసభ్య శృంగార ప్రబంధాలు పంచి ఇచ్చాయా? కొన్నిసినిమాలలో (స్త్రీలనుద్ధరించేందుకువస్తున్నవి) ప్రేక్షకులకు నీతి గరపాలన్న సదుద్దేశంతోనే తీస్తారు నిర్మాతలు. కానీ ప్రేక్షకుల్లో సభ్యత భర్త ప్రక్కనుంటే ఏదో కాస్త నయం. ఏ అన్నో, తమ్ముడో, లేక మరెవరో అయితే మరీ ఘోరం. సిగ్గుతో ఒళ్ళు చచ్చి పోవల్సిందే ఇహ వస్త్రాలు సరేసరి. వస్త్రాలంకరణ ఎంత ఘోరంగా ఉంటుందంటే క్లాసులో కూర్చున్న ఆడవాళ్లను చూసి బాల్కనీలో కూర్చొనే వారికి భయమేస్తుంటుంది మగవాళ్ళకు ఆడవాళ్ళు నఖశిఖ పర్యంతం ప్రదర్శింప బడడం ఆనందకరం, ఆరోగ్యదాయకమైనప్పుడు తమ ఇళ్లలో ఉన్న అక్కలు చెల్లెండ్లు, భార్యలు, బిడ్డల్ని అలా చూడవచ్చుగదా! మరెందుకు చూడడం లేదు ? పొట్టి జాకెట్లు సబ్జక్టు చేసే ఆధునిక పురుషులు చాలామందిని నే నెరుగుదును. స్త్రీ సౌందర్య ప్రదర్శనే మన అభిరుచికి చిహ్నంగా నిర్మాతలతో బాటు ప్రేక్షకులగా భావిస్తే చావాల్సిందే సినిమాలు విజయవంతమవుతున్నాయంటే కారణం లోక్లాసు మాబ్ అట్రాక్ట్ అవడం వల్లనే నని—దానికి ముఖ్యకారణం పచ్చి, అసభ్యకరమైన శృంగార సన్నివేశాలు, వస్త్రాలంకరణ అని సి వి రమణగారు తెలుసుకోవడం ముఖ్యం. శృంగార ప్రబంధాలు చదివే పండితులందరూ, వీధిలో కన్పించే ప్రతి ఆడదాన్నీ వర్ణించడం లేదు వెకిలిగా ప్రవర్తించడం లేదు. మరి ఆదునిక డిటెక్టివ్ సాహిత్యం చదివే ప్రతి రిక్షావాడు "పడిలేచే కెరటం చూడు .. పడుచు పిల్ల బింకం చూడూ" అంటున్నారు. సభ్యతకు అసభ్యతకు తేడా కన్పింప చేస్తున్నదీ మగవాళ్లేనండీ ! రమణగారూ!

స్త్రీ సౌందర్యం ఆకర్షణ ఇవన్నీ సహజమైన రహస్యాలండీ! వాటికి ఇంగువ తిరగమోతవేసి బజార్లో చాటడం ఆరోగ్య దాయకం కాదు. అది మన వీక్ మెంటాలిటీని చూపిస్తుంది. నిజానికి ఆ సరదా ఉన్నవాళ్ల జారత్వమే వృత్తిగా గల భోగంమేళంను ప్రోత్సహించండి. ఏదో వాళ్ల భుక్తితోపాటు కులవృత్తి. తిండికీ గడచిపోతుంది. అంతేగానీ కళాసేవ పేరిట మనం ఓ ప్రక్క దిగజారి పోతూ, సినిమా నిర్మాతలనూ, నటీ నటులనూ ఎందుకు లక్షాధికారులు చెయ్యడం?

ప్రజల్లో నైతిక పతనం ప్రబలిపోక ముందే సంస్కారవంతులైనయువకులూ ముందుకురావాలి!!

కుమారి క్రిష్ణవేణి.
మెడికల్ కాలేజి ( కర్నూలు).

**'చర్చ'కి రాసేవారు తమ లేఖలని వీలైనంత చిన్నవిగా, ఒక కాలంకి మించకుండా రాయాలని కోరుతున్నాము.**

# నటి నర్తకి విజయ లలిత

వ్యాసం మోహన్ కుమార్

ఫోటోలు. మోహన్ జీజగన్



తీరిక వేళల్లో...

ఎత్తయిన సోఫామీద కూచుని వీణ వాయిస్తూ పాడుతున్నది విజయలలిత. 'రాగాలన్నీ నీవే, అనురాగాలన్నీ నీవే— అవి అందాలుగా అరవిందాలుగా విన్ను వలచెనులే—పిలిచెనులే' అని.

'విన్నేపెళ్ళాడతా!' అన్నదామె నవ్వుతూ.

'ఎవర్నీ?' అన్నా ఆశ్చర్యంగా చూస్తూ.

'సిల్లీ...మిమ్మల్ని కాదు. నిన్నేపెళ్ళాడతా చిత్రంలో దీ పాట' అన్నది చిలిపిగా.

విశాల్ కంబయిన్స్ వారు నిర్మిస్తున్న ఈ చిత్రంలో పద్మశ్రీ రామారావు గారి పక్కన ఒక చక్కని భూమిక పోషిస్తున్న దీ అమ్మాయి.



నటనలో ఎప్పటికప్పుడు ఎంతో కృషి

అదృష్టం ఎవర్ని ఏ రూపంలో ఎప్పుడు ఎలా వచ్చి వరిస్తుందో ఎవరూ చెప్పలేని విషయం. సినిమా తారల భవిష్యత్తు కేవలం అదృష్టం మీదనే కాక వారి కృషిమీద కూడా ఆధారపడి వుంటుం దనటంలో అత్యుక్తి లేదు; అసత్యమూ లేదు. విజయలలితను అదృష్టం వరించి మాట నిజమే గాని, నటనలో ఎప్పటి కప్పుడు ఎంతో కృషి చేస్తూండటం వల్లనే ఈనాడు ఆమె యింత చక చకా పైకి రాగలిగింది. ఇచ్చిన పాత్రను అర్థం చేసుకుని నటించడంలో ఎంతో నైపుణ్యం ఉన్నదీమెకు.

పాతికేళ్ళ అరిందాలా కనిపించే కుమారి విజయలలితకు పద్దెనిమిదేళ్ళే నంటే చాలా మందికి ఆశ్చర్యం కలుగుతుంది. కాని, నిజమంతే! ఈ అమ్మాయి టి. నగర్ లోని వళ్ళీన్‌కణ్ణి స్కూలులో చదువుతున్న రోజుల్నుంచీ ఈ వ్యాసకర్త ఎరుగును. పశ్చిమ గోదావరి జిల్లా తాడేపల్లిగూడెంలో జన్మించింది. పుట్టిన తేదీ జనవరి 4. వళ్ళీన్‌కణ్ణిస్కూలు తర్వాత శారదా గర్ల్స్ హైస్కూల్లో చదువుతుంది. చిన్నపిల్లగా వుండి చదువుతుంటున్న రోజుల్లోనే ఈ అమ్మాయిచేత పి వి రెడ్డిగారు [illegible] చిత్రంలో



అణకువ, నెమ్మది, మర్యాద... గం

వేషం వేయించారు. రాను రాను ఈమెకు సినిమాలపట్ల గల అధికోత్సాహాన్ని, ఆసక్తిని గమనించి వాళ్ల అక్కగారు విజయ నృత్యంలో శిక్షణ యిప్పించారు. నాట్యంలో ఒక్కరిదగ్గరే కాదు; పదిమంది దగ్గరా పలు రకాల నృత్యాల్లోను విశేష మైన తర్ఫీదు పొందింది. భారతీయ పాశ్చాత్య నృత్యాలలో దేనినయినా పరే టక టకా యిట్టే చేసెయ్యగల నేర్పును అల వరచుకుంది విజయలలిత.

దేవర్ ఫిలిమ్స్ 'వేర్‌వళి' తమిళ చిత్రంలో పులితో కెమెరాముందు అమితో త్సాహంతో ఆడటంచూసి ఆ చిత్రనిర్మాత చిన్నప్పదేవర్ - 'పులితో కెమెరాముందు భలే ఉత్సాహంగా ఆడుతున్నావమ్మా' అంటూ ఆశ్చర్యపోయారు. నృత్యంలో అంత స్పీడ్ మూవ్‌మెంట్స్ ఈ అమ్మాయిలో ఉన్నవని ఆయన అనుకోకపోవడమే అందుకు కారణం.

ఇంతవరకు 20 చిత్రాలకుపైగా నటిం చిన కుమారి విజయలలిత యిప్పుడు 14 తెలుగు చిత్రాల్లో నటిస్తున్నది. అందులో తొమ్మిది సాంఘికాలు, ఐదు జానపదా లూను. వాటిలో 'నిన్నే పెళ్లాడతా,' ఇటీవల విడుదల అయింది. జయశ్రీ లక్ష్మీ పిక్చర్స్ చిత్రం, కుంకుమ భరిణ, నడమంత్రపుసిరి, వింతకాపురం, సత్తెకాలపు సత్తెయ్య, బాగ్దాద్ దొంగ, అందంకోసం పందెం, సప్తస్వరాలు, నవభారత్ ఫిలిమ్స్, గౌరీ ప్రొడక్షన్స్ చిత్రాలు రెండూ—నిర్మాణం జరుపుకొం టున్నవి. ఇప్పుడు క్రొత్తగా జగపతివారి 'అదృష్టవంతులు', దేవర్ ఫిలిమ్స్ తెలుగు చిత్రంలోనూ నటించేందుకు ఒప్పందం జరిగింది.

అణకువ, నెమ్మది, మర్యాదగల విజయ లలిత ఎపుడూ తను నవ్వుతూ ఎదుటివారిని నవ్విస్తూ ఉంటుంది. అల్లరీ, చిలిపితనమూ కూడా లేకపోలేదు. ఈనాడు స్వంతకారు, స్వంతయిల్లు కలిగిన స్థితిలోవున్నా, పిస మెత్తు అహంభావమైనాపొడసూపలేదంటే— ఆమెస్వభావం ఎలాంటిదో అర్థం అవుతుంది.

తీరికవేళల్లో కారెమ్స్ ఆడుకోవటం, గార్డెనింగ్, పుస్తకాలు చదువుకోవటం, స్నేహితులతో కబుర్లు చెప్పుకోవటం కుమారి విజయలలితకు సరదాలు. సహజ మయిన అందం, ఆకర్షణకలిగి, నటన లోను, నాట్యంలోను అపారానుభవంగల విజయలలిత భవిష్యత్తు చిత్రసీమలో ఉజ్వ లంగా ఉంటుందని వేరే చెప్పాలా? ❂



సహజమైన అందం. ఆకర్షణా... (ఫోటో: ప్రభాకర్)

# సినిమా

## తెలుగులో లవ్ ఇన్ కేరళ

ఆ రోజు నా దృష్టి గోల్డెన్‌మీదికి వెళ్ళింది. 'సెప్లర్‌'లో శ్రీ భావనారాయణ కొత్తగా ప్రారంభించిన పౌరాణిక చిత్రం షూటింగులో కృష్ణ, రాజనాలవున్నారని తెలిసి లోపలికెళ్ళా. ఇద్దరూ షర్‌క్యాప్‌లు పెట్టుకుని ఒకర్నొకరు పరామర్శించుకునే సన్నివేశాన్ని యువదర్శకుడు రవి చిత్రించారు. 'లవ్ ఇన్ కేరళ' అనే మలయాళ చిత్రాన్ని తెలుగులో తీస్తున్నాను అన్నారు భావనారాయణ. చిత్రపరిశ్రమలోకి కొత్త వార్ని పరిచయంచేసే భావనారాయణ యీ సారి రవి అనెడి దర్శకుడ్ని యీ చిత్రం ద్వారా పరిచయం చేస్తున్నాను.

*   *   *

గోల్డెన్‌నుండి వస్తూంటే వాహినిలోకి వెళ్ళాలని పించింది మనస్సులో. వెళ్ళడం మంచిదే అయింది. మీకు మరోక రసవత్తరమయిన ఘట్టాన్ని వివరించే అవకాశం కల్గినది.

దేవకన్యలు ఆకాశమార్గాన విహరిస్తూ భూమిపైన సహజంగా శోభిల్లిన కొలనులో జలకాలు ఆడాలనే ఆసక్తిని పెంచుకుని తమ దివ్యశక్తితో అక్కడికి చేరుకుంటారు. చేరుకుని జలక్రీడకై కొలనులోదిగి, ఆనంద పారవశ్యంలో పాడుతూవుంటారు. ఆవేళకు కాంతారావు అక్కడికి రావడం, దేవకన్య కుమారి సచ్చు అందానికి ముగ్ధుడు గావడం, చెట్టుచాటుగ నిలబడి తనివితీరా ఆమె చందాన్ని గ్రోలడం యెందులోనిది అని అడగరేం? 'రణభేరి' చిత్రాన్ని నిర్మించిన పింజల సుబ్బారావు నిర్మిస్తున్న 'పేదరాశి పెద్దమ్మ' లోనిది. గిడుతూరి సూర్యం దర్శకత్వం నిర్వహించే యీ చిత్రానికి హెచ్. ఎస్. వేణు ఛాయాగ్రాహకుడు; కోదండపాణి సంగీత నిర్దేశకుడు. ఈ చిత్రంలో నాయికా, నాయకులుగ కృష్ణకుమారి, కాంతారావులు, మహామాంత్రికుడిగ రాజనాల, మహారాజుగ ప్రభాకరరెడ్డి, మరోక ప్రేమికుల జంటగ విజయలలిత, రామకృష్ణ; మంత్రిగా మిక్కిలినేని ప్రతినాయిక (వ్యాంప్)గ రాజసులోచన నటిస్తున్నారు. హాస్యానికి బాలకృష్ణ వుండనే వున్నాడు. ఈ చిత్రాన్ని నవంబరులో విడుదలచేసి, రామారావు



'బంగారు సంకెళ్లు'లో జమున.

గారితో పెద్ద పిక్చరు ప్రారంభించ దల్చుకున్నట్లు నిర్మాత సుబ్బారావు వెల్లడించారు.

*   *   *

ట్యాలెంటుగల ఆర్టిస్టు యే పాత్రలోనయినా రాణించగలడనెడి సత్యాన్ని కృష్ణంరాజు 'నేనంటే నేనే' చిత్రంలో నిరూపించాడు. కృష్ణంరాజు 'చిలకా గోరింకా'లో హీరోగా మీకు పరిచయమయ్యాడు. మొదటి చిత్రంలోనే బాగా నటించాడు; మీ మెప్పును పొందాడు; పత్రికల ప్రశంసల్ని అందుకున్నాడు. చిత్రం విజయవంతంగా ప్రదర్శింప బడివుంటే కృష్ణంరాజు నేటి మేటి—హీరోల్లో ఒక డయ్యేవాడు. ఆ చిత్రం ఆశాజనకం గాకపోవడంతో కృష్ణంరాజును యే నిర్మాత, దర్శకుడు ప్రోత్సహించలేదు. కృష్ణంరాజు ఓపిక పట్టాడు. ఒక మంచిరోజున డూండేశ్వర రావువద్ద నుండి పిలుపువచ్చింది. కృష్ణంరాజు ఎగిరి గంతువేశాడు. ఆఫీసుకు వెళ్ళాడు. డూండీ గార్ని కలిసాడు. ఆయన చెప్పిన విషయం విని రాజు నిర్ఘాంతపోయాడు. అతడే కాదు—పరిశ్రమలో అనేకులు అదేమాట అన్నారు. కృష్ణంరాజు విలన్‌వేషం వెయ్య

## సినిమా డైరీ

● ప్రముఖ నిర్మాత, జగపతి పిక్చర్స్ అధినేత శ్రీ వి. రాజేంద్రప్రసాద్ సెప్టెంబర్ 2వ తేదీన శ్రీ చౌదరి (రూపశిల్పి)తో అవుట్‌డోర్ లోకేషన్ చూడడానికై ఫియట్‌కారులో వెళ్తోటప్పుడు, రోడ్డంతా వానలో తడిసిన మూలాన కారు స్లిప్ అయింది. శ్రీ రాజేంద్రప్రసాద్‌కు ప్రమాదం జరిగిందని తెలియగానే, మద్రాసునుండి మిత్రులు, శ్రేయోభిలాషులు హైద్రాబాదుకు వెళ్లి పరామర్శించి వచ్చారు. ప్రస్తుతం శ్రీ రాజేంద్రప్రసాద్ హైద్రాబాదులోనే చికిత్స పొందుతున్నారు.

● పి. ఎస్. ఆర్. పిక్చర్స్ "పేదరాశి పెద్దమ్మ"కుగాను శ్రీ చిల్లర భావనారాయణరావు వ్రాసిన "శివమనో రంజనీ, వరపాణి, స్వరరాణి, కనవేజననీ కృపబూనీ" అనేడి రాగమాలికను బాలమురళీకృష్ణ, కోదండపాణి సారథ్యంలో రామకృష్ణకు గాను పాడారు.

● ప్రముఖ నిర్మాతలు శ్రీయుతులు ఏ. ఎల్. శ్రీనివాసన్, శరవణన్, బాలసుబ్రహ్మణ్యం, ఛాయాగ్రాహకుడు శ్రీ మారుతీరావు 3—9—68 (మంగళవారం) ఉదయం గం 2—30 లకు విమానంలో ఉత్తర జర్మనీకి వెళ్లారు.

● శ్రీమతి సావిత్రిగణేష్ దర్శకత్వంలో "చిన్నారిపాపలు" తమిళచిత్రంలో తెలుగులో శ్రీమతి జమున ధరించిన పాత్రను వాణిశ్రీ పోషిస్తుంది.

● నిర్మాత శ్రీ మల్లిఖార్జునరావు భారతి చిత్రసంస్థ ద్వారా నిర్మించే జానపద చిత్రం యొక్క కథ, సంభాషణలను శ్రీ అప్పలాచార్య వ్రాస్తున్నారు.

● కుమారి వాణిశ్రీ, శ్రీ రాంమోహన్‌ల వివాహ ఘట్టాన్ని కౌముదీ ఫిలింస్ "కలసిన మనసులు" కుగాను శ్రీ కమలాకర కామేశ్వరరావు వీనస్ స్టూడియోలో చిత్రించారు. ఈ చిత్రాన్ని శ్రీ ఎం. ఎస్. రెడ్డి నిర్మిస్తున్నారు.




నవజ్యోతి పిక్చర్సు

# నడమంత్రపుసిరి

నిర్మాతలు:
సాంబశివరావు, వందనం

దర్శకుడు
తాతినేని రామారావు

రాయల రిలీజ్

డుపూ అని. శాసీ దొండేశ్వరరావు ఆశ ఫలించింది. కృష్ణంరాజు ఆ పాత్రను బ్రహ్మాండంగా పోషించాడు. అందరూ అతడి నటనచూచి మరోసారి విభ్రాంత పోయారు.

**మాంత్రికుని చెరలో మహారాణి**

మాంత్రిక శిఖామణి రాజనాల చెరలో రాణి శ్రీరంజని బందీగా వుంటుంది. ఆమెను తనదాన్ని చేసుకోవాలని సర్వవిధాలా ప్రయత్నిస్తాడు రాజనాల. ఒకరోజు ఆమెను సమీపించి యిలా అంటాడు.

రాజనాల : అయి. అయిరే భట్టిసీ. ఇక పిన్ని ఏడుపేసి ఏడువు. నీ శోక మోమును విడచి నా కామమును తీర్చవే. తీర్చవే.

శ్రీరంజని : నీ పాపం పండింది; ప్రతుల్లిపడకు. నీకు శాస్తి జరుగురోజు రాకపోదు.

రాజనాల : భళ్ళారే భట్టిసీ. నీ పాపం పండిన పేమి, నాకై నీ ప్రేమ పండవలెనే నీవు నన్నొల్లకున్న ఇక నీ బ్రతుకు కల్ల. ఆలోచించుకో వస్తాను.

అంటూ రాజనాల కోపంతో వెళ్ళి తన మంత్రశక్తి ప్రభావంలో నీటిపై ఒక దివ్య మందిరాన్ని, ఒక అందాల సుందరిని సృష్టిస్తాడు. ఆ అందాల సుందరి

# సినిమా

మరెవ్వరో కాదు; మీ మనస్సులో చక్కిలిగింతలు పెట్టే జ్యోతిలక్ష్మి. రాజనాలను చూసి ఏమంటుందో తెలుసా ?

నేను పుట్టింది నీకోసం
గజ్జతట్టింది నీకోసం
గజ్జకట్టింది పూలుపెట్టింది
కన్నుకొట్టింది నీ కోసం

అంటూ తన ఆట, పాటలతో కవ్విస్తుంది ఈపాటను నారాయణరెడ్డి వ్రాసారు: సత్యం సంగీతాన్ని కూర్చాడు. మంత్ర తంత్రాలతో భారీఎత్తున నిర్మించబడ్డ యీ చిత్రాన్ని పూర్ణాపిక్చర్స్ సెప్టెంబరు మూడవ వారంలో విడుదలచేస్తారు. శ్రీ పి. ఎస్. ప్రకాశరావు, ఎ. పూర్ణచంద్రరావు సంయుక్తంగా నిర్మించిన యీ చిత్రం. 'అగ్నిమీద గుగ్గిలం' ట్రిక్‌షాట్లను ప్రతిభవంతంగా చిత్రించే జి. విశ్వనాథం దర్శకత్వంలో, హెచ్. ఎస్. వేణు కెమరా పనులతోలిన యీ చిత్రంమీద మీ హృదయాల్ని ఆకట్టుకోగలదంటే అతిశయోక్తి లేదు.

**కోవలం బీచ్‌లో కాంతలగానం**

రాజశ్రీ తన చెలికత్తెలతో కోవలం బీచ్‌కి వెళ్ళింది. కాలేజికి శలవులు కావడంతో

# మీకు తెలుసా?

ప్రముఖ నిర్మాత శ్రీ బి. ఆర్. చోప్రా ఒకప్పుడు 'సినీ హెరాల్డ్' పత్రికకు సంపాదకుడిగా వుండేవారు.

ప్రముఖ గుణచిత్ర నటి శ్రీమతి జమునా రమణారావు ఆగస్టు 30 న జన్మించింది. ఈ సారి వీనస్ స్టుడియోలో 'పెళ్ళి రోజు' సెట్సులో ఈమె జన్మదినోత్సవ సంరంభం వైభవంగా జరిగింది.

తెలుగు 'గుణసుందరి కథ'లో జూనియర్ శ్రీరంజని ధరించిన పాత్రను తమిళంలో సావిత్రి గణేష్ ధరించింది.

భారతదేశంలో మొట్టమొదట తయారయినటాకీచిత్రం 'ఆలం ఆరా'

ప్రముఖ దర్శకుడు శ్రీ కె. బాలచందర్ పరిశ్రమకు రాకముందు ఎ. జి. ఆఫీసులో సూపరింటెండ్‌గా పని చేసేవారు.

కాలాన్ని వృధాపుచ్చడం యిష్టంలేక తన స్నేహ బృందంతో ప్రయాణమైంది. వయస్సులోవున్న కాంతలు ప్రకృతి రమణీయకతను చూచి వూరకవుంటారా? ఏంచేసి వుంటారో మీరు చటుక్కున చెప్పండి! మరేమి చెయ్యలేదు. తియ్యగా ఒక కమ్మటి పాటను తమ అందచందాల్ని వర్ణిస్తూ పాడుకున్నారు. ఆమె పాడినపాట ఏమిటి? ఆపాటను వ్రాసిందెవరు? ఎందులోదీపాట?

'పదహారేళ్ళ వయసే నైను కులుకుల్లమ్మా
పండీపండని సొగసే నైను ఏమ్చిలమ్మా
ఈ పరువంలో ప్రాయంలో
చీకుచింతా లేనే లేదమ్మా'

అనేడిపాటను ఆరుద్ర వ్రాశారు. రాజశ్రీకి గాను సుశీల పాడింది. విశ్వనాథం సంగీతాన్ని సమకూర్చాడు. ఈపాట ప్రసాద్ ఆర్ట్సు నిర్మించే 'బంగారుమనసులు'లో మీరు వింటారు. ఈచిత్రాన్ని ప్రసాద్‌కు కె. బాలచందర్ డైరెక్టుచేస్తున్నారు. ముఖ్యపాత్ర



'అగ్నిమీదగుగ్గిలం'లో మీనాకుమారి, రాజబాబు.

అను చలం — శోభన్‌బాబు రాజశ్రీ, గుమ్మడి, ఎస్వరలక్ష్మి, రోజారమణి నటిస్తున్నారు ఈ చిత్రాన్ని ఆంధ్రాలో పూర్ణాపిక్చర్స్ విడుదలచేస్తారు.

* * *

'ఉండమ్మాబొట్టు' పెడతా చిత్రం యొక్క పతాక సన్నివేశాలను దర్శకుడు విశ్వనాథ్ కెమరామెన్ రామకృష్ణ సహాయంతో విజయ, వాహిని స్టూడియోలో చిత్రీకరించడంతో షూటింగు పూర్తయినట్లే. జమున కథానాయికగా, జానకి మరొక ముఖ్యపాత్ర ధారిణిగా అద్వితీయమయిన నటనను కనబర్చిన ఈ చిత్రంలోని ప్రధాన భూమికల్ని కృష్ణ, నాగభూషణం నాగయ్య, ప్రసన్నరాణి పుష్పకుమారి చలం, మీనాకుమారి ధరించారు. శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి సాహిత్యానికి మహదేవన్ సంగీతం యీడు జోడుగా అమరింది. చిత్రకథను దల్వా



'శ్రీరామకథ'లో జయలలిత, పద్మనాభం.

కులకర్ణి, స్క్రీన్‌ప్లేను ఆదుర్తి సుబ్బారావు, సంభాషణలను ఎస్. ఆర్. నంది, కళను తోట, కూర్పును కృష్ణ నిర్వహించిన యీ చిత్రం విశాలాంధ్ర అంతటా శ్రీ ఫిలింస్‌ద్వారా విడుదలౌతుంది.

* * *




కుటికురా
ఆయింట్ మెంట్
మీ చర్మాన్ని గురించి
మంచిశ్రద్ధ వహిస్తుంది

కుటికురా ఆయింట్‌మెంట్ మొటిమలు, సూరేడుకాయలు మరియు పొక్కులను తొలగించేందుకు మీ చర్మంలో చాలా లోతుకు వెడుతుంది. కాలుట, ఒరసిన లేక పొడి చర్మము, కందిన చర్మము, కోసుకొనుట, పురుగు కాట్లు, గజ్జి మొదలైన చర్మ వ్యాధులకు ఉపశమనము కలిగిస్తుంది. బడలిన శరీరాన్ని ఉత్తేజపరచి మృదువుగా నున్నగా వుండేలా వుంచుతుంది.

కుటికురా ఆయింట్‌మెంట్

చర్మ రక్షణకు ప్రపంచమంతా ప్రఖ్యాతి పొందింది.



2 సైజులలో లభిస్తోంది

NAS 110R

**పరిచయం:**



దర్శకుడు

## బి. వి. శ్రీనివాస్

శ్రీ విఠలాచార్య పేరు తెలియనివారుండరు అనుకుంటా. ఆయన కుమారుడే బి. వి. శ్రీనివాస్. తండ్రి దర్శకత్వం నిర్వహించిన చిత్రాలన్నింటిని శ్రీనివాస్ దగ్గరుండి ఆ శాఖ యొక్క మలుపుల్ని శ్రద్ధగా అవగాహన చేసుకున్నాడు. చిత్రనిర్మాణంలో దర్శకుని స్థానం యెంతటిదో క్షుణ్ణంగా తెల్సుకోగల్గాడు. ఒక చిత్రాన్ని డైరెక్టుచెయ్యాలంటే ఒక యజ్ఞాన్ని నిర్విఘ్నంగా సాగించినట్లే నంటాడు శ్రీనివాస్. మొదట్లో కథను దర్శకుడు బాగా అర్థం చేసుకోవాలి. స్క్రీన్‌ప్లే తయారు చేసేటప్పుడు విభిన్న తరగతుల ప్రేక్షకుల్ని మెప్పించేరీతిగా వుండాలి. క్లాప్ దగ్గర్నుండి లైటింగు వరకయితేనేమి, మేకప్‌నుండి ఆర్టిస్టు భావప్రకటన యిచ్చేవరకయితేనేమి దర్శకుడు హుషారుగ వుండాలి అంటాడు శ్రీనివాస్. దర్శకునికి ఎడిటింగు శాఖలో ప్రవేశం వుండటం చాలా అవసరం అనేది యీయన భావం.

కుమారుడి శ్రద్ధాసక్తులను విఠలాచార్య గమనించి అతడు ప్రావీణ్యతనందాడు అని భావించి తమ స్వంత సంస్థ నిర్మించిన "అగ్గిదొర"ను యితనిచే డైరెక్టు చేయించాడు. "అగ్గిదొర"తో బాక్సాఫీసు సూత్రాలన్నింటినీ శ్రీనివాస్ జొప్పించాడు. పర్వాలేదు తండ్రిపేరు నిలబెట్టాడు అనిపించుకున్నాడు. రెండవప్రయత్నంగా ఒక సంపూర్ణ హాస్య చిత్రాన్ని (నిన్నే పెండ్లాడుతా) డైరెక్టు చేశాడు. ఇలాగే ఒక చక్కటి సాంసారిక సాంఘిక చిత్రాన్ని, ఒక యితిహాసగాథగల చిత్రాన్ని డైరెక్టు చేసి "తండ్రిని మించిన కొడుకు" అనిపించుకోగలడని ఆశిద్దాం.

## సినిషా

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ కావ్య సృష్టి ఏకవీరకు సి. నారాయణరెడ్డి సంభాషణలను వ్రాసేందుకు అంగీకరించారు. ఈచిత్రాన్ని శ్రీ డి. ఎల్. నారాయణ నిర్మిస్తున్నారు. శ్రీ సి. ఎస్. రావ్ దర్శకత్వంలో కుట్టన్ సేతుపతిగ రామారావు, ఏకవీరగా కె. ఆర్. విజయ, వీరభూపతిగా కాంతారావు, మీనాక్షిగా జమున నటిస్తున్నారు. నారాయణరెడ్డి సంభాషణా చాతుర్యం యీ కథాఖండంలో యెలా నాట్యంచేస్తుందో వేచి చూడాలి. శ్రీ పి. చెంగయ్య కథయొక్క ట్రీట్‌మెంటును పూర్తిచేసినట్లు తెలియ వస్తూంది. చిత్రంలోని పాటలను శ్రీదేవులపల్లి కృష్ణశాస్త్రి, నారాయణరెడ్డి వ్రాస్తారు. కె. వి. మహదేవన్ సంగీతాన్ని, గోడ్‌గాంకర్ ఆర్టును నిర్వహించే యీ చిత్రంయొక్క షూటింగు అతి త్వరలో ప్రారంభంకాగలని విశ్వసనీయంగా తెలియ వస్తూంది.

*     *     *

నీతి, నిజాయితీగల వ్యక్తి ఎన్. టి. రామారావు ఈ ప్రపంచంలో అందరూ అంతే అనుకుని మోసపోతాడు. న్యాయం, ధర్మం సంఘానికి దూరమయింది. మనిషిలో ఓపిక నశించింది. ఎలాగయినా సంఘంలోని అక్రమాలను, అనాచారాలను, మోసాలను దొంగతనాలను అరికట్టడానికి కంకణం కట్టుకున్నాడు. ఇది సాధ్యమా అనిపించింది. తనుకూడ ఆ గ్యాంగులోని వాడినని నమ్మించ దల్చుకున్నాడు. ఊర్లోని పెద్దల్ని విందుకు పిలిచాడు. వాళ్లకు కనువిప్పు కల్గేలాగ శ్రీ దాశరధి వ్రాసిన పాటను ఘంటసాల పాడగా కవి భావానికి తన భావప్రకటనతో సన్నివేశాన్ని భాసింప చేసాడు. ఆ పాటను కాస్త మీరూ తెల్సుకుంటే 'కథా నాయకుడు' చిత్రం చూసేప్పుడు ఆ పరిస్థితులు రామారావుకు యెందుకు యేర్పడ్డాయో సులభంగా తెలుస్తుం దనుకుంటూ.

ఇంతేనయ్యా,
తెలుసుకోవయ్యా
నీతిలేదు, నిజాయితీ లేదు
ధనమే జగమయ్యా

ఇదీపాట ; యిప్పటికే మీ బుర్ర పని ప్రారంభించి వుంటుంది. కాస్త ఓపిక పట్టండి. 'కథానాయకుడు' రానివ్వండి. ఆపై మీ నిర్ణయాన్ని తెల్పండి. ఇన్ని కబుర్లు చెప్పి అసలు విషయం మర్చిపోతే యెలా ? ఏమిటని అడగరేం, మరేం లేదు. ఈ పాటకు నిండుదనం తెప్పించడానికి శ్రీ టి. వి. రాజు పడ్డ శ్రమ యింతంతని చెప్పలేం ? ఇలాంటి వుత్తమ సందేశాన్ని యిచ్చే కథను యెన్నుకున్న దర్శక, నిర్మాత లెవరను కుంటున్నారు. 'ఆడపడుచు'ను డైరెక్టుచేసిన హేమాంబధరరావు దీనికి దర్శకుడు ; ఆయనవద్ద సహకార దర్శకుడిగ వుండిన గోపాలక్రిష్ణ దీనికి నిర్మాత.

*     *     *

రేలంగి మెడలో పూలదండ వేసాడు పద్మనాభం. రేలంగి వుక్కిరి బిక్కిరి అయ్యాడు. దండతో చాలించక దండకం కూడ ప్రారంభించాడు. అసలు పద్మనాభం యెవరు ? యెందుకిలా చేసాడు ? ఎస్వర లక్ష్మి తమ్ముడు పద్మనాభం. ధనవంతుడు రేలంగిని మస్కాకొట్టి తన బుట్టలో వేసుకునేందుకు పద్మనాభం వేసిన పథకం యిది. అందుకే కోతలు ప్రారంభించి రేలంగిని నమ్మిస్తాడు. ఏమని కోసాడో మీకూ తెల్పితే 'నిండు సంసారం 'చూసేప్పుడు పద్మనాభం యెందుకలా తయారయ్యాడో అర్థవౌతుంది.

పద్మనాభం: నేను పనిమీద బ్రూక్లిన్‌నుండి సరాసరి బొంబాయికి వచ్చాను. అక్కడ ఉఉ అన్న పేరు విన్నాను. ఉ. ఉ. అంటే ఉల్లిపాయల ఉమా కాంతారావు అని తెల్చుకున్నాను. ఉల్లిపాయల వ్యాపారంద్వారా ఒక ఆంధ్రుడికి యింతటి పేరా అని ముక్కుమీద వేలెట్టుకున్నాను. నాలోని సంతోషం నన్ను పిచ్చివాణ్ని చేసింది. అందుకే మీకు యీ దండ+దండకం.

ఈ సన్నివేశంలో మనమంతా కడుపుబ్బ నవ్వేట్లు హాస్యనటులు శ్రీయుతులు రేలంగి, పద్మనాభం, బాలక్రిష్ణలను నటింపచేసారు దర్శకుడు శ్రీ సి. ఎస్. రావు శ్రీ గంగాధరరావు నిర్మిస్తున్న యీ సాంసారిక కుటుంబగాథా చిత్రంలో నాయకీ, నాయకులుగ కృష్ణకుమారి,



'చిన్నపెళ్లాడు తాత'లో విజయలలిత, శారదాల

రామారావులు. మిగతా ముఖ్యపాత్రలను ప్రభాకరరెడ్డి, నాగయ్య, ఎశ్వరలక్ష్మి, రమణారెడ్డి, జయశ్రీపన్ని, మరొక కొత్త నటి పోషిస్తున్నారు. వేణు సంగీతాన్ని, సత్యనారాయణ కెమేరాను, మూరన్న ఆర్ట్సును నిర్వహించిన యీ చిత్రంయొక్క షూటింగు యీ నెలలో పూర్తవుతుంది.

*   *   *

గుమ్మడి బుసకొడుతూ వచార్లు కొడుతున్నాడు. ప్రభాకరరెడ్డి, అల్లు రామలింగయ్య అతన్ని శాంతపర్చడానికి ప్రయత్నించారు. కానీ గుమ్మడి కోపం చల్లారలేదు. ఆయన కన్ను తుపాకిపైకి పోయింది. కోపంతో తన భార్యను, కన్న కుమారుడ్ని కూడ సరిగ్గా వర్కారించలేక పోయాడు. నాకు జరిగిన అవమానానికి ప్రతీకారంగా వాడ్ని కాల్చి పారేస్తానంటాడు గుమ్మడి. చెవిలో అల్లు రామలింగయ్య యేదో వూదాడు. వెంటనే ప్రభాకరరెడ్డి అందుకుంటాడు 'మీరు సై అంటే చాలు నేనెందుకైనా సిద్ధమే; మీ పరువుకోసం ప్రాణాల్ని అడ్డమేస్తాను' అంటూ వెళ్లిపోతాడు. తవేమో తనపనేమో చూసుకునే గుమ్మడిని అవమానించిం దెవరు? ఎక్కడ జరిగింది అవమానం? అని మీకు తెలియాలిగా. బాలా ప్రొడక్షన్స్ 'బంగారు సంకెళ్లు' చిత్రంలో యెడ్లపందెం జరుగుతుంది. ఎడ్లపోటీ యెవరెవరికి జరిగిందనుకున్నారు. గుమ్మడికి, బాలయ్యకు జరుగుతుంది ఈ పందెంలో యెవరు నెగ్గుతారో చిత్రం చూస్తే మీకు తెలుస్తుంది. ఈ సన్నివేశం శ్రీ జి. రామినీడు దర్శకత్వం నిర్వహించిన 'బంగారు సంకెళ్లు'లో మీరు చూడబోతున్నారుగా. శ్రీ వి. సత్యనారాయణ నిర్మించిన యీ చిత్రంలో జమున, హరనాథ్ నాయకీ నాయకులుగ నటించారు. ఈ చిత్రానికి కెమేరాను వి. ఎస్. ఆర్. స్వామి, సంగీతాన్ని పూర్ణచంద్రరావు నిర్వహించారు. అక్టోబరు మొదటివారం ఈ చిత్రాన్ని మీ ముందుంచే బాధ్యతను పూర్ణాపిక్చర్స్ తీసుకున్నారు.

*   *   *

హరనాథ్, నాగరాజరావు ప్రాణ స్నేహితులు; తన స్నేహితుడి పుట్టినరోజు పండుగకు హరనాథ్ వస్తాడు; ప్రముఖ గుణచిత్ర నటి శ్రీమతి జమునకూడ వస్తుంది. హరనాథ్‌ను నాగరాజరావు పాడమంటాడు, ఆవేదన, ఆందోళన మిళితమయిన హరనాథ్ తన భగ్నప్రేమను గూర్చి పాడతాడు. తనపాటకు తన ప్రియురాలి రియాక్షన్ యెలా వుంటుందోనని వరీక్షించాడు. ఈ సన్నివేశాన్ని సూర్యా ఆర్ట్సు 'పెళ్లిరోజు' చిత్రం చూస్తే జమున, హరనాథ్‌ల పాత్ర స్వభావాలు అర్థమవుతాయి. శ్రీ మానాపురం అప్పారావు దర్శకత్వంలో శ్రీఘగతిలో తయారయ్యే యీ చిత్రాన్ని శ్రీ రామశాస్త్రి, నాగేశ్వరరావులు నిర్మిస్తున్నారు. శ్రీ సోమశేఖరరావు సమర్పించే యీ చిత్రం బహుశా సెప్టెంబరు ఆఖరుకు మీ ముందు వుండొచ్చు అనుకుంటున్నారు.

*   *   *

ఎ. కె. వేలన్ వీనస్ స్టుడియోలో హాస్పిటల్ కట్టారని ఒక మిత్రుడు చెప్పగా చూద్దామని వెళ్లాను. ఆస్పత్రిలోకి వెళ్లగానే డాక్టరు ప్రభాకరరెడ్డి, ఆయన జూనియర్ ప్రసాద్ రోగులను వాడీ పరీక్షిస్తున్నారు. బెడ్డుపై వరుసగా చలం, రామకృష్ణ, సి. హెచ్. కృష్ణమూర్తి పడుకుని అదోలా ముఖంపెట్టి ప్రసాద్‌కేసి పకపక నవ్వసాగారు. వాళ్లతోపాటు నర్సు విద్యాశ్రీకూడ గొల్లున నవ్వింది. పెద్దడాక్టరు ప్రభాకరరెడ్డి వురిమిచూసే సరికి అంతా నోరు మూసుకున్నారు. ఇది నిజంగా జరిగిందనుకునేరు సుమా. ఇలాంటి సన్నివేశం ఎ. కె. వేలన్ నిర్మిస్తున్న 'సిరికుమిళి' తెలుగు చిత్రంలో మీరు చూస్తారుగా. 'చిన్నారి పాపలు'లో డాక్టరు వేషం ధరించిన శ్రీమతి సావిత్రి యిందులోకూడ లేడీడాక్టరు పాత్రను పోషిస్తుంది. ఇందులో డాక్టరుమాత్రమే కాదు—యీ చిత్రానికి డైరెక్టరు కూడ యీవిడే; సంగీతాన్ని చలపతిరావు, సంభాషణలను అప్పలాచార్య, కెమేరాను సింగ్, శేఖర్లు నిర్వహిస్తున్న యీ చిత్రం ఒకే ఒక షెడ్యూలులో తయారౌతుంది.

—శ్రీనివాస్



శ్రీ రాజా ఆర్ట్ ఫిలింస్ చిత్రంలో విజయనిర్మల, సావిత్రి



నవశక్తి వారి 'నిండు సంసారం' షూటింగ్ ప్రారంభ పూజరోజున శ్రీమతి ఎస్. వరలక్ష్మి, మాస్టర్ రాజ్ కుమార్, శ్రీయుతులు ఎన్. టి. ఆర్., నారాయణరావు (జోతీ పిక్చర్స్), పి. గంగాధరరావు, సి. ఎస్. రావు, త్రివిక్రమరావు, సత్యం (కెమెరా)

ఆటలు

# పార్లమెంట్ - ఫుట్ బాల్



ఇటీవల లోక్ సభలో విద్యాశాఖ (స్టేట్‌హోదా కల) మంత్రి శ్రీ భగవత్‌ఝా అజాద్ అన్నారు— "ఫుట్ బాల్ ఆటలో భారతదేశం స్థాయి అంతర్జాతీయ స్థాయికి చాలాతక్కువగా ఉంది." ఈ అభిప్రాయప్రకటన ఒక ప్రశ్నని లేవతీసింది. ఆప్రశ్నకి సమాధానంగా మంత్రిగారు, "కొంతకాలంగా స్థాయి తగ్గిపోతూ వచ్చింది" అని అన్నారు. 90 నిముషాల ఆట 'నిబంధన' అన్ని పోటీలలోనూ అమలు పరచటంవల్ల ఫలితాలు బాగా ఉండవచ్చునని కూడా ఆయన అన్నారు. ఈ విషయం గురించి 'ఆల్ఇండియా ఫుట్ బాల్ ఎసోసియేషన్'వారు 'ఆల్ ఇండియా కవున్సిల్ ఫర్ స్పోర్ట్స్'వారి సలహాని పాటించటానికి వప్పుకున్నారు.

శ్రీ అజాద్ విదేశ పర్యటనలమీద, మెక్సికోలో ఆడపోయే జట్టుని గురించి వివరంగా మాట్లాడారు. దీనిని గురించి నేనుకొంత రాస్తాను.

క్రికెట్ పోటీలు పెడితే మంచి కలెక్షన్లు వస్తాయి. హాకీలో భారతదేశందే పయిచెయ్యి. కాని, నిజంగా జన సామన్యం చూసే ఆటలలో ముఖ్యమయినది ఏది? ఫుట్‌బాల్ ఆట అని నేను చెప్పనవసరం లేదు!

మరి ఈ ఆటల్లో భారతీయులు అంతగా పేరు సంపాదించుకోలేక పోయారంటే దానికి కారణం ఏమిటో? భారత క్రీడాకారులు కాలి బంతిని చాకచక్యంతో, వేగంతో తన్నుకుపోతూ ఆడగలరు. దానిని ఎవరూ కాదనరు. వారికి తక్కువ అయినదెల్లా మంచి దేహబలం. కండ బలం లేనప్పుడు ఎంత చాకచక్యంఉన్నా లాభం లేదు. బలంతోపాటు వోపిక కూడా ఉండాలి. ఇదిమన ఆటగాళ్లకి తక్కువ.

ఇప్పుడు 90 నిముషాల ఆటనిమొదలు పెట్టటంచేత మన ఆటగాళ్లవోపిక ఎక్కువ అవుతుందని ఆశించవచ్చు.

ఆరు సంవత్సరాల కింద జర్నాయిల్‌సింగ్ నాయకత్వం కింద భారతదేశం ఆశియా చాంఫియన్‌షిప్ గెలుచుకుంది. కాని, ఆ తర్వాత ఆసియా, మెర్డెకా పోటీలు రెండింటిలోనూ మనం అంతబాగా ఆడలేదు. మొన్నజరిగిన మెర్డెకా పోటీలో భారతదేశంసెమీ ఫయినల్ దాకాకూడా రాలేదు. మొట్టమొదటి ఆటలోనే మనజట్టు మలేసియాజట్టుతో వోడిపోయింది. బర్మాని వోడగొట్టాము కాని, తాయ్‌లాండ్ తో వోడిపోయాము. (చివరికి మలేసియా బర్మామీద గెలిచి ఛాంపియన్ అయింది).

మొత్తం 12 జట్లు ఆడాయి. చివరికి భారతదేశానికి ఆరవస్థానం వచ్చింది. దక్షిణ కొరియా కూడా మనని వోడించింది.

అంటే మనకిక బాగుపడే అవకాశం లేదా? ఎందుకులేదు!నాఅభిప్రాయంలో కొంతకాలంగా ఫుట్‌బాల్ ఆటగాళ్ళందరూ కలకత్తాకి వలస వెళ్ళిపోవటం తక్కిన రాష్ట్రాలలో ఈ ఆట స్థాయిని తగ్గించింది. ఎక్కడి ఆటగాళ్ళకి అక్కడే మంచి ప్రోత్సాహం ఉంటే దేశం మొత్తం మీద స్థాయి పెరుగుతుంది. ఈవిషయమయి ఆంధ్రపోలీసు, ఇంటెగ్రల్ కోచ్ ఫాక్టరీ, రయిల్వేవారు అందరూ తమ కృషి తాము చేశారు.

—కె. ఎస్. నరసింహన్

## విహారపుష్టిన ఇంగ్లిషు...

(23వ పేజీ తరువాయి)

కుంభరాశివారివద్ద వ్యవహారజ్ఞానం అధికంగా టుంది. కాబట్టి ధనూ రాశివారు కుంభరాశి వారిని అనుసరించడం మంచిది.

కుంభరాశియందు జన్మించిన వారికి, —— (డిశంబరు 22—జనవరి 20) యందు జన్మించిన వారికి మైత్రి విచిత్రంగా వుంటుంది. కుంభ రాశివారికి మానసిక విషయాలమీద ఆసక్తి ఉంటుంది. మకర రాశివారికి భౌతిక విషయాల మీద శ్రద్ధ ఉంటుంది. అందుచేత వీరికి తరుచుగా భేదాభిప్రాయాలు వస్తుంటాయి కాని అవసరం వచ్చినప్పుడు వీరుయేకం కాగలరు. వీరు యిద్దరూ కలిసి వ్యాపారం చేస్తే లాభదాయకంగా ఉంటుంది. కారణాంతరాల వలన వీరు విడిపోయినా, ఒకరి మీద ఒకరికి గౌరవం ఉంటుంది.

### ఆరోగ్యం వగయిరా

ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. శారీరక బలంకంటే మానసిక బలం అధికంగా ఉంటుంది. కాళ్ళకు సంబంధించిన అనారోగ్యంచేయవచ్చును. శ్రమపొందినా తుదకు విజయాన్ని సాధించ గలరు.

### వీరికి అదృష్టాన్ని కలిగించేవి

రంగు—నీలం, దానికి సంబంధించిన లేతరంగులు.

ధరించవలసినవి— నీలం, నలుపురంగుల రత్నాలు.

సంఖ్యలు— 8, 17, 26, 35, 44 వగైరా అని కొందరి అభిప్రాయం. కాని యీసమయంలో పుట్టిన వారు తమ పేరుసకు అదృష్టాన్ని కలిగించే మరొక బలమైన సంఖ్యను యెంచుకోవడం మంచిది.

వారాలు— శనివారం.

నెలలు—జనవరి 21 మొదలు ఫిబ్రవరి 19
మే 22 మొదలు జూన్ 21
సెప్టెంబర్ 23 మొదలు అక్టోబరు 22

సంవత్సరాలు (వయస్సు)—8, 17, 26, 35, 44, 53, 62 వగైరా

(వచ్చేవారం—మీనం)

—మహేష్

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

# పాండ్స్ ఫేస్ పౌడర్‌తో వనితల ముఖము గంటల కొలది మనోహరమైన వర్ఛస్సుతో వుంటుంది

## అందు వలననే చాలమంది స్త్రీలు ఏ యితర పౌడర్ కంటే పాండ్స్ ఫేస్ పౌడర్‌నే వాడుతున్నారు

పాండ్స్ ఫేస్ పౌడర్, దాని ప్రత్యేక ఫార్ములా వలన యితర ఫేస్ పౌడర్ల కన్నా చాలాసేపు చర్మము మీద నిలిచి వుంటుంది. అతి మెత్తటి పాండ్స్ ఫేస్ పౌడర్ చర్మము మీద సునాయాసంగా పరిసమానంగా అంటి మీ ముఖమునకు మెరుగులు దిద్దుతుంది.




పాండ్స్ ఫేస్ పౌడర్ అందరి చర్మకాంతితో చక్కగా కలిసిపోయేలా వివిధ రంగులలో లభిస్తుంది: నేచురల్, రాషెల్, గోల్డెన్ రాషెల్, పీచ్ మరియు తెలుపు. అది అనువైన మూడు సైజులలో లభిస్తుంది— చిన్నది, మధ్య సైజు, పెద్దది.

Regd No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA.


# కపితాన్ ధరించిన వ్యక్తి



# కపితాన్ చొక్కా

- కంఠానికి చక్కగా సరిపడే కాలర్
- సరిగా ఫిట్ అయ్యే భుజాలు, చేతులు
- నడుము వద్ద అనుకూలంగా వుండే "టేపర్ - ఫినిష్'
- ప్యాంటు నుంచి సులువుగా పైకి రాకుండా ఉండుటకు తగినంత పొడవైన చొక్కా క్రింది భాగము
- బలంగా కుట్టబడ్డ 'క్రాస్ స్టిచ్' గుండీలు
- ఇస్త్రీ కొంచెము మాత్రమే చాలును

గోల్డ్ స్టార్
'టెరిన్'/కాటన్. ఇస్త్రీ అక్కరలేదు
సిల్వర్ స్టార్
2×2 సూపర్‌ఫైన్ కోంబ్‌డ్ కాటన్ ఇస్త్రీ కొంచెము మాత్రమే చాలును
బ్రాంజ్ స్టార్
100% కాటన్
ఎంచుకొనేందుకు తెలుపు, ఐవరీ, గ్రే, బ్లూ, ఫాన్ రంగులు
మరియు ఆకర్షణీయమైన చెక్, స్ట్రయిప్స్‌లు గల రకాలు వున్నాయి

# బొంబే డైయింగ్